॥ శ్రీహరిః ॥

915

# నీతికథా మంజరి

उपदेशप्रद कहानियाँ ( तेलुगु )



गीताप्रेस गोरखपुर
GITA PRESS, GORAKHPUR [SINCE 1923]

గీతాప్రెస్, గోరఖ్‌పూర్

॥ శ్రీహరిః ॥

# నీతికథామంజరి

उपदेशप्रद कहानियाँ (तेलुगु)

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

హిందీ మూలము :
**జయదయాల్ గోయందకా**

ఆంధ్రానువాదము :
**పెన్నా మధుసూదన్ శర్మ**

**గీతాప్రెస్**, గోరఖ్‌పూర్.

915 Updesprad kahaniya_Section_1_Front

॥ శ్రీహరిః ॥

# తొలిపలుకు

'ఉపదేశప్రద కహానియాఁ' అను పేరుతో పన్నెండు కథల సంపుటిగా హిందీలో వెలువరించబడిన ఈ పుస్తకము పరమపూజ్యులు, బ్రహ్మలీనులగు శ్రీ జయదయాళ్‌జీ గోయంద్‌కా గారిచే రచింపబడినది. వీరు హైందవ సంస్కృతికి జీవగఱ్ఱగా నిలిచి యావత్ప్రపంచము నందు నేడు జగజ్జేగీయమానముగా వెలుగొందుచున్న గీతాప్రెస్సు అను మహత్తరసంస్థను నెలకొల్పిన మహితాత్ములు. ఆధ్యాత్మిక విచార సంపన్నులు. ఆస్తిక లోకమునకు వీరు చిరపరిచితులు.

ప్రస్తుతము ఈ పుస్తకము తెలుగులో అనువదింపబడి 'నీతికథామంజరి' అను పేరుతో తెలుగు చదువరులకు అందించబడుచున్నది. సరళమైన భాషలో అనువదింపబడిన ఈ పుస్తకము నందలి పన్నెండు కథలు - జ్ఞానము, వైరాగ్యము, సదాచారము, సేవాపరాయణత, నైతికత, పరోపకారము, ఈశ్వర విశ్వాసము, భగవద్భక్తి మున్నగు సద్గుణములను చదువరుల హృదయములలో చక్కగా పాదుకొల్పగలవు. అందుచే ఈ పుస్తకము వయోభేదము లేకుండా అన్ని వర్గాల వారికి శ్రేయోదాయకమగు మార్గమును నిర్దేశింపగలదనుట అతిశయోక్తిగాబోదు.

సకల జనావళికి అత్యంత ఉపయోగకరముగా నుండుననెడు తలంపుతో ఈ కథలను జనహితార్థముగా ముద్రించుటకు మేమెంతో సంతోషించుచున్నాము. దీనిని ఒక్కసారి సాకల్యముగా తప్పక స్వయంగా చదువగలరనియు, తర్వాత ఇతరులను చదువుటకై ప్రోత్సహించ గలరనియు పాఠకలోకమును, ముఖ్యంగా పారమార్థిక మార్గమున పయనించెడు జిజ్ఞాసువులను వినయపూర్వకంగా అభ్యర్థించుచున్నాము.

ఇట్లు
**ప్రకాశకులు**

# విషయ సూచిక





# 1. కలసి ఉంటే కలదు సుఖం

## స్త్రీలకు మంచిని కూర్చే కొన్ని గృహపరమైన చిట్కాలు

(ఉపదేశాన్నిచ్చే ఒక ఉదాహరణ)

ఒక ఉమ్మడి కుటుంబంలో భార్య, భర్త, వారి ఐదుగురు అబ్బాయిలు, ఇద్దరు అమ్మాయిలు ఉన్నారు. మగ పిల్లలకి పెళ్ళిళ్లు అయినాయి. వాళ్ళలో నలుగురికి పిల్లాపాపలు కూడా కలిగారు. ఆడపిల్లలు ఇద్దరికీ వివాహం కాలేదు. అందరిలో చిన్నవాడైన అబ్బాయి పెళ్ళి కూడా కొద్దిరోజుల క్రిందటనే జరిగింది. అతని భార్య ఇంకా కాపురానికి రాలేదు. ఇలా ఇద్దరు ఆడపిల్లలతో కలుపుకొని, ఇంటిలో మొత్తం ఏడుగురు ఆడవారు వున్నారు. వాళ్ళు తలుచుకుంటే, అందరూ కలిసి ఇంటి పనిని చక్కగా చేసుకోగలిగేవారు. కానీ వారి మధ్య పరస్పరం సయోధ్య లేదు. ఒకరినొకరు అసూయతో చూసుకోవడము, ఇంటిపని నుండి తప్పించుకోవడం చేసేవారు. వారిలో ప్రతి ఒక్కరికీ ఒకటే ధ్యేయము వుండేది. అదేమంటే తక్కువ పనిచేయాలి, ఎక్కువ విశ్రాంతి పొందాలి. వచ్చిన కొత్తలో ప్రతిదినము వారు పరస్పరము తగవులాడు కొనెడివారు. ఇంట్లో అశాంతి, కొట్లాటలు రాజ్యమేలాయి. ఇలాంటి పరిస్థితిలో అందరిలో చిన్నవాని భార్య కూడా కాపురానికి వచ్చేసింది. ఆమె మంచి ఇంటి నుండి వచ్చిన అమ్మాయి. ఆమెకు చిన్నతనం నుండే మంచి శిక్షణ లభించింది. తాను ఆ కల్లోలిత వాతావరణంలోకి వచ్చిపడడాన్ని చూసి, ఆమె భయపడింది. తన అత్త, తోడికోడళ్ళు పరస్పరం కొట్లాడుకోవడాన్ని చూసి, ఆమె ఒక రోజు ఏడ్చేసింది కూడా. చాలా బాధపడి హృదయపూర్వకంగా భగవంతుణ్ణి ప్రార్థించసాగింది. భగవంతుడా! ఇదంతా చూడడానికి, వినడానికీ నీవు నన్ను ఈ ఇంటికి పంపించావా? ఇక్కడైతే నేను ఒకరోజు కూడా ఉండలేను. రాత్రింబవళ్ళు కొట్లాడుకోవడం నాకు నచ్చదు. పూర్వ జన్మలలో ఏ పాపాలను చేసానో తెలియదు కానీ, ఇప్పుడు ఈ ఇంటివాళ్ళతో పెళ్ళి అయింది.

ఏడ్చి ఏడ్చి ఆమె కళ్ళు వాచిపోయాయి. ఎవరో ఓదార్పు మాటలు

అంటున్నట్లుగా ఆమెకు స్పష్టంగా వినిపించింది. - 'అమ్మా! భయపడకు. ఈ ఇంటిని చక్కదిద్దడానికే నిన్నిక్కడికి పంపడం జరిగింది - నీలాంటి అమ్మాయి అవసరం ఇక్కడ చాలా వుంది.' ఈ మాటలను విన్న చిన్నకోడలికి చాలా ఓదార్పు కలిగింది. ఆమె భయమంతా ఎగిరిపోయింది. ఆమె మనస్సులోనే తన కర్తవ్యాన్ని గూర్చి నిశ్చయించుకుంది. అసలు గొడవకు కారణాన్ని తెలుసుకోవాలనుకుంది. అపుడు, అత్త, తోడికోడళ్ళు, ఆడుపడుచులు ఇంటి పనిని వాళ్ళలో వాళ్ళు పంచుకున్నారని ఆమెకి తెలిసింది. అత్త, ఆడుపడుచులు పై పనిని చేస్తే, తోడికోడళ్ళు వంతులవారీగా భోజనాన్ని సిద్ధం చేస్తారు. మిగతా పనులన్నిటికీ వంతులు వేసుకోవడం జరిగింది. కానీ దాని ప్రకారం పని చేయాల్సిన వాళ్ళలో ఎవరైనా జబ్బున పడితే, మిగతా వారు ఆ పనిని చేయడానికి అభ్యంతరాన్ని చూపుతారు. అలా జబ్బుపడిన కోడలు ఏదో ఒక సాకును చూపి పనినుండి తప్పించుకుంటుందని ఏవో ఆక్షేపణలు చేస్తారు. గొడవకు రెండవ కారణం ఏమిటంటే - బయట నుండి ఏదేని తిండి పదార్థాలు, పానీయాలు ఇంటికి వస్తే, అందరూ అన్నింటిలో చాలా మంచిది, చాలా ఎక్కువ పాళ్ళలో, నాకు చెందాలి అని కోరుతారు. అంతే, దీనిపైన గొడవ మొదలవుతుంది. ఒకళ్ళనొకళ్ళు తిట్టుకోవడం, జుట్టు పట్టుకోవడం మొదలవుతుంది. అప్పుడప్పుడు మామూలు విషయాలను తీసికొని గొడవ లేపడం జరుగుతుంది. ఎప్పుడైనా ఒక సోదరుని కొడుకు మరొక సోదరుని కొడుకుతో కొట్లాడడం జరిగితే, దీనిపై ఆ ఇద్దరు పిల్లల తల్లులు ఒకరినొకరు చిన్నాపెద్దా తిట్లు మొదలుపెడతారు. వీటన్నిటినీ చూసి చిన్నకోడలుకు చాలా దుఃఖం కలిగింది. భగవంతుని ఆదేశాన్ని విన్నప్పటి నుండి ఆమె గొడవలను పోగొట్టడానికి ఉపాయాన్ని ఆలోచించ సాగింది. ఈ నెపంతో భగవంతుడు సేవచేసే చక్కని అవకాశాన్ని తనకిచ్చాడని ఆమె అనుకున్నది - ఒకరోజు ఆమె తమలో పెద్దదైన తోడికోడలు దగ్గరికి ఊరికే వెళ్ళింది.

ఆ రోజు ప్రొద్దున వంట చేసే వంతు ఆమెది. ఆమె తోడికోడలుతో అన్నది 'అక్కా! నేను మీ అందరిలో చిన్నదాన్ని. నేనుండగా మీరు వంట చేయడం నాకు మంచిదనిపించడం లేదు. పైగా మీకు పిల్లాపాపలను చూసుకోవాల్సిన బాధ్యతవుంది. నావంతుకు వేరే పనేదీ లేదు. కాబట్టి,

వంట చేసే బాధ్యతను నా కప్పగిస్తే బాగుంటుంది. మీరు గొప్ప ఉపకారాన్ని చేశారని భావించగలను.' ఇది విని ఆ తోడికోడలు చాలాసేపటి వరకు తటపటాయించింది. 'అమ్మా! నువ్వు హాయిగా తిని, ముస్తాబై తిరగాల్సి రోజులివి. కొంత అనుభవం వచ్చాక, పొయ్యి ఊదాల్సిన పనిని చేయి. ఇంకా కొన్నిరోజులు విశ్రాంతి తీసుకో, గృహస్థుల సుఖాన్ని అనుభవించు. చివరికెలాగూ ఇదంతా చెయ్యాల్సి వస్తుంది', అని ఆమె అంది. 'అక్క! నేను మీ కాళ్ళు పట్టుకుంటాను, ఇలా నన్ను నిరాశ పరచకండి. నేను పనిచేయాల్సిన రోజులు ఇవే. ఇప్పటి నుండే మీరు నాకు విశ్రాంతిని కల్పిస్తే ముందు ముందు ఏ పనికీ నేను సమర్థురాలిని కాను. తప్పకుండా ఏదో తప్పు నా చేత జరిగింది. లేకపోతే మీరిలా నా అధికారాన్ని నాకు ఇవ్వకుండా వుండరు.' ఇలా అని ఆ చిన్నకోడలు ఏడవసాగింది. ఇక తోడికోడలు ఎక్కువసేపు కొత్తకోడలు మాటను కాదనలేకపోయింది. తన వంతును ఆమెకు ఇచ్చేసింది. ఈ విధంగా కొత్తకోడలు లాలించి, బుజ్జగించి మిగతా తోడికోడళ్ళు నుండి కూడా వారి వారి వంతులను తానే తీసుకుంది. ఈ పనులన్నిటి బాధ్యతను తానే తీసుకుని ఆమె ఎంత సంతోషించిందంటే, ఏదో నిధి దొరికినంత సంబరపడింది. ప్రతిరోజు ప్రొద్దున్నే ఆమె చాలా ఉత్సాహంతో అందరికీ వంటను చేస్తుంది, అందరికీ భోజనాలు పెట్టి చివరికి తాను భోజనం చేస్తుంది. ఇలా చేయడంలో ఆమెకు కొంతకూడా అలసట తెలియకపోయేది. పైగా ఎక్కువ సుఖము లభించేది. రోజురోజూకూ ఆమె రెట్టించిన ఉత్సాహంతో ఈ పనిని చేయసాగింది. రుచికరంగా, త్వరగా వంటను చేసేది ఆమె. చిటికలోనే ఆమె చాలా సామగ్రిని సిద్ధం చేసుకునేది. ఎవరైనా అతిథి వచ్చినా, ఆమె విసుగుకొనేది కాదు. ఆ అతిథికి కూడా చాలా ప్రేమతో బోజనం పెట్టేది, ఎందుకంటే ఇలా చేయడంలోనే తనకు లాభముందని ఆమె భావించేది. ఈ అద్భుతమైన ఏకాగ్రతను, సేవాభావాన్ని చూసి అందరూ ఆమెను ప్రశంసించడం మొదలు పెట్టారు. ఒకరోజు అత్తగారు ఆమె దగ్గిరికి వచ్చి అన్నది. 'అమ్మాయీ! ఏంటి నీవు చేస్తున్నపని? అందరి వంతును నీపైన ఎందుకు వేసుకున్నావు?' అది విని కోడలు చాలా వినయంగా బదులిచ్చింది! 'అత్తగారూ! ఈ శరీరము ఎప్పుడో ఒకప్పుడు మట్టిలో కలిసిపోవాల్సిందని నా తల్లిదండ్రులు

నాకు నేర్పారు. దీనిని ఎక్కువలో ఎక్కువ ఇతరుల సేవలోనే వినియోగించాలి. ఇదే దీని గొప్ప ఉపయోగము. సేవయే అన్నింటికంటే పెద్ద ధనము. కాబట్టి, మీరు కూడా ఈ పనిలో నాకు ఉత్సాహాన్ని కలిగిస్తూనే వుండాలని నా ప్రార్థన.' ఈ సమాధానాన్ని విని అత్త ఆశ్చర్యపడింది. అంతేకాదు తన కోడలు ఏ దేవతనో అనుకుంది. మానవమాత్రునికి ఇట్లాంటి ఉత్తమమైన ఆలోచన కలుగదు.

మరుసటి రోజు అత్తగారు తన కోడళ్లకు ఇవ్వడానికి చాలా చీరలను తెచ్చింది. ఆమె ఒక్కొక్క కోడలుకు సంవత్సరానికి సరిపడేట్లు పన్నెండు, పన్నెండు చీరలనిచ్చింది. చిన్నకోడలేమో తన వంతుకు వచ్చిన చీరలలో రెండింటిని తీసుకొని పెద్ద తోడికోడలు దగ్గరకి వెళ్ళి వినయంగా అన్నది 'అక్కా! నేనిక్కడికి వచ్చేప్పుడు మా నాన్నగారు చాలా చీరలనిచ్చారు. వాటితో నేను చక్కగా గడపగలను. నామీద దయవుంచి మీరు ఈ రెండు చీరలను మీ దగ్గర వుంచుకోండి. దీనివలన నాకు చాలా సంతోషము కలుగుతుంది. మీకు ఋణపడివుంటాను.' అనగానే ఆ తోడికోడలు చాలా సంకోచించింది. కానీ చిన్నకోడలుకున్న ప్రేమానుగ్రహములను చూసి ఆ చీరలను తీసుకోకుండా ఉండలేక పోయింది. ఇలాగే ప్రేమానుగ్రహములతో ఆ చిన్నికోడలు రెండు, రెండు చీరలను తన ఒక్కొక్క తోడికోడలుకి, రెండు చీరలను తన అత్తగారికి, ఒక్కొక్క చీరను తన ఆడపడుచులకు ఇద్దరికీ ఇచ్చింది.

ఆమె ఔదార్యంగా వ్యవహరించడం అందరి మనసులపై గాఢమైన ముద్రవేసింది. అత్తగారు అడిగినపుడు చిన్నకోడలిలా చెప్పింది. అమ్మా! ఈ పనిలో కూడా మీ సహాయాన్ని, ప్రోత్సాహాన్ని కోరుతున్నాను. శరీరంలాగానే బట్టలు మొదలైనవి కూడా క్షణంలో నశించేవి. వీటిని సమకూర్చుకోవడం కూడా తన కల్యాణంలో విఘ్నము. బ్రతికి వున్నంత కాలము మోహము, ఆసక్తి మొదలైన వాటివల్ల వీటిలో చిక్కుకుంటాము, మరణించేపుడు కూడా వీటిపై మనసు లాగితే ప్రేతము మొదలైన జన్మలలో భ్రమించాల్సి వస్తుంది. కాబట్టి, సేవా కార్యక్రమాలలో మనస్సును నిలుపడమే వీటికి సర్వోత్తమమైన ఉపయోగము. లేకపోతే, ఒకనాటికి ఇది ఇలాగే నశించి పోగలదు. కోడలి మాటలు విని అత్త చాలా సంతోషించింది. ఆమెను పొగడడం మొదలుపెట్టింది.

ఇక్కడ ఒకవైపు ఇంట్లో డబ్బు కూడా పెరిగింది. మామగారు కోడళ్ళకు ఒక్కొక్కరికి ఆరు చొప్పున నగలను తయారుచేయించి ఇచ్చాడు. చిన్నకోడలు తన వాటా నగలను కూడా తన నలుగురు తోడికోడళ్ళకు, ఆడపడుచులకు పంచింది. తన వంతుకు ఒక్క నగను కూడా వుంచుకోలేదు. అత్తగారు అడిగినప్పుడు ఇలా చెప్పింది. నా దగ్గర మా నాన్నగారు ఇచ్చిన నగలు చాలా పడి వున్నాయి. నాకు అవే చాలు. ఈవిధంగా ఆమె మంచి ప్రవర్తనతో, ఉదారతతో అందరి హృదయాలలో స్థానాన్ని సంపాదించుకుంది. అందరూ ఆమె ప్రవర్తనతో సంతోషాన్ని పొందారు.

మళ్ళీ ఒకరోజు ఆమె అవకాశాన్ని చూసి సాయంకాలం వంట చేయడానికి ఆజ్ఞ నిమ్మని పెద్ద తోడికోడలను అడిగింది. ఆమె అన్నది 'నేనుండగా మీరు వంటచేసే కష్టాన్ని పడుతున్నారు, అంటే అది నాకు సిగ్గును కలిగించే మాట.' ఆమె ఇలా అంటూ వుండగానే అత్తగారు అక్కడికి వచ్చారు. ఆమె చాలా ఉత్సుకతతో పెద్ద కోడలిని ఇలా అడుగసాగారు. 'ఈమె ఏమాటపైన ఇంత పట్టుదలను చూపిస్తుంది' సాయంకాలం వంట కూడా తన వంతులోనే తీసుకోవడానికి పట్టుబడుతున్నదని తెలిసినపుడు ఆమె నవ్వి ఇలా అన్నది. 'మీరు ఈ చిన్న తోడికోడలుతో జాగ్రత్తగా వుండండి. మీ నుండి నిజమైన లాభాన్నిచ్చేదాన్ని కొల్లగొట్టాలని ఈమె చూస్తుంది.' పెద్దకోడలు అత్తగారి భావాన్ని తెలుసుకోలేక ఇలా అన్నది. 'అత్తగారూ! ఏమంటున్నారు మీరు? మీ చిన్నకోడలైతే చాలామంచి అమ్మాయి. అన్నిరకాల పొగడ్తలకూ తగినది. ఈమెను గూర్చి మీరీ మాటలను ఎలా అంటున్నారు?' అపుడు అత్తగారిలా అన్నది - 'నీకు అర్థం కాలేదు. మన సేవ చేసి, మనకు నగలను, బట్టలను ఇంకా కొన్ని శారీరక విశ్రాంతి నిచ్చే తుచ్ఛమైన వస్తువులను ఇచ్చి దానికి బదులుగా ఆత్మోద్ధరణకు పనికివచ్చే తపస్సు మొదలైన మన ఆధ్యాత్మిక సంపదను మననుండి లాక్కోవాలనుకుంటుంది. ఇంతకుమించి మోసమేముంటుంది? ఇతరులకు సేవ చేయడం వల్ల మనస్సు శుద్ధమై ఆత్మ కల్యాణంలో సమర్థమవుతుంది, అని ఈమె ఇంతకు ముందే చెప్పింది. శుద్ధమైన భావనతో వంట మొదలైన పనులలో ఇంటివాళ్ళ సేవ చేయడం వలన ఒక సంవత్సరంలోనే మేలు జరుగుతుందని కూడా చెప్పింది.' కాబట్టి కోడలా! సాయంకాలపు వంట

మాత్రం నా వంతున తీసుకుంటాను. నేను కూడా ఆత్మ కల్యాణానికి కృషి చేయాలి కదా! నేను కూడా ఈమె చేత ఎందుకు వంచించబడాలి? అత్తగారి మాటలను విని అందరి కళ్ళూ తెరచుకున్నాయి. ఇక అందరికీ తమ తమ బాగుకై చింత మొదలయ్యింది. చెప్పాలంటే, అందరూ పని అంటే తప్పించుకునేవారు, ఇక చిన్నకోడలు వంటపనిని తన నెత్తిపైన వేసుకోవడంతో వారు ఒక విధమైన సుఖాన్ని, సౌకర్యాన్ని అనుభవించేవారు. కానీ ఇపుడు దానికి వ్యతిరేకంగా, ప్రొద్దున్నే వంట చేసే తమతమ వంతును చిన్నకోడలి నుంచి తిరగి తీసుకున్నారు. పని విషయంలో కొన్ని రోజుల క్రిందట అందరూ కొట్లాడుకునేవారు అలాంటిది ఇపుడు అందరూ చాలా ఉత్సాహంతో, మనస్ఫూర్తిగా తమవంతు పనులను చేయసాగారు. చిన్నకోడలు ఉపాయం పనిచేసింది.

ఇక వంట పనిని ఈ కోడళ్ళెవ్వరూ తనకు అప్పగించరు అని తెలిశాక చిన్నకోడలు సేవ యొక్క వేరొక పద్ధతిని ఆలోచించింది. ఇంటిలో ప్రతిరోజు ఎనిమిది - పది సేర్ల గోధుమపిండి వాడకం వుంది. అదంతా బజారునుంచే కొనడం జరుగుతుంది. అలాకాక నేనే తెల్లవారక ముందే లేచి గోధుమలను విసిరితే ఇంకా మంచిది కదా! ఇందులో చాలా లాభాలున్నాయి. బజారు నుండి వచ్చే గోధుమపిండి మట్టికొట్టుకుపోయిన పాత గోధుమలదై వుంటుంది. దానిలో మట్టి కలిసిపోయి వుంటుంది. పైగా యంత్రాల చక్రాల మధ్య పొడి చేయడం వల్ల గోధుమల సారమంతా చచ్చిపోతుంది. అది ఆరోగ్యానికి హానికారకమవుతుంది. నా తోడికోడళ్ళు నా నుండి వంట పనిని వెనుకకు తీసేసుకున్నారు. ఇక ఆత్మ కల్యాణానికి నేనీ పనినే చేయాలి తప్పదు - అని ఈ విధంగా ఆలోచించి ఆ చిన్న కోడలు తన ఆలోచనను భర్త ముందుంచింది. వెంటనే గోధుమల కోసం ఏర్పాట్లు చేయబడ్డాయి. బజారు నుండి గోధుమపిండిని కొనడం ఆపుజేయబడింది. చిన్నకోడలు పగలు గోధుమలను విసరడం ప్రారంభించింది. శరీరం ఆరోగ్యంగా, బలంగా వుంది. మాటల్లోనే ఆమె ఎనిమిది, పదిసేర్ల గోధుమలను విసిరి పిండిని సిద్ధం చేసింది. అత్తగారికి ఈ విషయం తెలిసినపుడు ఆమె పరుగున చిన్నకోడలు దగ్గరికి వచ్చి అన్నది - 'అమ్మాయీ! ఆత్మ కల్యాణానికి ఏమైనా కొత్త పద్ధతిని వెదికి పెట్టావా ఏమిటి?' అపుడు

కోడలు డగ్గుత్తికతో అన్నది. 'అత్తగారూ! తోడికోడళ్ళు వంట చేసే పనిని తీసేసుకున్నారు. కాబట్టి ఆత్మ కల్యాణానికి రెండవదైన ఈ మార్గాన్ని వెదకాల్సి వచ్చింది. దీనిలో శారీరక శ్రమ ఎక్కువ. కాబట్టి, ఆధ్మాత్మిక లాభానికి సంవత్సర కాలం పట్టే వంటపని కంటే, గోధుమలు పట్టడంలో ఆరు నెలలలోనే ఆత్మకల్యాణం కలిగే లాభముంది. పైగా దీనిలో రెట్టింపు లాభం కూడా వుంది. ఆత్మ కల్యాణమెలాగూ జరుగుతుంది. దానితో బాటు శారీరక వ్యాయామము కూడా జరుగుతుంది. దీనితో వంట్లో సత్తువ, శక్తి వస్తాయి. రోగాలు వుండవు. దీనివల్ల గర్భిణులకు ప్రసవము త్వరగా, సుఖంగా జరుగుతుంది కూడా. ఇంటిలోని వాళ్ళకు స్వచ్ఛమైన గోధుమపిండి దొరుకుతుంది. దానివల్ల వాళ్ళ ఆరోగ్యంపై, మనస్సుపై కూడా మంచి ప్రభావ మేర్పడుతుంది. ఈ అన్ని కారణాలవల్ల ఈ పని నాకు చాలా మేలును కలిగించేది. ఈ పనిలో మీరు నాకు సహాయ పడతారని నా ఆశ.' ఈ మాటతో అత్తగారు చిన్నకోడలిని తన గురువుగా భావించసాగింది. ఆమె ఒక్కొక్క మాట సారము కలిగినట్లుగా తెలిసింది. చిన్నకోడలు చేసే ప్రతిపనినీ గౌరవదృష్టితో చూడసాగింది. తాను కూడా దానినే అనుకరించే ప్రయత్నాన్ని చేయసాగింది. చిన్నకోడలు ప్రొద్దున ఆరుగంటలకు గోధమలను పట్టే కార్యాన్ని ప్రారంభిస్తే, అత్తగారు మర్నాడు ప్రొద్దున్న ఐదు గంటలకే ఆ పనిలో మునిగిపోయింది. ఆమెను చూసి మూడవరోజు మిగిలిన కోడళ్ళు నాలుగు గంటలకే ఆ పనిని మొదలుపెట్టారు. ఇలా, పని అంటే తప్పించుకునే వారందరూ ఇపుడు పని చేయడానికి పోటీపడసాగారు. ఆత్మకల్యాణము కనిపిస్తుంది కాబట్టి అందరూ నాకే పనిచేయడానికి ఎక్కువలో ఎక్కువ దొరకాలి అని కోరుకోసాగారు. ఇది చిన్నకోడలు యొక్క రెండవ విజయము.

ఇక చిన్నకోడలు గదిని శుభ్రం చేయడం, బావి నుండి నీటిని తోడి తేవడం అనే పనిని తన బాధ్యతగా తీసుకుంది. ప్రొద్దున పనివాడు ఊడవడానికి, నీరు నింపడానికి వచ్చే సరికే చిన్నకోడలు పనంతా తానే చేసేది. అత్తగారు మళ్ళీ అడిగారు. 'అమ్మాయీ! ఈ పని చేయడంలో నీ అభిప్రాయమేమిటి?' అని - చిన్నకోడలు మధుర స్వరంతో అన్నది - 'అత్తగారూ! వీటన్నింటి భేదాన్ని మీకు చెప్పడం వల్ల నేను సేవ చేయకుండా ఉండాల్సివస్తుంది. కాబట్టి, దీని రహస్యాన్ని మీకు చెప్పకూడదను కుంటున్నాను.

ఈ అవినయంతో కూడిన ప్రవర్తనను మీరు క్షమించాలి' అనగా అత్తగారన్నారు. 'అమ్మాయీ! ఇప్పుడు నీ పనికి అడ్డు కలిగించను. కానీ, దీని ఆధ్యాత్మిక రహస్యాన్ని నీవు నాకు చెప్పు.' అనగా కోడలిలా చెప్పింది. 'అత్తగారూ! వంట పనిని చేయడంతో సంవత్సరంలో, గోధుమలను పట్టడంతో ఆరునెలలో ఆధ్యాత్మిక కల్యాణము జరిగేచోట నీళ్ళు పట్టడంలో మూడు నెలలలోనే పని నెరవేరుతుంది. ఎందుకంటే ఇది అన్నిటికంటే చాలా కష్టమైనది. శ్రమ ఎక్కువ. ప్రాణానికి కూడా అపాయమే'. ఇంకేముంది? అత్తగారు కూడా ఆమెకు ఆ పనిలో చెయ్యందించ సాగారు. ఇద్దరికీ దాంట్లో భాగస్వామ్యము ఏర్పడింది. ఇతర కోడళ్ళు ఇది చూసి అత్తగారితో అన్నారు. 'నీళ్ళు తెచ్చే వయసు కాదు మీది. కాబట్టి మీరు ఈ పనిని చేయరాదు.' అనగా అత్తగారన్నారు. 'నాకు ఆత్మకల్యాణ మవసరం లేదా ఏమిటి? నేను వృద్ధురాలిని, కాబట్టి అందరికంటే అతి త్వరగా ఆత్మకల్యాణానికి ప్రయత్నించాలి.' ఇంకేముంది? మిగతా కోడళ్ళు కూడా ఈ పనిలో చేరిపోయారు. తరువాత చిన్నకోడలు గిన్నెలు కడిగే బాధ్యతను తీసుకుంది. అత్తగారు అభ్యంతరాన్ని చెప్పారు. ఆమె అన్నారు, 'అమ్మాయీ! ఈ పనివల్ల నీ బట్టలు పాడవుతాయి, నగలు అరిగిపోతాయి. ఇలాగైతే నెలలో చాకిరీ చేసి ఐదు రూపాయలను ఆదా చేసేచోట దానికి బదులుగా నీకు పదిరూపాయల నష్టము కలుగుతుంది.' అపుడు కోడలన్నది. అలా చేయడంలో ఆర్థికంగా లాభం కంటే నష్టమే ఎక్కువని ఒప్పుకుంటాను. కానీ, నా బట్టలు పాడయినా సరే, నా మనస్సు దీనితో త్వరగా శుభ్రమవుతుంది. ఎక్కువ కఠినము, అందరి దృష్టిలో తుచ్ఛమూ అయిన పని ఆధ్యాత్మిక దృష్టితో అంత గొప్పది, మంచిని కలిగించేది - ఇలా గిన్నెలను కడగడంతో రెండే నెలలలో నాకు మేలు జరుగుతుందని నా నమ్మకం. ఎప్పుడైనా భగవంతుడు నాకు ఏ రోగికైనా మలమూత్రాలను ఎత్తి పారవేసే పరిస్థితినే కల్పిస్తే ఒక నెలలోనే మేలు కలుగుతుంది - భావము చాలా ఉన్నంతగా, పూర్తి నిష్కామంతో వుండడం తప్పనిసరి.

అత్తగారికైతే చిన్న కోడలి మాటలపై ఇపుడు వేదవాక్యాలపై ఏర్పడేంత శ్రద్ధ ఏర్పడింది. తాను కూడా గిన్నెలను కడగడంలో చిన్న కోడలికి సహాయపడసాగింది. ఇతర కోడళ్ళు ఆమెను నివారించారు. ఆమె అన్నది

'నా పిల్లల గిన్నెలను నేను తప్పకుండా కడగవచ్చు. పైగా ముసలితనం వలన ఆత్మకల్యాణానికి నాకే అందరికంటే ఎక్కువ అధికారముంది. కాబట్టి, ఈ విషయంలో మీరు పట్టుదలను చూపకండి.' ఇక కోడళ్ళందరూ ఆ పనిలో చేరిపోయారు. పని అంతా చాలా ఉత్సాహంతో జరగసాగింది. పనులలో ఏర్పరచుకున్న వంతుల విధానము మాసిపోయింది.

ఎవరికి అవకాశం దొరికితే వారు అందరికంటే ముందుగా పనిని చేయడంలో సిద్ధపడేవారు. అందరిలో పరస్పరం ప్రేమ, సద్భావన నెలకొన్నది. ఏ ఇంటిలో గొడవ, అశాంతి ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యమేలేవో ఆయింట ఇప్పుడు సుఖము, శాంతికి నెలవైనది. ఈ ఆడవాళ్ళు గొడవపడుతూ వుంటే చూసి నవ్వుకునే బయటివాళ్ళు అందరూ ఆ ఆడవాళ్ళు ఆదర్శమైన వ్యవహారాన్ని (ప్రవర్తనము) చూసి ఆశ్చర్యపడసాగారు. వాళ్ళ ప్రవర్తనను చూడడానికి నగరంలోని వాళ్ళు సందర్శకులుగా రాసాగారు. స్త్రీల ఈ ఆదర్శమయ ప్రవర్తన ప్రభావం, మగవారిపై తక్కువేమీ పడలేదు. స్త్రీలు చూస్తుండగా సోమరులు బద్ధకస్తులైన ఆ మగవాళ్ళంతా ఇప్పుడు స్త్రీల ఆదర్శమయ ప్రవర్తనను చూసి కర్తవ్య పరాయణులైనారు. దుకాణం పని ఎక్కువయ్యే చోట ఇపుడు పని కంటే పని చేసేవారే ఎక్కువయ్యారు. పని నుండి తప్పించుకోవడం వల్ల గొడవ జరిగేచోట ఇప్పుడు అందరూ పనిని ఇతరుల నుండి లాగికొని చేయసాగారు. నరకానికి తీసుకొనివెళ్ళే గొడవ జరిగే చోట ఇప్పుడు మేలును కలిగించే గొడవ జరగసాగింది. ఈ మార్పంతా చిన్నకోడలు సద్భావన, సద్విచారము మంచి పనుల సత్ఫలమని చెప్పనవసరం లేదు. ఒక్క చేప పెద్ద సరస్సునంతా నిర్మలం చేసినట్లు ఒక పవిత్రాత్మ మొత్తం ఇంటినే కాదు, వీధిని, ఊరిని, నగరాన్ని కూడా శుద్ధం చేస్తుంది. కలిసి వుండడంలోని గొప్పదనమిదే. తల్లులు, చెల్లెళ్ళు అందరూ ఈ కథ నుండి పాఠాన్ని నేర్చుకొని తమ మేలును గూర్చి నిష్కామభావనతో ఇతరుల సేవచేసే వ్రతాన్ని గ్రహించాలి. ఇలాంటి సేవ అతిత్వరగా ముక్తికి కారణం కాగలదు.

**'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్'।**

**(గీత - 2/40)**

(నిష్కామ కర్మయోగ రూపమైన ధర్మం యొక్క ఏ కొద్దిభాగమైనా గొప్ప భయము నుండి రక్షిస్తుంది.) దీనికి సమర్థంగా శ్రీమద్భగవద్గీతలో ఇలాంటి వాక్యాలనేకంగా లభిస్తాయి. భగవానుడంటాడు -

**'యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్.' ।**

**(5/12)**

(కర్మయోగి కర్మల ఫలాన్ని పరమేశ్వరుని కర్పించి భగవత్ప్రాప్తి రూపమైన శాంతిని పొందుతాడు.)

**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ।**

**(గీత - 3/19)**

ఆసక్తి లేకుండా కర్మనాచరించే మనిషి పరమాత్మను పొందుతాడు.

**సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్ వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥**

**(గీత - 18/56)**

భగవత్పారాయణుడగు కర్మయోగి కర్మల నన్నింటిని చేస్తూ కూడా నా దయవల్ల సనాతనము, వినాశనము లేనిదైన పరమపదాన్ని పొందును.

**నారాయణ! నారాయణ! నారాయణ!!!**



# 2. నామ మహిమ

(నామసంకీర్తనము శత్రువులపై విజయము)

## రాజా గోపాలసింగ్ - అద్భుతమైన భగవద్విశ్వాసము

పూర్వికుల సంక్షిప్త పరిచయము.

ఇది రమారమి విక్రమ సంవత్సరం 775 నాటి మాట. ఒక క్షత్రియ యువకుడు తన భార్యను తోడు తీసుకొని పూరి జగన్నాథుని దర్శనానికి వెళ్ళుతూ వున్నాడు. అతని భార్య గర్భవతి. ఆ సమయంలో కారు, రైలు లాంటి వాహనాలు కూడా లేవు. కాబట్టి వాళ్ళు మెల్లగా కాలి నడకనే యాత్రను చేస్తున్నారు. రాత్రి సమయంలో వారు కోతుల్పూర్ జిల్లాలోని 'లావూ' గ్రామాన్ని చేరినపుడు విశ్రాంతి కోసం ఒక గృహస్థుని యింటి తలుపు తట్టారు. పాతమిత్రుడు వచ్చినట్లు, వాళ్ళ గురించే ఇంత రాత్రి వరకూ వేచి చూస్తున్నట్లు, ఆ గృహస్థుడు వీళ్ళకు ఎంతో సత్కారం చేశాడు. అదే రాత్రి క్షత్రియ యువకుని భార్య ఒక అందమైన మగ బిడ్డను ప్రసవించింది. ఇదే మగబిడ్డ ముందు ముందు మల్లరాజ్యము మొదలైన వాటిని స్థాపించినాడు. అందుకే అతన్ని 'ఆదిమల్ల' అనేవారు. ఆదిమల్ల జన్మించిన ఇల్లు కూడా క్షత్రియులదే. వారి ఇంటిపేరు కూడా మల్ల. కాబట్టి ఈ రాజుల బిరుదు 'మల్ల' అని, వీరి రాజ్యము పేరు 'మల్లభూమి' అనీ ఏర్పడినది.

ఈ శిశువు పుట్టిన మూడు రోజుల తరువాతనే ఇతని తండ్రి పూరి జగన్నాథం వెళ్ళాడు. అక్కడే అతను మరణించాడు. ఆ తరువాత ఇరవై రోజులకు తల్లి కూడా 'లావు' గ్రామంలో మరణించింది. కాబట్టి, అంతకు ముందు ఆశ్రయమిచ్చిన దంపతులే శిశువును పెంచి పెద్దచేశారు. ఆ బాలుడికి 'రఘునాథుడని' పేరు పెట్టారు. రఘునాథుని పెంపుడు తండ్రి ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రముగా ఉండేది. అందుకే చిన్నతనంలోనే రఘునాథుడు అదే ఊరికి చెందిన మనోహర పంచాననుడనే పండితుని పాఠశాలలో చదువుకోవడానికి వెళ్ళాడు. అందుకు శుల్కంగా గురువుగారి

ఆవులను మేపసాగాడు. రఘునాథునికున్న చక్కటి తెలివితేటలు చూసి అందరూ ఈ పిల్లవాడు గొప్పవాడవుతాడనేవారు. కొద్ది రోజులలోనే అతడు పాఠశాల చదువును పూర్తిచేశాడు.

ఒకనాడు రఘునాథుడు గురువుగారి ఆవులను మేపడానికి పొలానికి వెళ్ళాడు. కాని మధ్యాహ్నం వరకూ తిరిగిరాక పోయేసరికి గురువుగారు చాలా కంగారు పడ్డారు. అతన్ని వెదకడానికి బయలుదేరాడు. వెదుకుతూ వెదుకుతూ గురువుగారు ఒక మర్రిచెట్టు నీడలో అలసి నిద్రిస్తున్న రఘునాథుణ్ణి చూశారు. చెట్టు ఆకుల మధ్య నుండి వచ్చి ఎండ అతని ముఖంపై పడసాగింది. ఆ ఎండ నుండి రక్షించడానికి ఒక పెద్ద నాగుపాము తన పడగను గొడుగులా విప్పి అతని తల దగ్గర నిలిచి వుంది. ఇది చూసి పండితుల గారికి చాలా ఆశ్చర్యం కలిగింది. వెంటనే ఆయన ఈ బాలుడు సాధారణ మానవుడు కాదని, గొప్పవాడని తెలుసుకున్నాడు. కొద్దిసేపటి తరువాత పాము వెళ్ళిపోయింది. పంచావన పండితుడు రఘునాథుని తీసుకొని ఇంటికి వచ్చేశారు.

కొంతకాలం తరువాత 'లావు' గ్రామం రాజు మరణించగా రఘునాథుడే అక్కడి రాజుగా చేయబడ్డాడు. అప్పటి నుండి 'మల్లరాజ్యము' మొదలైంది. రఘునాథుని మరణం తరువాత అతని కొడుకు జయమల్లుడు రాజైనాడు. అతడు ప్రద్యుమ్నపురాన్ని జయించి (లావు గ్రామ రాజధానిని) తన రాజధానిని ప్రద్యుమ్నపురానికి మార్చాడు. అక్కడ ఒకరొకరుగా రాజైనారు. పన్నెండవతరంలో ఖడ్గమల్లుడు రాజైనాడు, అతనే ప్రస్తుత ఖడ్గపురాన్ని జయించి దానికి ఖడ్గపురమనే పేరు పెట్టాడు. తరువాత పందొమ్మిదవ తరంలో జగన్మల్లుడు రాజైనాడు. అతడు దగ్గరలోని వనంలో రాజధానిని స్థాపించాడు. తన కులదేవత పేరు మీద దానికి 'విష్ణుపురమ'ని పేరుపెట్టి అక్కడే వచ్చి వుండసాగాడు.

## హంబీరమల్లుని పరాక్రమము - వైష్ణవము

శతబ్దాలు గడిచాయి. ఒకరి తరువాత ఒకరు రాజైనారు. ప్రతిరాజు తన ఇష్టం ప్రకారం రాజధాని అభివృద్ధికై ప్రయత్నించేవాడు. ఢిల్లీ సింహాసనంపై

అక్బర్ పాదుషా ఉన్న సమయంలో మల్లభూమి యొక్కరాజు హంబీరమల్లుడు. మల్లరాజులలో ఈ హంబీరుడు చాలా ప్రధానమైన వాడైనాడు. అతడు సాహసి అయినట్లే విద్వాంసుడు, రాజ్యనిర్వహణలో నేర్పరి. ముసల్మానుల ఆక్రమణల నుండి రాజధానిని సురక్షితంగా వుంచడానికి ఇతడు రెండు దుర్గాలను నిర్మింపజేశాడు.

ఈ హంబీరుని సమయంలోనే పఠానుల సేనాపతి దావూద్‌ఖాన్ విష్ణుపురంపైన దాడిచేశాడు. భయంకరమైన యుద్ధం జరిగింది. మల్లసేన చాలా పరాక్రమంతో పోరాడింది. చివరకు దావూద్‌ఖాన్ ఓడి పారిపోవాల్సి వచ్చింది. ఈ యుద్ధంలో పఠానుల సైనికులు ఎంతమంది చనిపోయారంటే యుద్ధ స్థలమంతా సైనికుల మొండెములతో నిండిపోయింది. ఇందువల్లనే ఆ స్థానం పేరు 'ముండమాలాఘాట్' అని ఏర్పడింది. ఇది ప్రస్తుత విష్ణుపురానికి మూడు మైళ్ళ దూరంలో నది ఒడ్డున ఉన్నది. దుర్గం ధ్వంసం కాగా మిగిలిన అవశేషాలు ఇప్పటికీ అక్కడ కనిపిస్తాయి. చాలా సంవత్సరాలయ్యాయి, నదీ ప్రవాహంలో మట్టి కొట్టుకుపోవడంతో ఒక పెద్దఫిరంగి మట్టి కింద నుంచి బయటపడసాగింది. అదే ఇప్పుడు విష్ణుపురం యొక్క సైనిక న్యాయస్థానము ఎదుట పెట్టుబడివుంది.

హంబీరుడు గొప్ప యోధుడు, విష్ణుభక్తుడు కూడా. అతని కాలం నుండే మల్లవంశరాజులు వైష్ణవ ధర్మం యొక్క ప్రచారానికి తమకు తోచినట్లు ధనాన్ని వెచ్చించసాగారు. రాజు వీరహంబీరుడు తన జీవితం మొదట్లో వైష్ణవ ధర్మాన్ని గూర్చి విశేషంగా తెలుసుకోలేదు. ఒకమారు శ్రీజీవగోస్వామి మరియు శ్రీకృష్ణదాసు కవిరాజు మొదలైన వైష్ణవులు ఆచార్య శ్రీనివాస, నరోత్తమదాస, శ్యామానంద అనే ముగ్గురు వైష్ణవులతో వైష్ణవ గ్రంథాలను మూడు, నాలుగు ఎడ్లబండ్లపై సర్దిపెట్టి బృందావనము నుండి గౌడదేశానికి పంపినారు. మార్గము చాలా దూరమైనది. ముగ్గురు గోస్వాములు మార్గాయాసాన్ని సహిస్తూ తమ దేశానికి వెళ్ళసాగారు. దారిలో వారు రఘునాథపురం పొలిమేరలు దాటి గోపాలపురాన్ని చేరినపుడు ఎడ్లను విప్పివేసి తాము కూడా విశ్రాంతి తీసుకోసాగారు. వారికి గాఢమైన నిద్ర వచ్చింది. అపుడు విష్ణుపురానికి చెందిన రాజసైనికులు ఆ ఎడ్లబండ్లపై

నున్నవి చాలా విలువగల వస్తువులనుకొని వాటిని మెల్లగా అక్కడి నుండి విష్ణుపురానికి తీసుకొనిపోయారు.

ఇక్కడ నిద్ర నుండి మేల్కొన్న గోస్వాములు. తమ ఎడ్లబండ్లను, పుస్తకాల జాడ తెలియక చాలా ఆందోళన చెందారు. శ్రీనివాసుడైతే పిచ్చివానిలాగా మురికి బట్ట పీలికలలో చుట్టబడిన గ్రంథాలను వెదుకుతూ ఒక ఊరి నుండి మరొక ఊరికి కాలుగాలిన పిల్లిలా తిరిగివచ్చారు. కాని శ్రీనివాసుడు ప్రతి వనంలో, గ్రామంలో తిరుగుతూ ఒక రోజు విష్ణుపురం నుండి నాలుగుమైళ్ళ దూరంలో న్ను దేవలీ గ్రామానికి వచ్చాడు. అక్కడ శ్రీకృష్ణవల్లభ చక్రవర్తి కలవడం జరిగింది. మాటలలో ఆయన ఈ వృత్తాంతాన్ని గురించి తెలుసుకున్నాడు. శ్రీనివాసుణ్ణి ఓదారుస్తూ ఇలా అన్నాడాయన - 'మీరు వీటి గురించి బాధకండి. మన రాజు చాలా ధార్మికుడు, దయగలవాడు, ఆయనకు విషయాలనన్నిటినీ స్పష్టంగా చెప్తే ఆయన తప్పక దీని గురించి తగిన ఏర్పాటు చేస్తాడు'.

తరువాత ఒక రోజు శ్రీకృష్ణవల్లభులు శ్రీనివాసుణ్ణి తీసికొని రాజాస్థానానికి వెళ్ళాడు. అదే సమయంలో అక్కడ గొప్ప సమావేశ ఉత్సవంలో శ్రీమద్భాగవత ఉపన్యాసం జరుగుతూ వుంది. ఉపన్యాసకుడు రాజ ఆస్థాన విద్వాంసుడై పండితుడైన వ్యాసచక్రవర్తి. వారు రాసపంచాధ్యాయి యొక్క అర్థాన్ని చెప్పుతున్నారు. కానీ ఆ అర్థం సరైనది కాదు. కాబట్టి శ్రీనివాస పండితునితో అతనికి వివాదము మొదలైంది. శ్రోతలు, రాజు కూడా శ్రీనివాస పండితుడినే ఉపన్యసించమని వినయంగా ప్రార్థించారు. పాపం శ్రీనివాసుడేమి చేస్తాడు? కథ చెప్పక తప్పలేదు. భాగవతంలోని ప్రత్యేక శ్లోకాన్ని తీసికొని శ్రీనివాసుడు మధురమైన భాషలో వివరిస్తుంటే శ్రోతలు ముగ్ధులైనారు. రాజు, మంత్రి, సభాసదులు అందరూ కథను విని ఆనందించారు. రాజు అమిత భక్తితో శ్రీనివాసునికి నమస్కరించి అతని పాదధూళిని శిరసావహించి, అతని గురించి వివరాలు అడిగాడు. శ్రీనివాసుడు తనను తాను పరిచయం చేసుకుని, రాజాస్థానానికి వచ్చిన కారణాన్ని కూడా తెలిపాడు.

శ్రీనివాసాచార్యుని మాట విని రాజు తన సేవకుల తొందరపాటు

పనికి పశ్చాత్తాపాన్ని చెంది చేతులు జోడించి అతనితో అన్నాడు. "స్వామీ నిజంగా ఇది మా గొప్ప అదృష్టము కనుకనే బండ్లతో సహా మీ గ్రంథాలను ఇక్కడ వుంచాము. లేకపోతే మీవంటి మహాపురుషులు నా ఆస్థానానికి ఎలా వస్తారు? మీ పవిత్ర పాదాలను సేవించి ధన్యుడనైనాను. నా వంశము, పూరీ క్షేత్రము ధన్యమైనవి. ఇప్పుడీ అధముని తప్పులను క్షమించండి. మీ గ్రంథాలన్నీ సురక్షితంగా వున్నాయి. వాటిని తీసుకొని నా తప్పుకు ఏ శిక్షనివ్వాలో ఇవ్వండి" అని రాజు శ్రీనివాసుని కాళ్ళపై పడ్డాడు. శ్రీనివాసాచార్యునికి దయ కలిగింది. రాజును ఓదార్చి అతడు తరువాత ఆషాఢమాస కృష్ణపక్ష తృతీయాతిథి నాడు అతనికి 'శ్రీరాధా కృష్ణమంత్ర' దీక్ష నిచ్చాడు. (అప్పటి నుండి మల్లభూమి యొక్క రాజులు వైష్ణవధర్మ దీక్షను అనుసరించసాగారు.)

రాజా వీరహంబీరుడు పరమ వైష్ణవుడైనాడు. రాజు ప్రార్థించగా శ్రీనివాసాచార్యుడు కొన్నిరోజులు విష్ణుపురములో వున్నాడు. కొంతకాలము తరువాత రాజు తన గురుదేవుడైన శ్రీనివాసాచార్యుని తోడుగా తీసుకొని బృందావనానికి వెళ్ళి అక్కడి తీర్థాలన్నీ పర్యటించి తిరిగి రాజధానికి వచ్చాడు. బృందావనము నుండి వచ్చిన రాజు రాజధానిని వైష్ణవధర్మ నియమాల ప్రకారం అలంకరించసాగాడు. విశేష ధనాన్ని వెచ్చించి యమున, కాళింది, శ్యామకుండము, రాధాకుండము అను పేర్లు గల నాలుగు చెరువులను కట్టించాడు. విష్ణుపురానికి దగ్గరలోనే రెండు ఊళ్లకు ద్వారక, మథుర అని పేర్లు పెట్టాడు. ఇదంతా చూసి వైష్ణవకవులు, సాధువులు విష్ణుపురాన్ని 'గుప్తబృందావనము' అనిరి.

రాజు ప్రసిద్ధులైన శిల్పులచేత ఒక కృష్ణ విగ్రహాన్ని చేయించి గొప్ప వైభవముగా దానిని ప్రతిష్ఠింపజేశాడు. కానీ తన జీవితకాలంలో కృష్ణచంద్రుని మందిరాన్ని నిర్మింపజేయలేకపోయాడు.

అతని కుమారుడు రఘునాథసింహుడు తండ్రికి దీటయినవాడు అతడు కృష్ణ మందిరాన్ని నిర్మింపజేశాడు. ఈ మందిర మిప్పటికీ వుంది. మందిరం పైన వున్న శిలాశాసనం ప్రకారం ఈ మందిరం క్రీ.శ. 1656లో నిర్మించబడింది.

# రాజా రఘునాథుని భగవత్ప్రేమ - శ్రీమదనమోహన విగ్రహ స్థాపన.

వీరహంబీరుని మరణం తరువాత అతని కుమారుడు రఘునాథుడు రాజయ్యాడు. ఇతను కూడా తండ్రిలాగా గొప్ప యోధుడు, బుద్ధిమంతుడు. రాజమహలు సంస్థానపు నవాబు షాహషుజా ఒకరోజు ఏదో నెపం మీద రఘునాథుని తన దర్బారుకి పిలిపించి బందీగా చేశాడు. చివరికి అతని పరాక్రమము, సాహసములను పరీక్షించడానికి నవాబు ఒక పొగరుబోతు గుర్రంపై అతన్ని స్వారీ చేయుమని ఆజ్ఞాపించాడు. గుర్రం చాలా పొగరుగా వుంది. కాని రఘునాథుడు చాలా సాహసంతో దాన్ని తన వశంలోనికి తెచ్చుకొని స్వారీ చేస్తూ వెనుకకు తెచ్చాడు. దీనితో ప్రసన్నుడై నవాబు రఘునాథుని చెరనుండి విడిపించి అతనితో మైత్రిని ప్రకటించాడు. రఘునాథుడిని సన్మానిస్తూ నవాబు అతనికి 'సింహ'మనే బిరుదునిచ్చాడు. రఘునాథుని సమయం నుంచే మల్ల రాజులకు పౌరుషనామము ఈ 'సింహ' మనే పదము ఏర్పడింది.

నవాబు వీడ్కోలు పలికి రాజు రఘునాథసింహుడు విష్ణుపురానికి బయలుదేరాడు. వెళుతూ వెళుతూ వారు ఒక ఊరికి చేరుకున్నారు. వారంతా వైష్ణవులు కాబట్టి అన్ని రకాల చోట్ల భోజనం చేయరు. అలాగే విష్ణుచరణోదకాన్ని, తులసీదళాన్ని తీసుకోకుండా నీరు కూడా తీసుకోరు. ఆరా తీసి వాళ్ళు ధరణీధరుడనే బ్రాహ్మణుని ఇంటికి అతిథులుగా వెళ్ళారు. ఆ బ్రాహ్మణుడు చాలా పేదవాడు. అయినా కూడా చాలా ప్రయత్నించి రఘునాథున్ని ఇంటిలో వుంచి, తనకు దొరికిన పత్రం, పుష్పం మొదలగు వానితో అతనికి అతిథి సత్కారమును చేసి భోజనం పెట్టాడు. బీదవాడైనా ఆ బ్రాహ్మణుడు చాలా ధర్మబుద్ధి గలవాడు. ఎప్పుడూ అన్యాయాన్ని చేయడు, అబద్ధాన్ని చెప్పడు. ఆ బ్రాహ్మణుని ఇంటిలో శ్రీరాధాకృష్ణుని విగ్రహము వుంది. దానిపేరు మదనమోహన స్వామి. ఆ స్వామి అద్భుతమనోహర రూపాన్ని చూసి రాజు ముగ్ధుడైనాడు. అతను పదివేలు తీసుకొని ఆ విగ్రహాన్నివ్వమన్న ప్రస్తావన తెచ్చాడు. రూపాయలకు బదులుగా

మదనమోహనస్వామినివ్వడమా - ఇది ఆలోచించి బ్రాహ్మణుడు కలవరపడి ఏడవడం మొదలుపెట్టాడు. చిన్నపిల్లవానిలా ఏడుస్తూ అన్నాడు. 'నువ్వెంత ధనమిచ్చినా సరే, నేను నా భగవంతుణ్ణి నీకివ్వలేను.'

రాత్రి నిద్రిస్తున్న రఘునాథునికి స్వప్నంలో భగవంతుని ఆదేశమైంది. దాని ప్రకారమతను నిశ్శబ్దంగా మదనమోహన స్వామిని తన ఒళ్ళో పెట్టుకొని, దుప్పటితో కప్పి ఆ ఇంటి నుండి బయటపడ్డాడు. అతని చేతులు, కాళ్ళు, గుండె వణకసాగాయి. రాజు తన జీవితంలో ఎప్పుడూ ఇలాంటి పనిని చేయలేదు. అందుచేత అతని శరీరమంతా వణకసాగింది. ఏం చేస్తాడు? ఇష్టదైవము ఆదేశమది - మెల్లగా ఇంటి గడియ బిగించి బయలుదేరాడు. రెండు మూడు రోజుల తరువాత విష్ణుపురాన్ని చేరాడు. రాణికి మదనమోహనస్వామి యొక్క వృత్తాంతాన్నంతా వివరించి అంతః పురంలోని ఒక రహస్య స్థానంలో శ్రీమదనమోహన స్వామిని ప్రతిష్ఠించాడు.

బ్రాహ్మణుడైన ధరణీధరుడు ప్రొద్దున్నే లేచి ప్రతిరోజు లాగానే పూలు కోసుకురావడానికి వెళ్ళాడు. తిరిగివచ్చి మందిరం గడియ తెరిచి చూసేసరికి అక్కడ మదనమోహన స్వామి లేడు, రాజా రఘునాథుడూ లేడు. బ్రాహ్మణుడు బాగా దుఃఖించి తలకొట్టుకొని ఏడువసాగాడు. రఘునాథుడే స్వామిని తీసికొని పారిపోయాడని అతనికి నిశ్చయమైంది. ఇలా ఆలోచించి ఆ బ్రాహ్మణుడు అలా దుఃఖంతో కలవరం చెంది రఘునాథుణ్ణి, మదనమోహన స్వామిని వెదకడానికి ఇంటినుండి బయలుదేరాడు. చాలాచోట్ల తిరిగి, తిరిగి చివరికి ఒకరోజు విష్ణుపురాన్ని చేరాడు. అక్కడ సుమారు ఒక నెల ఇల్లిల్లూ తిరిగినా తన స్వామి జాడ తెలియలేదు. అపుడు ప్రాణాన్ని విడవాలని నిశ్చయించుకొని నది ఒడ్డుకు చేరుకున్నాడు.

అక్కడ ఒక వృద్ధురాలు నదిలో దూకబోతున్న బ్రాహ్మణున్ని ఆపి అన్ని విషయాలనూ అతని నుండి తెలుసుకొని ఇలా అన్నది. 'ఈ విషయాన్ని ఎవరికీ చెప్పవద్దు. ఇక్కడి ప్రభువు, రాజా రఘునాథసింహ ఎక్కడి నుండో ఒక భగవన్మూర్తిని తెచ్చి అంతఃపురంలో రహస్యమైన చోటున దాచివుంచాడని నేను విన్నాను. అక్కడికి వెళ్ళి అతను నీ మదనమోహన స్వామియా కాదా అని జాడ కనుక్కో.'

ఆ వృద్ధురాలి మాటలు విని బ్రాహ్మణుడు ప్రసన్నుడై రాజు గారి దర్బారుకి చేరుకున్నాడు. బ్రాహ్మణుని గుర్తుపట్టిన రాజు భక్తి శ్రద్ధలతో అతనికి ఆదర- సత్కారాలు చేసి ధనము, రత్నాలు కావలిస్తే తీసుకొమ్మన్నాడు. ఏడుస్తూ బ్రాహ్మణుడిలా అన్నాడు. 'రాజా! నేను నిరుపేదను, నిరుపేదగానే వుండగోరుతున్నాను. ధన సంపదలను తీసికొని ఏమి చేసుకుంటాను? వీటి అవసరం నాకు లేదు. మీరు నా మదనమోహన స్వామిని తెచ్చారు. ఆ స్వామిని నాకు తిరిగి ఇవ్వండి. నేను మీ కాళ్ళు పట్టుకుంటాను. నా స్వామిని కళ్ళారా చూడాలనుకుంటున్నాను. దయచేసి నా స్వామిని నాకు చూపించండి.' అనగా రాజు ఆలోచనలో పడిపోయాడు. వేరొక ఉపాయాన్ని చూడక ఆ రాజు బ్రాహ్మణునితో అన్నాడు. 'దయచేసి మీరు కొద్దిరోజులు ఇక్కడ విశ్రమించండి. నేటి నుండి మూడు రోజుల తరువాత మీకు మదనమోహన స్వామి దర్శనాన్ని కలుగజేస్తాను.' రాజు మాటలవల్ల బ్రాహ్మణునికి చాలా ఆనందం కలిగింది. రెండు చేతులనూ ఎత్తి అతను రాజును ఆశీర్వదించాడు.

మదనమోహనుడు తన తలపై చేతిని తిప్పుతూ ఇలా అన్నట్లు బ్రాహ్మణుడు కలగన్నాడు. 'నీ భక్తితో నేను సంతోషించాను. దుఃఖించకు. ఇంటికి వెళ్ళు. ఇక్కడి ఈ రాజు కూడా నాకు గొప్ప భక్తుడు. నా కోసం ఇతను రాజ్యాన్నే మరిచాడు. ఇతని భక్తితో నేను బంధింపబడ్డాను. కాబట్టి ఇప్పుడిక్కడే వుంటాను. కానీ నీ దగ్గరకు ప్రతిరోజు వస్తాను. నీవు ప్రతిరోజు నన్ను చూడగలవు. ప్రతిరోజు నేను మందిరంలో సింహాసనంపై చింతచిగురును పెట్టి తిరిగి వస్తాను. వాటిని చూసి నీవు రోజూ నేను వస్తున్నట్లుగా తెలుసుకోగలవు.

తెల్లవారగానే రాజు బ్రాహ్మణుని పిలవడానికి స్వయంగా వెళ్ళాడు. వినయంగా బ్రాహ్మణునితో అన్నాడు. 'స్వామీ! నా తప్పు లెక్కించక మీరు నాతో బయలుదేరండి. స్వామి దర్శనాన్ని మీకు చేయిస్తాను. తరువాత మీకేది సరైనదని తోస్తే అలా చేయండి.' రాజు మాటను విని బ్రాహ్మణుని ఆనందానికి హద్దే లేకుండా పోయింది. అతను రాజు వెంట బయలుదేరాడు. అంతఃపురంలోకి వెళ్ళి స్వామిని చూడగానే అతడు స్పృహ కోల్పోయిన వానివలె అయ్యాడు. అతనిలో మాట్లాడే శక్తి లేకుండా పోయింది. కళ్ళ

నుండి ఏకధాటిగా కన్నీరు ప్రవహించి అతని ఎద అంతా తడిసిపోయింది. అతను తదేకంగా మదనమోహన స్వామి వైపే చూస్తూ వుండిపోయాడు. ఆ స్వామి మూర్తి మనోహరంగా అన్ని అలంకారాలతో వుంది. రాజా రఘునాథ సింహుడు స్వామిని విష్ణుపురానికి తెచ్చిన నాటి నుండి పనులన్నీ విడిచి స్వామి దగ్గరే వుండేవాడు, విలువైన పదార్థాలతో రకరకాలుగా స్వామి నలంకరింపజేసేవాడు. బ్రాహ్మణుడైన ధరణీధరుడు ఆశ్చర్యచకితుడై మదనమోహన స్వామి విగ్రహాన్ని చూస్తూ వుండిపోయాడు. అతని కనురెప్పలు వాలడం లేదు. అలా అతను చాలాసేపటి వరకు భక్తితో భావనతో నమస్కారాన్ని, స్తుతిని చేశాడు.

రాజు బ్రాహ్మణుని చాలా వేడుకున్నాడు. కాళ్ళు పట్టుకున్నాడు. చేతులు జోడించి వేడుకున్నాడు విష్ణుపురంలో వుండమని. అతను బ్రాహ్మణునికి భూమి నివ్వాలనుకున్నాడు. ఇల్లు కట్టించి ఇవ్వాలనుకున్నాడు. మదనమోహన స్వామి పూజ-అర్చనల భారాన్ని ఇవ్వాలనుకున్నాడు. కానీ బ్రాహ్మణుడు ఏ రకంగా కూడా విష్ణుపురంలో వుండడానికి రాజీ పడలేదు. చేతులు జోడించి మాటిమాటికి స్వామికి నమస్కరించాడు. కలలోని స్వామి ఆదేశాన్ని గుర్తు తెచ్చుకొని విష్ణుపురాన్ని విడిచి స్వామి వైపు చూస్తూ చూస్తూ బయలుదేరాడు.

ఒకమారు రథయాత్రా మహోత్సవ సమయంలో ఏనుగులు, గుర్రాలు రథానికి పూన్చబడ్డాయి. అప్పుడు భక్తిశ్రద్ధలతో ప్రార్థించినా మదనమోహనుని రథము కదలలేదు. ఎందుకంటే ఒక ముదసలి స్త్రీ వీరసింహపురం నుండి బయలుదేరి రథయాత్రను చూడాలని వస్తూ అలసిపోయి మార్గంలోనే పడిపోయింది. ఆమెకు దర్శనాన్నివ్వకుండా రథము ముందుకు కదలలేదు. చివరికి ఆమెను పల్లకిలో కూర్చోబెట్టి తీసికొని వస్తేనే రథం కదిలింది.

## రాజా గోపాలసింహుని 'రాచవెట్టి'

ఈ భక్త రఘునాథుని పవిత్రవంశంలోనే కొన్ని తరాల తరువాత క్రీ.శ. 1712 సంవత్సరంలో గోపాలసింహుడు రాజైనాడు. అతను పరమ వైష్ణవుడు. రాత్రింబగళ్ళు కేవలం భగవంతుని పేరునే జపించేవాడు. రాచకార్యాల

నుండి ఉదాసీనంగా వుండేవాడు. జపమాలను చేతిలో నుంచుకొని భక్తులతో ధర్మచర్చను చేసేవాడు. అలాగే వైష్ణవ గ్రంథాలను చదువుతూ వుండేవాడు. దారిలో ఎక్కడైనా, ఏ వైష్ణవసాధు, సన్న్యాసులను చూసినా వారిని తన భవంతికి తీసుకొచ్చి చాలా భక్తి భావంతో వారికి సేవ చేసేవాడు. భక్తుడైన రాజా గోపాలసింహుడు చాలామంది వైష్ణవులకు పన్నులులేని భూమిని దానమిచ్చాడు. వారి వంశంలోని వాళ్ళు విష్ణుపురంలో ఇప్పటికీ వాటిని అనుభవిస్తున్నారు.

ఒకమారు రాజు 'రాజదర్బారులోని ప్రతి పనివాడూ ప్రతి రోజూ కనీసం ఒక్కమారైనా సమయాన్ననుసరించి హరినామమాలను జపించాలి. జపించని వానిని శిక్ష వేయబడుతుంది.' అని ఆజ్ఞాపించాడు. అందరూ మాలలను తెప్పించి రోజూ జపాన్ని చేయసాగారు. కొన్ని రోజుల తరువాత అంతఃపురంలోని పనికత్తెలు, స్త్రీలు కూడా ప్రతిరోజూ జపమాలను త్రిప్పడం మొదలుపెట్టారు. తరువాత ఒక రోజు రాజు 'రాజధానియైన విష్ణుపురంలోని ప్రతివ్యక్తి ప్రతిరోజూ మాలను జపించాలి. వృద్ధులు, యువకులు, బాలురు, బాలికలు, స్త్రీలు అందరూ రోజుకు కనీసం ఒక్కసారైనా మాలను జపించాలి' అని ఉత్తర్వునిచ్చాడు. రాజాజ్ఞ కదా! తప్పనిసరి అయి అందరూ భగవన్నామాన్ని జపించసాగారు. రోజులో కనీసం ఒక్కమారైనా అందరూ హరినామమాలను తీసికొని కూర్చోవలసి వచ్చేది. ఏదో ఒక సాకుతో తప్పించుకునే మార్గమేదీ వుండేదికాదు. ఎందుకంటే ప్రతిమనిషి ప్రతిరోజూ మాలను జపిస్తున్నాడా లేదా అని తెలుసుకోవడానికి రాజు చాలామంది గూఢచారులను నియోగించి, తాను స్వయంగా అప్పుడప్పుడు మారువేషంలో తిరుగుతూ, చూస్తుండేవాడు. ఇప్పుడా అప్పుడా అని ఏదో ఒక సమయంలో రోజుకు ఒక్కమారు మాలను జపించాల్సి వచ్చేది. ఎందుకంటే రాజు మాలను జపించాల్సిన సమయాన్ని నిశ్చయించలేదు. భోజనానికి వెళ్ళినపుడు, వంట ఆలస్యమైనా, వడ్డించడం ఆలస్యమైనా చేతిలో మాలను పట్టుకొని బయట కూర్చునేవాడు జపాన్ని మొదలుపెట్టేవాడు. రాజాగోపాలసింహుడు చేసిన ఈ పని నిజానికి చాలా ప్రశంశనీయమే. ఏదో ఒకరకంగా తన ఆత్మీయులను భగవంతుని సేవలో లగ్నం చేసేవారే నిజమైన శ్రేయోభిలాషులు, బంధువులు కదా!

ఈ మనుష్యులకు గొంతు పట్టుకొని అమృతాన్ని తాగించాల్సి వుంది. కానీ కొందరు దీనితో కోపాన్ని పొంది దీనిని 'గోపాలసింహుని రాచవెట్టి' అనసాగారు. పోగా పోగా ఇది ఒక మామూలు వాడుకమాట అయిపోయింది. బాకుడా గ్రామంలో విష్ణుపురం దగ్గరలో ఇంకా దీని ప్రచారం వుంది. ఎవరైనా తన పని అయిపోయిన తరువాత తన శ్రమకు తగిన లాభాన్ని పొందకపోతే అతనా పనిని 'గోపాలసింహుని రాచవెట్టి' అంటాడు. ఎవరైనా పని నుండి తప్పించుకుంటే వారి యజమాని వారిని 'గోపాలసింహుని రాచవెట్టి'ని చేస్తున్నారా! అంటారు.

## విష్ణుపురాన్ని ఆక్రమించడం - సాముదాయికసంకీర్తన

మరాఠా సేనాపతి భాస్కర పండితుడు చాలా రోజుల నుండి మల్లరాజ్యంపైన దండయాత్ర చేయడానికి చక్కని అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు, కానీ మల్లరాజ్యం సైనికుల శక్తిని, యుద్ధకౌశలమును చూసి దండెత్తడానికి సాహసం చెయ్యలేకపోయాడు, కానీ గోపాల సింహుడు రాజ్యాన్ని నడపడంలో ఉదాసీనంగా ఉన్నాడని, విని భాస్కరపండితుడు ఇదే రాజ్యాన్ని ఆక్రమించడానికి సరైన అదననుకొని చాలా సైన్యముతో దాడి చేశాడు.

మల్లరాజు గోపాలసింహుని సేనాపతులకు ఈ దాడిని గురించి ఏమీ తెలియలేదు. అటువైపు ఎవ్వరి ఆలోచనా వెళ్ళలేదు. మరాఠాసేన 'ముండలాఘాట్' వద్ద చేరి నిలిచింది. అక్కడ ఒక దుర్గమున్నది దానిపై చాలా ఫిరంగులు సిద్ధం చేయబడ్డాయి. పాత పద్ధతి ప్రకారం మల్లరాజ్యంలో కాలు పెట్టేముందు శత్రువులు ఆ దుర్గంపైన అధికారం పొందవలసి వచ్చేది. లేదా పరాజయాన్ని ఒప్పుకొని పారిపోవలసి వచ్చేది.

అప్పుడు మధ్యాహ్నం సమయము. కాని సేనాపతి ఆజ్ఞపై ఒకదళం సైనికులు వెంటనే పరుగెత్తి దుర్గం దగ్గరకు చేరుకున్నారు. కానీ దుర్గంపై చాలా ఫిరంగులు సిద్ధం చేయబడి వుండడాన్ని చూసి వారికి ముందుకు వెళ్ళడానికి వేగం మందగించిపోయింది. మరాఠా సేనాపతి అదృష్టం వల్ల ఆ సమయంలో దుర్గంలో సైనికుడెవడూ లేడు. దుర్గం యొక్క సైనికులు

తమ ఇష్టం వచ్చినట్లు ఎక్కడబడితే అక్కడ తిరుగుతూ వున్నారు. లేకపోతే భాస్కర పండితునికి అక్కడే పరాజయాన్ని అంగీకరించాల్సి వచ్చేది. మరాఠా సైనికులు ఇంకా ముందుకు సాగారు. అదేసమయంలో దుర్గంలోని ఫిరంగీ సైనికుడొకడు వారిని చూసి వెంటనే దుర్గంలోకి వెళ్ళి ఫిరంగులను పేల్చడం మొదలుపెట్టాడు. వాటి చప్పుడును విని మల్లరాజ్యం ఇతర సైనికులు కూడా పరుగెత్తుకొని వచ్చి ఫిరంగులను పేల్చసాగారు. ఫిరంగుల నుండి గుండ్లు వర్షించసాగాయి. దాంతో మరాఠా సైనికులు నేలకూలసాగారు. దుర్గంలో కేవలం పదిహేనుమంది సైనికులు వున్నారు. మరాఠా సైనికులు చాలా దగ్గరకు వచ్చినందువల్ల వారిపైన ఫిరంగిగుండ్ల దెబ్బ సరిగా పడడం లేదుని చూసి మల్లరాజ్య సైనికులు తుపాలకులను పేల్చసాగారు. వారిలో ఒకడు పరుగెత్తి వెళ్ళి సేనాపతికి వార్త నందించాడు.

రాజా గోపాలసింహుడు మరాఠా సేనాపతి భాస్కరపండితుడు ఆక్రమణకు రావడాన్ని విని సేనలోని ఒక భాగాన్ని ముండమాలాఘాట్‌కి పంపాడు. భయంకరమైన యుద్ధం విరుచుకు పడింది. మల్లసేన సంఖ్య తక్కువ కానీ ప్రాణాన్ని పణంగాపెట్టి పోరాడసాగారు. మరాఠాసేనలో కూడా చాలామంది సైనికులు మరణించారు. కానీ, చివరికి వారు దుర్గంపై అధికారాన్ని పొందారు. అపుడు మిగిలిన మల్ల సైనికులు మెల్లమెల్లగా తప్పుకొని రాజదర్బారుకు వచ్చారు.

యుద్ధంలో విజయాన్ని పొంది, భాస్కర పండితుడు ఆనందించి విష్ణుపురం వైపుకు ముందుకు సాగాడు. మధ్యలో రాత్రి అయినందువలన సేనాపతి, బాటప్రక్కనే డేరావేసి విడిదిచేశాడు. అపుడు విష్ణుపురంలో సైనికులు, న్యాయాలయం ఉన్నచోటనే భాస్కర పండితుడు విడిది చేశాడు. దానితో ఇప్పటికీ ఆ స్థలం పేరు 'మరాఠా డాంగా' అని ఏర్పడింది.

కోటలోని సైనికులు పరుగెత్తి విషయం రాజుకు తెలియజేశారు. మరాఠా సైనికులు రాజధానివైపు వస్తున్నారు అని తెలిసి రాజు 'ప్రజలందరూ తమ ధనసంపత్తిని, పరివారాన్ని తీసికొని దుర్గంలోనికి వచ్చేయాలి' అని ఆదేశించాడు. ప్రజలు భయభీతులైనారు. తమ దగ్గరున్న ఏ కొద్ది ఆస్తినైనా తీసుకొని పిల్లాపాపలతో అందరూ దుర్గంలో ఆశ్రయం పొందారు. కొందరైతే

ధనసంపత్తిని అక్కడే వదలి కేవలం తమ ప్రాణాలను కాపాడుకోవడానికి దుర్గంలోకి పరుగెత్తి వచ్చారు.

తమ సేన ఓటమి పాలుకావడాన్ని విని 'ఇక వేరే ఉపాయము లేదు' అని రాజు గోపాలసింహుడు భావించి, దుర్గంలోని వారందరూ విశ్వాసంతో హరినామాన్ని కీర్తించండంటూ ఆజ్ఞాపించాడు.

ఆ సమయంలో కోటలో నలభైవేల మంది శిక్షితులైన సైనికులు వున్నప్పటికీ, వారిని జయించడం మరాఠా సేనాపతికి సులువైన పని కానప్పటికీ రాజు ఇదంతా ఆలోచించలేదు. అతను రాజధానిలోని ప్రజలందరితో హరినామ కీర్తనను చేయించసాగాడు. హరినామము యొక్క పెద్ద ధ్వనితో కోట ప్రతిధ్వనించింది. భాస్కర పండితుని అలసిన సేన రాత్రి విశ్రాంతి తీసుకోసాగింది.

కాని మల్లసేనాపతి నిశ్చింతంగా లేడు. రాజ్యంలో ఒక మూలబలము కొంత ఉంది. ఆ సైనికులు చాలా విశ్వాసం గలవారు, సాహసులు. అంతఃపుర రక్షణకోసం నాలుగువైపులా వారిని నియోగించారు. మల్ల సేనాపతులు 'ప్రాణాలుపోయినా సరే మరాఠా సైనికులు కోటవైపు (ఇంకొక్క) అడుగు కూడా వేయనివ్వముమ' అని ప్రతిజ్ఞ చేశారు. ఈ ఉద్దేశంతోనే వారు రాజు ఆజ్ఞకై వేచి చూడకుండా మల్లభూమి స్వాతంత్ర్యాన్ని రక్షించడానికి రాత్రికి రాత్రికోటకు నలువైపులా సేనను ఏర్పాటు చేసి ఫిరంగులలో గంధకాన్ని నింపి సిద్ధం చేశారు. ధనాగారాన్ని రాజప్రాసాదము యొక్క రహస్యము ప్రదేశాలలో దాచివుంచారు. రాజుకు ఈ విషయాలేవీ తెలియవు. అతను ప్రజలతో కలిసి హరినామకీర్తనను కోటలో చేయసాగాడు.

తెల్లవారగానే మల్లసైనికులు ఫిరంగులు పేల్చసాగారు. మరాఠా సైనికులు కూడా ముందుకు వచ్చారు. యుద్ధం మొదలైంది. దుర్గం ఆక్రమించడానికి మరాఠా సైనికులు కందకం దాటబోయారు, కానీ పెద్ద పెద్ద తూముల గుండా కందకంలోకి నీరు ప్రవహించే చక్కని ఏర్పాటు వున్నందువల్ల కందకం లోని నీరు వర్షాకాలంలో నదీప్రవాహంలాగా చాలా వేగంగా ప్రవహించసాగింది. కాబట్టి దానిని దాటడం వీలుకాలేదు. ఒకవైపు కోటపై చాలా ఫిరంగులను సిద్ధంచేసి వేలకొద్ది సైనికులు ఎదురు చూడసాగారు.

దుర్గద్వారం గట్టి ఇనుప తులపుతో బంధించబడి వుంది. దీనితో మరాఠా సైనికులు 'దుర్గంలో తప్పకుండా పెద్ద సేన వున్నదని' అనుమానించారు. కానీ చాలా దేశాలను జయించినందువల్ల వారిలో లోభము పెరిగింది. అహంకారము పెరిగింది. వారు పరాక్రమము, తేజస్సు, సాహసము కలవారు కూడా. కాబట్టి మల్లసేన నుండి ఓటమిని ఎలా అంగీకరిస్తారు?

అతి ప్రయాసతో వారు ఎలాగో కందకాన్ని దాటి, తుపాలకులను పేల్చి యుద్ధము మొదలుపెట్టారు. మరాఠా సైనికులు కందకాన్ని దాటడం చూసి, మల్ల సైనికులు ఒక్కసారిగా ఫిరంగులను పేల్చసాగారు. దానితోబాటు తుపాలకులను పేల్చసాగారు. మరాఠా సైనికులు మరణించసాగారు, వారి శవాలు కందకం నీటిలో కొట్టుకుపోసాగాయి. మొదట కందకాన్ని దాటిన మరాఠా దళ సైనికులలో ఒక్కడు కూడా బ్రతకలేదు. మరాఠా సేనాపతి భాస్కర పండితుడు రెండవ దళానికి ఆదేశాన్నిచ్చాడు. వారిలో కొందరు కందకాన్ని దాటారు. కానీ ద్వారం వద్దకు వెళ్ళుతుండగానే వారందరూ నేలకొరిగారు. ఈ విధంగా మరాఠా సేనాపతి మూడుసార్లు ప్రయత్నించాడు. కానీ మూడుసార్లూ ఓడిపోయాడు. మరాఠా సైనికులు చావసాగారు.

అప్పుడు కూడా రాజ గోపాలసింహుడు కోట లోపల హరినామ కీర్తన చేయసాగాడు. అందరూ ఆతురులుగా వుండి తన్మయంగా భవన్నామ కీర్తన చేయసాగారు. యుద్ధం విషయం వారికేమీ తెలియదు. కోటలో ప్రజలు భయపడుతూనే గడిపారు. ఫిరంగుల, తుపాకుల గుళ్ళ చప్పుడునైతే వింటున్నారు కానీ వాటి పరిణామమేదో ఎవరికీ తెలియదు. నిజమైన ఆర్తభక్తి మూర్తీభవించిన ప్రవాహము పారుతున్నట్లుంది. కలిసి చేసే నిజమైన ప్రార్థన యొక్క పరిణామము కలిగింది. సహజంగా దయగల స్వామి కరుణాసముద్రము ఉప్పొంగింది. భగవంతుని లీల మొదలయింది.

## మదనమోహనస్వామి ద్వారా ఫిరంగి దాడి - శత్రువుల పరాజయం

యుద్ధం చేస్తూ చేస్తూ రెండువైపులా సేనలు అలసిపోయాయి. మరాఠా సైనికులు కందకాన్ని దాటి విశ్రాంతికై అరణ్యంలోకి వెళ్ళిపోయారు. అప్పుడు

మల్లసేనకు కూడా విశ్రాంతి దొరికింది. ఈ మధ్యలో మల్లసేన ఫిరంగులలో మందు నింపసాగింది. కొత్త కొత్త సైనికులు దుర్గంలోకి రాసాగారు. ఆశ్చర్యంతో మల్లసేన చూస్తుండగా ఒక వ్యక్తి గుర్రంపై అతివేగంగా స్వారీ చేస్తూ రాజప్రాసాదము నుండి దుర్గంవైపు రాసాగాడు. గుర్రపు గిట్టల వల్ల రేగిన ధూళి అన్నిదిక్కులా రేగసాగింది. అతడు గుర్రపుస్వారీ ఎంతవేగంగా చేస్తున్నాడంటే అతనెవరో కూడా స్పష్టంగా కనబడడంలేదు. ఒక్కమారుగా దళంలోని ఫిరంగులు గర్జించసాగాయి. కొద్దిసేపటి తరువాత చూస్తే అరణ్యంలో మరాఠా సైనికులు విశ్రాంతి తీసుకొనే చోట ఈ ఫిరంగుల గుళ్ళు అసంఖ్యాకంగా, చినుకులవలె పడసాగాయి. దీనికి ఫలితంగా లెక్కలేనంతమంది మరాఠా సైనికులు మృత్యువుకు బలి కాసాగారు. చూస్తుండగానే భాస్కర పండితుడు పరాజయాన్ని స్వీకరించి మిగిలిన సేనను తీసుకొని మెల్లగా వెనుదిరగసాగాడు. మంచి అవకాశాన్ని చూసి మల్లసైనికులు కూడా దుర్గము నుండి బయటకు వచ్చి మరాఠా సైనికులను వెనుకనుంచి దాడి చేస్తూ వేగంగా కదలసాగారు. మరాఠా సేన చెదిరిపోయింది. సైనికులు తోచిన దిక్కుకు పారిపోయి ప్రాణాల్ని రక్షించుకున్నారు. మరాఠా సేనాపతి భాస్కరపండితుడు కొద్దిమంది సైనికులను తీసికొని, అడవిలోపల దాగుకున్నాడు. కానీ అరణ్యంలో బాటను వెదకలేకపోయాడు. చాలా రోజుల వరకు తిరిగి, తిరిగి దాక్కుంటూ వాళ్ళు మేదినీపురం జిల్లాలోని చంద్రకోణంవైపు పారిపోయారు. ఈ విధంగా మల్లరాజ్య సైనికులు ఎవరికీ లొంగని మరాఠుల గర్వాన్ని అణచివేశారు.

దళం ఫిరంగులను పేల్చడం విషయంలో అందరూ అనేదేమంటే స్వయంగా ప్రభువు మదనమోహనస్వామి ఫిరంగులను పేల్చాడని, రాజు యొక్క ప్రార్థనతో సంతోషించి రాజధానియైన విష్ణుపురాన్ని శత్రువుల నుండి ఉద్ధరించడానికి స్వయంగా భగవంతుడే ఫిరంగులను పేల్చడం వలన మరాఠులు ఓడిపోయి పారిపోయారు. మల్లసైనికులకు విజయం లభించింది. రాజధాని విష్ణుపురం వీధులలో సైనికులు స్వేచ్ఛగా నడవసాగారు. రాజధాని ప్రజలు సైనికులకు అనేక విధాల బహుమతులనివ్వసాగారు. భగవానునికి భక్తులపై నున్న వాత్సల్యానికి, భగవానునిపై విశ్వాసముంటే కలిగే అద్భుత పరిణామానికి ఇది ఉత్తమమైన ఉదాహరణము.

## గోపాలసింహుని రాజ్యపాలన సమయంలో రాజ్యము యొక్క సువ్యవస్థ

రాజా గోపాలసింహుని పాలన సమయంలో ఫ్రాన్స్ (ఫ్రెంచ్) దేశానికి చెందిన ఆబిరెన్యాల్ అనే పర్యాటకుడు విష్ణుపురానికి వచ్చాడు. అతను మల్లరాజ్యంలో తిరిగి రాజ్యరక్షణకు చెందిన వ్యవస్థను, ప్రజల సరళ వ్యవహారాన్ని మరియు అతిథి సత్కారవిషయంలో చాలా ప్రశంసించాడు. మల్లభూమి ప్రజల సొమ్మును, ధనసంపత్తిని ఎవరూ దొంగిలించేవారు కారని, రాజ్యంలో ఎప్పుడూ దొంగతనము కానీ, లూటీ కానీ, జరిగేది కాదని, అతను వ్రాశాడు. ఎవరైనా విదేశీ సజ్జనుడు మల్లరాజ్యానికి వస్తే మల్లరాజు అతని రక్షణ భారాన్ని, అతను రాజ్యంలో వున్నంతకాలము అతని ఖర్చుల భారాన్ని భరించేవాడు. విదేశీవ్యక్తితో ఎల్లప్పుడూ రాజ్యం వైపునుండి సహాయకుడు నియోగింపబడేవాడు. విదేశీయుడు రాజ్యంలో ఎక్కడికి వెళ్ళాలన్నా ఆ సహాయకుడు అతనిని అక్కడికి తీసుకొని వెళ్ళేవాడు. దీనికోసం ఎవరికీ ఒక్కపైస కూడా ఖర్చు చేయవలసి వచ్చేది కాదు. రాజ్యంలోని ప్రజలు ఎప్పుడూ ఎవరినీ హింసించేవారు కాదు, ఎవరికీ అనిష్టాన్ని కలిగించేవారు కాదు. అందరూ ఎంతో సాధుస్వభావులు, ధర్మమంటే భయపడేవారు అంటే మార్గమధ్యంలో రూపాయల సంచి దొరికినా వెంటనే రాజు వద్దకు చేర్చేవారు, దాంతో రాజు దండోరా వేయించి సంచీని పోగొట్టుకొన్నవారు వచ్చి తీసుకొని వెళ్ళాలని తెలియజేసేవాడు. గోపాలసింహుని పాలనలో రాజ్యనిర్వహణ ఇలా వుండేది.

రాజా గోపాలసింహుని మరణం తరువాత అతని కుమారుడు చైతన్యసింహుడు రాజయ్యాడు. అతను కూడా తండ్రిలాగా గొప్ప విష్ణుభక్తుడు. రాత్రింబగళ్ళు ధర్మవిచారణను ధర్మగ్రంథ పఠనాన్ని, నామ సంకీర్తనను చేసేవాడు, బ్రాహ్మణుల పట్ల పూర్తి భక్తిని కలిగివుండేవాడు.

బ్రాహ్మణుడైన ధరణీధరుని ఏ మదనమోహన స్వామి మూర్తి ఇక్కడికి తీసుకురాబడిందో, ఎవరిని రాజా రఘునాథసింగ్ మొదలైనవారు పూజించేవారో, ఆ స్వామియే ప్రస్తుతం కలకత్తాలోని బాగ్‌బాజార్ శ్రీ మదనమోహన స్వామి యొక్క మందిరంలో విరాజిల్లుతున్నాడని వినవస్తుంది. (ఈ కథ ఒక బెంగాల్ పుస్తకం ఆధారంగా సంక్షేపంగా వ్రాయబడింది).

## కొసమెరుపు

విష్ణుపురం రాజు 'గోపాలసింహుని' దళం ఫిరంగుల విషయంలో ప్రజలు ఇలా అనుకున్నారు. శత్రువుల సేనలు విష్ణుపురం నలుదిక్కులా ముందుకు చొచ్చుకొని వస్తూ కమ్ముకుంటుంటే, కోటలో వున్న సైనికులు నిరాశకు లోనవుతూంటే, దళం ఫిరంగులను ఒక పెద్ద గుఱ్ఱంపై రెండువైపులా పెట్టుకొని భగవాన్ మదనమోహన స్వామియే సైనికుడి రూపంలో స్వారీ చేస్తూ, బయటకు వచ్చి శత్రు సైనికుల డేరాలపై ఫిరంగులను పేలుస్తూ నాలుగు వైపులా అలాత చక్రంలాగా తిరిగాడు.ఆ ఫిరంగుల గుళ్ళతో చాలామంది శత్రుసైనికులు చనిపోయారు, ప్రాణాలు దక్కినవారు పారిపోయారు. తరువాత గుఱ్ఱంతో భగవానుడు కోటకు తిరిగివచ్చి ఫిరంగులను లాల్‌బాంధ్ చెరువు వద్ద దింపి మందిరంలోకి వెళ్ళిపోయాడు.

శత్రుసేనాపతికి చాలా ఆశ్చర్యమైంది. అతను 'ఒక్కడే రౌతు మాకింత నష్టాన్ని కలిగిస్తే వీళ్ళదగ్గర ఇంకా ఎంత మంది ఇలాంటి వాళ్ళున్నారో' అనుకున్నాడు. భయపడి మంత్రులతో కలిసి గుఱ్ఱం అడుగుజాడలలో విష్ణుపురం రాజా గోపాలసింహుని దగ్గరున్న మందిరంలోకి వచ్చి అతనిని శరణువేడాడు. రాజు కాళ్ళపైబడి ఆ సేనాపతి తన తప్పుకు క్షమార్పణ కోరాడు. గోపాలసింహుడు అడిగాడు. 'ఏ విషయంలో తప్పు?' దీనితో శత్రుసేనాపతి జరిగిన దానిని అంతా మొదటినుంచి చివరిదాకా వినిపించి 'మీ ఒక్క రౌతు ఫిరంగి గుళ్ళద్వారా మా సేనకింత నష్టాన్ని కలిగిస్తే మీ దగ్గర ఇలాంటి రౌతులింకెందరున్నారు?' అని అడిగాడు. అప్పుడు గోపాలసింహుడు, 'మా దగ్గరైతే గుఱ్ఱంపై ఫిరంగులను కట్టి యుద్ధము చేయగల రైతు ఎవరూలేరే! అన్నాడు. వెంటనే సేనాపతి, 'ఇది నేను, మావాళ్ళు కన్నులారా చూసిన సంఘటన - ఆ రెండు ఫిరంగులు లాల్‌బాంధ్ చెరువుకి ఇరువైపులా పడివున్నాయి. ఆ గుఱ్ఱం కూడా మందిర ప్రాంగణంలో మందిరద్వారం బయట నిలబడి వుంది. ఆ రౌతు మీ సభామండపంలోకి ప్రవేశిస్తుంటే మేము కళ్ళారా చూశాము' అనగా విని రాజు చాలా ఆశ్చర్యపడ్డాడు.

ఇద్దరూ కలిసి అక్కడి నుండి సభామండపం లోపలికి వెళ్ళగానే

శత్రుసేనాపతి మదనమోహనస్వామి నిలువెత్తు మూర్తిని చూసి వెంటనే అన్నాడు. 'ఇతనే ఆ రౌతు.'

అపుడు భగవాన్ మదనమోహన స్వామి బట్టలు చెమటతో తడిసి వుండడం చూశాడు. ఆ రాజు దీనముగా కంటనీరు తిరగగా అన్నాడు. 'అయ్యా! నేనెంతటి రాజ్యభోగాసక్తుడినో, నా ఈ తుచ్ఛమైన పనికై మీరే యుద్ధంలోకి వెళ్ళాల్సివచ్చింది,' అని శత్రుసేనాపతిని అనునయించి ఆదరంతో వీడ్కోలు పలుకుతూ అన్నాడు. 'సాక్షాత్తు భగవానుని దర్శనాన్ని పొందిన మీరు భాగ్యవంతులు. మీరు చూసిన ఆశ్చర్యకరమైన ఆ సన్నివేశం భృత్యవత్సలుడైన, శరణాగత పాలకుడైన, దయాసింధువైన, మదనమోహన స్వామి లీల!'

ఆ రెండు ఫిరంగులలో ఒకటి 'లాల్‌బాంధ్' చెరువు ఒక ఒడ్డున దగ్గరలోనే పడివుండి ఇప్పటికీ లభిస్తుంది. రెండవది ఆ చెరువు బురదలో కూరుకుపోయింది. ఈ రెండు ఫిరంగులను 'దళ - మాదళ' అంటారు. ఇవి మొదటినుండీ రాజ్యంలో వున్నాయా? లేక భగవంతుడే తెచ్చాడా? అనేది భగవంతునికే తెలయాలి. విచిత్రం ఏమిటంటే అక్కడవున్న ఫిరంగుల పొడవు సుమారు 12 అడుగులు. ఫిరంగి గొట్టము సుమారు 1 అడుగు కొలత కలిగివుంది. ఆ కాలంలో ఇంత పెద్ద ఫిరంగిని నడపగల యంత్రమూ లేదని తెలుస్తుంది. ఆ ఫిరంగి ముడి పదార్థము కూడా ఎన్నో లోహాలు కలిపి చేసినట్లు అద్భుతంగా వుంది. వందల సంవత్సరాలు గడిచినా దానిపై ఎక్కడా తుప్పుపట్టిన అనవాలు లేదు. తరువాత, ఇంత పెద్ద ఫిరంగులను గుర్రంపై ఎక్కించి వాటిని నడపడం ఎలా అన్నదే ఆశ్చర్యం! ఇంత బరువు ఫిరంగులను రెండింటిని, మోయగలిగే గుఱ్ఱము ఎక్కడ దొరకాలి. దాన్ని స్వారి ఎలా చేయాలి? ఫిరంగులు ఎలా పేల్చాలి? ఇది మానవమాత్రునికి సాధ్యమా! - ఇలాంటి అసాధ్యాలు ఎలా సాధ్యమైనాయి. దీనికి సమాధానమే! మానవాతీతమైన భగవచ్ఛక్తి.

హేతువాదులంటారు కూడా. 'ఇదంతా అబద్ధం, కల్పన మాత్రమే' అని నామకీర్తనతో శత్రువులని జయించారని చెప్పడం మూర్ఖత్వం, పిచ్చితనము. భగవంతుడే ఫిరంగులను నడిపి శత్రువులను ఓడించాడనడం

ఏ రకంగా చూచినా తెలివితక్కువ మాట. శత్రుసేన వచ్చిపడితే అందరినీ తీసుకొని ఎవడైనా నామకీర్తన చేస్తూ కూర్చుంటాడా? అంటే అది చేతకానితనం, కర్తవ్య వైముఖ్యము.

కర్తవ్యతా దృష్టిలో ఇది పూర్తిగా నిజమే. భగవంతునిపై పూర్ణవిశ్వాసముతో భరోసా లేనివాళ్ళు, మోహముతో భగవంతుని పేరుని సాకుగా తీసుకొని కూర్చున్నా, భయముతో కర్తవ్య విముఖులై తమ బలహీనతను కప్పిపుచ్చుకోవడానికి కీర్తనను ఆసరాగా తీసుకున్నా తప్పకుండా వారిది పిచ్చితనమే! చేతకానితనమే, కర్తవ్య వైముఖ్యమే! వారికి కోరిన ఫలితము కూడా దొరకదు. కానీ పూర్తి విశ్వాసము గలవారికి ఇది కల్పన కాలేదు, పిచ్చికాలేదు, అయుక్తమూ కాదు. వారి విషయంలో ఇది నగ్నసత్యమే.

ప్రాచీన ఆధునిక గ్రంథాలలో ఇలాంటి ఉదాహరణాలెన్నో దొరుకుతాయి. వాటిలో భగవంతుడు భక్తుల గురించి తానే ఏమి చేశాడో తెలుస్తుంది. 'రణక్షేత్రంలో కేవలం శ్రీకృష్ణుని చక్రమే కదులుతోంది,' అని బర్బరీకుడన్నాడు. రాణా జయమల్లుని కోసం ఇంకా ఇలాంటివే తార్కాణాలు. 'యోగక్షేమం వహామ్యహమ్' (యోగాన్ని క్షేమాన్ని వహిస్తాను) అని భగవంతుడు గీతలో చెప్పినదాని ప్రకారం ఇలా చేయడం సహజము. ఎవరికైనా కావలసింది, విశ్వాసముతో కూడిన నిజమైన నిబ్బరము. మహాత్మాగాంధి గొప్ప మేధావి. అతను కూడా ఒకచోట ఇలా అంటాడు. 'లక్షలకొద్ది మనుషులు హృదయపూర్వకంగా ఒకే లయతో పాడే రామకీర్తన శక్తి, సైన్యము శక్తి కంటే విశేషమైనది. ఎన్నోరెట్లు గొప్పదని నిస్సంకోచముగా చెప్పగలను. అయినప్పటికీ, భగవంతుని స్మరణజేస్తూ కర్తవ్యాన్ని పూర్తిగా పాలించాలి' అనేది సర్వసాధారణంగా ఉచితము, సురక్షితము. దీనిలో భగవంతుని పట్ల విశ్వాసము వుంది కర్తవ్యాన్ని పాలించడమూ వుంది. విశ్వాసము గలవారు ఈ చారిత్రక ఘటన ద్వారా తమ విశ్వాసాన్ని ఇంకా బలంగా దృఢంగా చేసుకోవాలి.

హరయే నమః



# 3. భగవదర్థ కర్మ - భగవంతుని దయారహస్యము

అన్ని ప్రాణులను, వస్తువులను, కర్మలను, భావములను భగవత్ స్వరూపముగా అనుసంధానముతో సాధనచేస్తే సాధకుని హృదయంలో ఉత్సాహము, సమదృష్టి, ఆనందము, శాంతి, అవిచ్ఛిన్నత, భగవచ్చింతన ఎప్పుడూ పాదుకొని ఉంటాయి. దీనితో భగవంతుని యందు అచంచలమైన భక్తి విశ్వాసము కలిగి, అనుగుణముగా భగవత్ప్రాప్తి కలిగి తీరుతుంది. 'ఉన్నదంతా భగవంతునిదే, నేను భగవంతునికే చెందినవాడను, భగవంతుడు అన్నిటిలో వ్యాపించి వున్నాడు. (గీత. 18/46) కనుక అందరినీ సేవించడం భగవంతుని సేవించడమే, నేను చేస్తున్నదంతా భగవంతుని ప్రేరణ ననుసరించి భగవంతుని కొరకే చేస్తున్నాను. భగవంతుడే నాకు చాలా ఇష్టమైనవాడు, అతడే మేలు గూర్చువాడు - అని ఈ విధమైన భావనతో తన ఇంటిపని, వృత్తిపనిని లేదా వేరే ఏ ఇతర ధార్మిక వ్యవస్థ పనినైనా తనకిష్టమై భగవంతుని పని అని, తాను భగవంతునికి చెందినవాడనేనని చేస్తే సాధకునికి ఎప్పుడూ విసుగు వుండదు. పైగా మనసులో ఉత్సాహము, ఆనందము, శాంతి క్రమముగా పెరుగుతాయి. ఒకవేళ అలా పెరగకపోతే, తీవ్రంగా కలగకపోవడానికి గల కారణాన్ని గూర్చి ఆలోచించాలి. శోధిస్తే భక్తివిశ్వాసము తగ్గడమే ఇందుకు కారణమని తెలుస్తుంది. ఈ లోటును తొలగించడానికి సాధకుడు భగవంతుని శరణుగోరి అతన్ని దీనముగా మనసుపెట్టి స్తుతించాలి, ప్రార్థించాలి. భగవంతుని గుణాలను, ప్రభావాన్ని, తత్త్వాన్ని, వైభవాన్ని తెలుసుకొనే ప్రయత్నం చేయాలి.

గీతా ప్రచారం ప్రత్యక్షంగా భగవంతుని ప్రచారమేననది నిస్సందేహము. భగవద్గీత అర్థాన్ని, భావాన్ని తెలుసుకొని, గీతను ప్రచారం చేసేవాడు దానివలన ఉద్ధరింపబడతాడు. అతనిపట్ల భగవంతుడు ప్రసన్నుడవుతాడు. (గీత 18/68,69 శ్లోకాలను చూడండి.)

**య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥**

**న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥**

అంటే - 'నాయందు పరమ భక్తి కలిగి ఈ పరమ రహస్యమైన గీతాశాస్త్రాన్ని నా భక్తులలో నిలుపునట్లు చేయువాడు నన్నే పొందుతాడు. సందేహము లేదు. అతనికంటె ఎక్కువ ప్రీతిని నాకు కలిగించేవాడు మనుష్యులలో వేరెవ్వడు లేడు. భూలోకంలో అతనికంటే నాకు ప్రియమైనవాడు వేరొకడు వుండబోడు.'

ఈ రెండు శ్లోకాల అర్థాన్ని, అంతరార్థాన్ని స్పష్టంగా తెలిసినవాని జీవితమంతా గీతా ప్రచారంలోనే గడచిపోవాలి. వర్తమాన కాలంలో గీతా ప్రచారాన్ని గురించి చూస్తున్నాము, వింటున్నాము అంటే దానికి ముఖ్య కారణము ఈ రెండు శ్లోకాల అర్థము, అంతరార్థము తెలిసినదాని ప్రభావమే.

కాబట్టి గీతను ప్రచారంచేయడమంటే భగవంతుని పనే. ఇది భగవంతుని విశేషకృప చేతనే లభిస్తుంది. డబ్బును వెదజల్లడం వల్ల ఇది లభించదు.

భగవదారాధన అంటే అతని ఆజ్ఞను పాలించడమే. అదే అతని సేవ. వాస్తవానికి ఏ పనినైనా భగవంతుని సేవ అని తలచి చేయడం వల్ల ఆనందము, ప్రశాంతత తప్పక కలుగుతాయి. కలుగనట్లయితే ఆ వ్యక్తి ఆ పనిని భగవత్సేవ అని భావించలేదన్నమాట - ఎవడైనా సాధరణమైన అడవి మనిషిని మహాత్ముడని తెలసి అతని పనిని, అతని ఆజ్ఞను పాలించడాన్ని అతని సేవగా భావించి వేస్తే తనకు తనను మరచే మేరలేని ఆనందమే లభిస్తుండగా, సాక్షాత్తూ భగవంతుని సేవ ద్వారా అసాధారణ ఆనందం, శాంతి కలుగుతాయని వేరే చెప్పాలా?

గీతను ప్రచారం చేసేవారి మనస్సులో భగవంతని స్మరణ, ప్రసన్నత, ఉత్సాహము, ప్రేమ మరియు శాంతి వుండనట్లయితే అట్టివారు, దానికి కారణాన్ని శోధించాలి. ఏవైనా తప్పులు తెలిస్తే, భగవంతుని ఆశ్రయించి వాటిని దూరం చేయాలి. భగవంతుని దయ అందరిపైనా అపారంగా వుంది. దానిని పూర్తిగా తెలియనందువల్ల మనకు ఆనందము, శాంతి లోపిస్తున్నాయి. మనపై భగవంతునికి వున్న అపారపూర్ణ దయలోని నూరవవంతును కూడా మనం తెలుసుకోలేము. తెలియనప్పటికీ మనము

మనపైన భగవంతునికి ఉన్న అపారదయను అంగీకరించాల్సిందే. ఇలా చేయడం వల్ల ముందు ముందు ఏదో ఒకనాడు తెలుస్తుంది.

భగవంతుని దయా స్వభావం సరిగ్గా తెలియడానికి ఒక ఉదాహరణ - ఒక క్షత్రియ యువకుడు ప్రభాత్వ సాయము వలన సౌకర్యాలతో ఒక మహావిద్యాలయంలో చదువుతుండేవాడు. అతని తల్లిదండ్రులు అతనికి ఎప్పుడూ ఇలా ఉపదేశిస్తూ వుండేవారు. ఈ దేశం రాజు ఉన్నతశ్రేణికి చెందిన జ్ఞాని, యోగి, మహాపురుషుడు. అతడు అవ్యాజముగానే ప్రేమ, దయ చూపేవాడు. అతనికి మనపై చాలా ఎక్కువ దయవుంది. మేము మరణిస్తే నీవు బాధపడవద్దు. మహారాజు గారి దయ మామీద కంటే నీమీదే ఎక్కువగా ఉంటుంది అన్నారు. ఈ ఉపదేశాన్నిబట్టి ఆ యువకుడు అలాగే భావించేవాడు. కొన్నాళ్ళకు ఆ యువకుని తల్లిదండ్రులు మరణించారు కాని అతను దుఃఖపడలేదు. విద్యాలయంలోని తోటి విద్యార్థులతని నడిగారు. 'నీ తల్లిదండ్రులు చనిపోయినా నీకు విషాదఛాయలు కూడా మొగము మీద లేవు. ఏమిటి సంగతి? ఇక నీ పాలన పోషణను ఎవరు చూస్తారు?' అనగా ఆ క్షత్రియ యువకుడన్నాడు. నాకు శోకమెందుకు కలుగుతుంది? ఎందుకంటే నా తల్లిదండ్రుల కంటే ఎక్కువగా నాపై దయను, ప్రేమను చూపించే పరమశ్రేయోభిలాషి మహారాజుగారు వున్నారు కదా! వారు ఉన్నతశ్రేణికి చెందిన భక్తులు, జ్ఞాని, మహాపురుషులు, నాకు ఆయనే ఆధారము. ఆ విద్యార్థి మాటలు విని అక్కడి ప్రధానాధ్యాపకుడు చాలా ఆశ్చర్యపడ్డారు. ఆయన ఆ రాజ్య నిర్వాహకవర్గ సభ్యుడు. ఈ యువకునికి మహారాజు పట్ల వున్న భక్తిశ్రద్ధలను ఆయన సభా సమావేశంలో మహారాజుకు తెలియజెప్పారు. ఆ రోజు మహారాజు అన్నారు. 'మనదేశంలో అనాథ బాలుడెవరైనా వుంటే నాకు తెలియజేయండి, అతనికి కావలిసిన ఏర్పాట్లు ప్రభుత్వం వైపు నుండి చక్కగా జరగడం మంచిది.' సమావేశంలోని చాలామంది సభ్యులు ఆ క్షత్రియ బాలకుని పేరునే సూచించారు. దీనితో రాజు అందరి అంగీకారంతో ఆ బాలకుని కోసం అన్నపానాల ఏర్పాటు చేశారు. ఇంకా అతని పాత ఇంటిని బాగు చేయించడానికి ఆజ్ఞనిచ్చారు. విద్యకోసమైతే ముందే ప్రభుత్వం వైపు నుండి ఏర్పాటు వుందికదా.

కొద్దిరోజుల తరువాత రాజాజ్ఞతో పనివాళ్ళు ఆ యువకుని పాత ఇంటిని దృఢంగా కట్టడానికి కూలగొడుతూ వుంటే, ఆ యువకుని తోటి విద్యార్థి పరుగెత్తి వెళ్ళి రాజోద్యోగులు మీ ఇంటిని కూలగొడుతున్నారు, నాశనం చేస్తున్నారని చెప్పాడు. అది విని ఆ యువకుడు ఆనందపడి అనసాగాడు. 'ఆహా! మహారాజు గారికి నాపై ఎంత దయ! బహుశ పాత ఇంటిని కూలగొట్టి కొత్త ఇంటిని నిర్మింపజేస్తాడేమో!' అతని మాటలను విని ప్రధానాధ్యాపకుడు ఆశ్చర్యపడి అనుకొన్నాడు. చూడండి! ఈ పిల్లవాని కెంత నమ్మకము! మహారాజు పైన ఎంత స్థిరమైన శ్రద్ధ!'

మళ్ళీ రెండవసారి సభా సమావేశములో ప్రధానాధ్యాపకులు కూడ వున్నప్పుడు రాజు ఈ ప్రస్తావనను తెచ్చాడు. 'నేను వృద్ధుడనైనాను. నాకు సంతానము లేదు. కాబట్టి యువరాజు పదవిని ఎవరికి ఇవ్వాలి? దీనికి యోగ్యులెవరు?' దీనిపై ప్రధానాధ్యాపకుడు వివరించాడు. 'ఆ క్షత్రియ యువకుడు గుణంలో, విద్యలో, ప్రవర్తన, స్వభావంలోనూ అందరికంటే శ్రేష్ఠుడు, అతడు రాజభక్తుడు. మీపై అమిత భక్తి గలవాడు.' ఈ మాటను మిగిలిన సభ్యులు కూడా సంతోషముతో ఏకగ్రీవంగా సమర్థించారు. అందరి అంగీకారంతో రాజు ఆక్షత్రియ యువకునికే యువరాజ పదవిని ఇచ్చాడు.

మరుసటి రోజు రాజు మంత్రి ఇంకా కొందరు ఉన్నతాధికారులు ఆ క్షత్రియ యువకుని ఇంటికి వెళ్ళారు. వాళ్ళందరూ రావడం చూసి క్షత్రియ యువకుడు వారికి అత్యంతాదరంతో సత్కారం చేసి ఇలా అన్నాడు. 'నేను మీకేమి సేవ చేయగలను?' అధికారులన్నారు. 'మహారాజుగారికి మీపై చాలా ఎక్కువ దయ కలిగింది.' బాలకుడన్నాడు, 'ఇది నాకు ముందు నుంచే తెలుసు. అందుకే మీకు కూడా నాపై ఎక్కువ ఆదరము ఉన్నది.' అధికారులన్నారు. 'మేము మీ సేవకులము, మీ దయను కోరుతున్నాము.' ఆ యువకుడన్నాడు. 'ఇలా అని మీరు నన్ను సిగ్గుపడేట్లు చేయకండి. నేను మీ సేవకుడినే. మహారాజుగారికి నాపై దయ వున్నది. అది నాకు బాగా తెలుసు.' అనగా అధికారులన్నారు, 'మీకు తెలిసిన దానికంటే చాలా ఎక్కువ దయ వుంది.' అపుడు యువకుడు మహారాజుగారు 'నా వివాహానికి ఏర్పాట్లు చేసారా?' అని అడిగాడు.

అపుడు ఆ అధికారులన్నారు. 'వివాహము ఏర్పాట్లే కాదు. మహారాజు గారికి మీపై ఇంకా ఎక్కువ దయ కలిగింది.' అనగా యువకుడు మళ్ళీ అడిగాడు. 'మహారాజుగారు నాకు రెండు మూడు గ్రామాల జాగీర్దారీని (పెత్తందారీతనాన్ని) ఇస్తున్నారా?' అధికారులన్నారు, 'ఇదెంత? మీపై ఇంకా ఎక్కువ దయ వుంది. ఆ దయను మీరు ఊహించను కూడ లేరు.' దానితో యువకుడు ప్రార్థించాడు, 'వారికి నాపై ఎలాంటి కరుణ వుందో దయచేసి తెలపండి!' అపుడు ఆ అధికారులు చెప్పారు, 'మహారాజుగారు మీకు యువరాజు పదవిని ఇచ్చారు. కాబట్టే మేము మీ దయను కోరుతున్నాము.'

యువకుడన్నాడు, ఇది కలా! అంటే నిజమేనన్నారు అధికారులు. అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది. తనపై ఇంత ఎక్కువ దయ మహారాజు గారికి గలుగవచ్చునని అతను కనీసము అనుమానము రాలేదు. ఇంతటి దయను చూపుతారన్న ఊహ కూడా లేదు. రాజు ఆ యువకునికి యువరాజ పదవినిచ్చాడు.

కానీ, మన రాజు దగ్గర యువరాజు పదవి అందరికీ వున్నది. వారు అందరినీ తమతో సమానంగా చూస్తారు. ఆ రాజు మన భగవంతుడే మీకు మనుష్య శరీరాన్ని ఇచ్చినవాడే ముందు నుండీ యువరాజ పదవిని మీకై అట్టిపెట్టి వుంచాడు. ఆయననే మీరు కాదంటే అది మీ మూర్ఖత్వం. రాజుకి ఎంత దయ ఉంటే మీపైన ఆనందామృతాన్ని, దయాదృష్టిని వర్షింపజేస్తున్నాడు. ఇపుడు మీరు దానికి అడ్డుగా గొడుగుపెట్టి అడ్డుకుంటే మీరు ఆ ఐశ్వర్యం పొందక వంచింపబడతారు. అంగీకరించకపోవడం, నమ్మకపోవడమే అశ్రద్ధ. ఇదే అడ్డుకోవడమంటే. తమపై భగవంతునికి దయవుందని మీరు విశ్వసించాలి. భగవంతుడు మిమ్మల్ని బాగా ప్రేమించాలనుకుంటాడు. మీరుచేతులు జాచి కలుపుకోవాలనుకుంటే భగవంతుడు దగ్గరగా కనిపిస్తాడు, కలుపుకోవాలని తపన పడుతున్నట్లు కనిపిస్తాడు. కాని మీకు భగవంతునిపై విశ్వాసం కలగాలి. మీలో శ్రద్ధ పెరగాలి.

ఈ ఉదాహరణ ఆధ్యాత్మ విషయంలో ఇలా సమన్వయించుకోవాలి. ఎలాగంటే, భగవంతుడే జ్ఞానియైన మహాపురుషుడు రాజు. శ్రద్ధగల సాధుకుడే

క్షత్రియబాలుడు. ఉపదేశమిచ్చేవారు తల్లిదండ్రులు. సత్సంగం గల సాధకులు తోటి విద్యార్థులు. భగవంతునిపై ప్రేమ గల మహాపురుషుడే విధానసభలో సభ్యుడు ప్రధానాధ్యాపకుడు, ప్రభుత్వంవైపు నుండి బాలకునికి అన్నపానాల వ్యవస్థ ఏర్పరచడమంటే లోకదృష్టిలో అనుకూల పరిస్థితి కలగడం, ఇల్లు కూలగొట్టడమంటే ప్రతికూల పరిస్థితి లభించడం అని గ్రహించాలి. ఈ రెండు స్థితులలో బాలుడు రాజు యొక్క శుభకర విధానమిదని భావించి ఆనందముగా ఉండడమంటే ప్రత్యేక సంఘటనలో భగవంతుని మంగళమయ విధానమును తెలుసుకొని ఆనందముగా వుండడం. రాజును మిత్రునిగా భావించి అతనిపై ఆధారపడి శ్రద్ధతో, విశ్వాసంతో వుండడమంటే భగవంతుని శరణుజొచ్చే సాధనమని తెలియాలి.

ఈ ఉదాహరణము నుండి మనము నేర్చుకోవలసినదేమంటే మనము మనపైన భగవంతుని దయ ఎంత వుంటుందనుకుంటామో వాస్తవానికి భగవంతునికి అంతకంటే చాలా ఎక్కువ దయ ఉండనే వుంది. ఆయనకు మనపైనున్న దయను మనము ఊహించలేము. ఆ దయను తెలుసుకుంటే క్షత్రియ బాలునిలాగా మనకు అపరిమితమైన ఆనందము, ప్రశాంతత కలుగుతాయి. ఇక మనకు మనను గూర్చిన జ్ఞానమే వుండదు.

కాబట్టి, మనకు మన కోరికలవల్ల గాని, ఇతరుల కోరికచే గానీ, ఏ కోరిక లేకుండగా గానీ, ఏ కొద్దిగా లభించినా దానిని భగవంతుని దయాపూర్ణమైన విలాసమని తెలుసుకోవాలి. మన ద్వారా జరిగే కర్మలను భగవంతుని కర్మగా, భగవంతుని ఆరాధనగా అని తెలుసుకొని ఎల్లప్పుడూ భగవంతుని స్మరిస్తూ ఆనందంలో తేలియాడాలి.

ఈ విధంగా భగవంతునిపై భక్తి వుంటే ఒడలు గగుర్పొడుస్తుంది. మనసు పులకరిస్తుంది, కన్నీరు పొంగిపోతుంది. గొంతు గద్గదమవుతుంది, కంఠము పూడుకుపోతుంది. సాధకుడు అభ్యసిస్తూ, సిద్ధావస్థలోకి చేరుకుంటే భగవంతుడినే పొందుతాడు. అప్పుడు ఆ సాధకుడు ఆమోద ప్రమోదములకు అతీతుడై వాటి నుండి పైకి వచ్చి పరమశాంతిని, పరమానందాన్ని పొందుతాడు. పాత్రలో బియ్యం ఉడుకుతున్నప్పుడు, అది పక్వం గాకముందు బియ్యం ఎగిరెగిరి

పడుతుంటాయి. దాంట్లో విశేషక్రియ జరుగుతూ వుంటుంది. కానీ అది ఉడకడం పూర్తి అవుతున్నకొద్దీ అలా ఎగిరిపడడం తగ్గిపోతుంది. పూర్తిగా ఉడికిన తరువాత అది ఎగరకుండా నిలకడగా అవుతుంది. ఇలాగే సాధన చేస్తున్నప్పుడు సాధకునికి సంబంధించి ఎంతవరకు అపక్వత వుంటుందో అంతవరకు అతను సాధనకు సంబంధించి ఆనందావేశాలతో, అనుభూతి పరంపరలతో ఎగసిపడతాడు. అతనికి గగుర్పాటు, కన్నీరు కలిగి గొంతుకు అడ్డుపడతాయి. కాన సాధన పక్వదశను చేరుకొన్న తరువాత హర్షము మొదలైన వికారాల పొంగు తక్కువ అవుతుంది. పూర్తిగా పరిపక్వస్థితి పొందిన తరువాత ఆనందావేశాలు, హర్షము మొదలైన వికారాలు లేని పరమశాంతి కలుగుతుంది. ఇక అతను పరమాత్మ భావనలో చలనము లేక స్థిరంగా వుంటూ, పరమశాంతిని పొంది, పరమానంద స్వరూపుడగు పరమాత్మను పొందుతాడు.

నారాయణ! నారాయణ!! నారాయణ!!!



# 4. దానము యొక్క రహస్యము

దానములో గొప్పదనము త్యాగానిదే కానీ వస్తువు వెలకి గానీ, పరిమాణానికి గానీ కాదు. ఇలాంటి త్యాగబుద్ధితో సత్ పాత్రునికి అంటే ఎవరికీ ఏ వస్తువు లేదో వారికి ఆ వస్తువు నివ్వడం, దానిలో ఎలాంటి కోరికను కలగకపోవడం ఉత్తమ దానము అనిపించుకుంటుంది. నిష్కామభావనతో ఆకలిగొన్నవారికి అన్నాన్ని, దప్పికగొన్నవారికి నీటిని ఇవ్వడం సాత్త్వికదానము.

సంత్ ఏకనాథుడు కథ ఒకటి వుంది. ఏకనాథుడు ఒకసారి కావడిలో నీళ్ళు తీసుకొని ప్రయాగనుండి రామేశ్వరంలో సమర్పించాలని వెళుతున్నాడు. మార్గమధ్యములో అతను దప్పికజెంది నీరు లేక అలమటిస్తున్న ఒక గాడిదను చూసి దయగొని దానికి కొద్దిగా నీరు తాగించాడు. దానితో ఆ గాడిదకు కొంత చైతన్యము వచ్చినట్లు కాగా ఏక్‌నాథ్ కొద్దికొద్దిగా ఆ నీటినంతా దానికి తాగించాడు. తరువాత ఆ గాడిద లేచివెళ్ళిపోయింది. తోటి యాత్రికులనుకున్నారు, త్రివేణి నీరు వృథా అయింది. యాత్ర కూడా నిష్ఫలమైంది - అని, అపుడు ఏకనాథుడు నవ్వి అన్నాడు. సోదరులారా! భగవంతుడు ప్రాణులన్నింటిలో వున్నాడని మాటిమాటికీ విని కూడా ఇలాంటి పిచ్చిమాటలను మాట్లాడతారెందుకు? నా పూజ మాత్రము ఇక్కడినుండే శ్రీరామేశ్వరానికి చేరుకుంది. పరమేశ్వరుడు నా జలాన్ని స్వీకరించాడు.

ఇంకొక మహానుభావుడి కథ. ఆయన ఎప్పుడూ యజ్ఞాది కర్మలలోనే నిమగ్నమై వుండేవాడు. చాలా దానం కూడా చేశాడు. చివరికి కొన్నాళ్ళకి అతని దగ్గర తినడానికి కూడా ఏదీ మిగలలేదు. అపుడాయన భార్య అన్నది 'దగ్గర గ్రామంలో ఒక షావుకారు వుంటాడు, ఆయన పుణ్యాఫలం కొంటాడు. కాబట్టి మీరాయన దగ్గరికి వెళ్ళి మీ పుణ్యాన్ని కొద్దిగా అమ్మి డబ్బు తీసుకురండి. దానితో కొద్దిగానైనా మన పని గడుస్తుంది. ఇష్టం లేకపోయినా భార్య మాటిమాటికీ చెప్పడం వలన ఆ మహానుభావుడు, షావుకారు వద్దకు వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. ఆయన భార్య నాలుగు రొట్టెలు

చేసి తినడానికి వెంట తీసుకుపొమ్మని ఆయన కిచ్చింది. ఆయన బయలుదేరాడు. షావుకారు వున్న ప్రక్క గ్రామానికి దగ్గరగా చేరుకున్నాడు. అక్కడ ఒక చెరువు వుండినది. అక్కడే కాలకృత్యాలు స్నానాదులు చేసి తిండి తినడానికి కూర్చోగా ఒక కుక్క వచ్చింది. దాని పిల్లలతో అది మూడు రోజుల నుండి ఆకలిగొని వుంది. భారీ వర్షము పడినందువల్ల అది పిల్లలను వదిలి నగరంలోకి వెళ్ళలేకపోయింది. కుక్క ఆకలిని చూసి అతను ఆ కుక్కకు ఒక రొట్టెను ఇచ్చాడు. అది ఆ రొట్టెని తినివేసింది. మళ్ళీ రెండవరొట్టెను ఇస్తే దానినీ తినివేసింది. ఇలా అతడు ఒకొటికటిగా నాలుగు రొట్టెలను కుక్కకు ఇచ్చివేశాడు. కుక్క వాటిని తిని తృప్తిగా తోకాడిస్తూ వెళ్ళిపోయింది. ఇక, ఈ వ్యక్తి అక్కడినుండి లేచి ఆకలితోనే, ఆ షావుకారు దగ్గరికి చేరాడు. అతని దగ్గరికి వెళ్ళి తన పుణ్యాన్ని అమ్మే విషయాన్నిచెప్పాడు. 'మీరు మధ్యాహ్నం తరువాత రండి' అని షావుకారు చెప్పాడు.

ఆ షావుకారు భార్య పతివ్రత. ఆ షావుకారు ఆమెను 'ఒక పెద్దమనిషి వచ్చాడు. తన పుణ్యాన్ని మనము తీసుకోగలమా చెప్పు' అని అడిగాడు. దానికి ఆవిడ 'ఈరోజు అతను చెరువు గట్టుపై కూర్చొని ఆకలిగొన్న కుక్కకు నాలుగు రొట్టెలను ఇచ్చాడు. ఆ పుణ్యాన్ని కొనాలి. ఎందుకంటే అతని జీవితంలో దానిని మించి వేరే పుణ్యము లేదు' అన్నది. సరేనని ఆ షావుకారు బయటికి వెళ్ళిపోయాడు.

అనుకున్న సమయానికి ఆ పెద్దమనిషి షావుకారు దగ్గరికి వచ్చి 'మీరు నా పుణ్యాలలో దేనిని కొనాలనుకుంటున్నారు?' అని అడిగాడు. షావుకారు 'మీరీ రోజు చేసిన యజ్ఞఫలమైన పుణ్యాన్ని తీసుకోవాలని అనుకుంటున్నాము' అన్నాడు. 'నేను ఈ రోజు యజ్ఞమేదీ చేయలేదు. నా దగ్గర డబ్బులేదు. యజ్ఞమెలా చేయగలను?' అన్నాడు. ఆ పెద్దమనిషి దానితో షావుకారు, 'మీరీరోజు చెరువుగట్టుపై కూర్చుని ఆకలితో నకనకలాడే కుక్కకు నాలుగు రొట్టెలను ఇచ్చారు. నేను ఆ పుణ్యాన్ని తీసుకోవాలనుకుంటున్నాను,' ఆ పెద్దమనిషి అడిగాడు. 'ఆ సమయంలోనైతే అక్కడ ఎవరూ లేరు. మీకీవిషయమెలా తెలిసింది? అని. దానికి ఆ

షావుకారు చెప్పాడు. 'నా భార్య పతివ్రత. ఆమె ఈ విషయాన్నంతా నాకు చెప్పింది' అనగా, ఆ పెద్దమనిషి 'మంచిది, తీసుకోండి, కానీ దాని ఏ మూల్యాన్ని ఇస్తారు?' అనగా, షావుకారు అన్నాడు. 'మీ రొట్టెలు ఎంత బరువుగలవో అంత బరువుగల రత్నాలు, ముత్యాలను తూచి మీకిస్తాను। అన్నాడు. అపుడు ఆ పెద్దమనిషి దానికి అంగీకరించాడు. అతని అనుమతితో షావుకారు అంచనా ప్రకారం అంతే బరువున్న నాలుగు రొట్టెలను చేయించి త్రాసుయొక్క ఒక పళ్ళెంలో వుంచి వేరొక పళ్ళెంలో రత్నాలను,ముత్యాలను మొదలైన వాటిని వుంచాడు. కానీ, చాలా రత్నాలను వుంచినప్పటికీ ఆ పళ్ళెం (రొట్టెలున్నది) పైకి లేవలేదు. దానితో షావుకారు అన్నాడు, 'ఇంకా రత్నాల సంచులు తీసుకురండి!' తన పుణ్యం యొక్క ప్రభావమింత అని చూసిన పెద్దమనిషి అన్నాడు, 'అయ్యా! నేను ఇప్పుడే ఈ పుణ్యాన్ని అమ్మను.' అనగా షావుకారు మీ ఇష్టమని అన్నాడు.

తరువాత ఆ పెద్దమనిషి అక్కడి నుండి వెళ్ళిపోయాడు. తను ముందు కూర్చున్న చెరువుగట్టు దగ్గరికి వెళ్ళి తాను కుక్కకు రొట్టెలను తినిపించినచోట మెరుస్తూవున్న కొన్ని కంకరరాళ్ళను, గాజుముక్కలను బట్టలో కుట్టి తన ఇంటికి వెళ్ళిపోయాడు. ఇంటికి వచ్చి అతను ఆ మూటను తన భార్యకు ఇచ్చి అన్నాడు. 'భోజనం చేసిన తరువాత దీనిని తెరవాలి' ఇలా అని అతడు బయటకు వెళ్ళాడు. అతని భార్య మనస్సులో మాత్రము ఆ సంచిని విప్పి చూడాలన్న కోరిక కలిగింది. ఆమె మూటను విప్పగా దాంట్లో రత్నాలు, మణులు, మాణిక్యాలు మొదలైనవి మెరుస్తూ వుండినాయి. ఆమె చాలా ఆనందపడింది కొద్దిసేపటి తరువాత ఆ పెద్దమనిషి ఇంటికిరాగా ఆ స్త్రీ అడిగింది. 'ఇన్ని రత్నాలను, మణులను ఎక్కడినుండి తెచ్చారు.' అనగా ఆ పెద్దమనిషి అన్నాడు, 'వేళాకోళం చేస్తున్నావా?' అనగా ఆ స్త్రీ అన్నది, 'వెటకారం కాదు. నేను స్వయంగా విప్పి చూశాను. దానిలో చాలా అమూల్యమైన రత్నాలు, మణులు నిండి వున్నాయి.' అనగా ఆపెద్దమనిషి అన్నాడు. 'తెచ్చి చూపించు' అనగా ఆ స్త్రీ ఆ మూటను తెచిచ విప్పి ఎదుట వుంచింది. ఆపెద్దమనిషి దానిని చూసి ఆశ్చర్యపడ్డాడు. తరువాత అతను తన యాత్ర యొక్క వృత్తాంతాన్నంతా భార్యకు

వినిపించాడు.

ఇది చెప్పడంలోని అభిప్రాయమేమంటే ఆ కుక్కలాగా లేమితో బాధపడుతున్న ఏ ప్రాణికైనా దానిమిచ్చినది అనంతమైన పుణ్యఫలాన్ని ప్రసాదిస్తుంది. భగవంతుని దయా ప్రభావంతో కంకరరాళ్ళు కూడా మణులు, రత్నాలుగా మారతాయి.

ఇలా దీనులు, దుఃఖితులు, ఆర్తులు, అనాథలు అయిన వారికి చేసిన దానము ఉత్తమము. ఎవరికైనా కష్టకాలంలో చేసిన దానము చాలా లాభాన్ని కలిగించేదవుతుంది. భూకంపము, వరద, కరువు కాటకాలు మొదలైనవి సంభవించినపుడు ఆపదల పాలైన ప్రాణులకు గుప్పెడు ఆహారం ఇవ్వడం కూడా చాలా ఉత్తమమవుతున్నది. శాస్త్రవిధి పూర్వకంగా బంగారము, ఆభరణములు, తులాదానము మొదలైనవి దానమివ్వడం కంటే ఆపదల కాలంలో కొంచెము దానమివ్వడం వల్ల ఎక్కువ లాభము కలుగుతుంది. కాబట్టి, ప్రతిమనిషి కష్టాల పాలైనవారల, అనాథల, వికలాంగుల, దుః ఖితుల సేవను చేయాలి. అయోగ్యునికి దానమివ్వడం తామసము. గర్వము, గౌరవము, ప్రతిష్ఠ కొరకు చేసిన దానము రాజసము అనిపించుకొంటాయి. అవి పతనాన్ని కలిగిస్తాయి. ఈ రోజు ఈ గర్వము, గౌరవము, ప్రతిష్ఠ మనకు ఆనందకరముగా తోస్తాయి కానీ వాటివల్ల నిశ్చయంగా కలిగేది పతనమే. కాబట్టి, వాటిపట్ల కోరికను విడిచివేయాలి. పైగా ఏరకమైన నింద వచ్చినా అది మంచిదని భావించుకోవాలి. శ్రీకబీరు దాసు అంటారు.

**నిందక నియరేఁ రాఖియే, ఆంగన్ కుటీ ఛవాయ్ ।**
**బిన్ పానీ సాబున్ బినా, నిరమల్ కరై సుభాయ్ ॥**

అనగా - నిందించే వానికి ఇల్లు నిర్మించి అయినా దగ్గరకు చేర్చుకోవాలి. ఏలనన, నీళ్ళు, సబ్బు లేకుండానే మనలను (మన అంతరంగములను) పరిశుభ్రం - నిర్మలంగా చేసుకోవడానికి అతడే ఉపయోగపడును కదా!

కాబట్టి, పరమశ్రేయస్సు పొందే దృష్టితో చూస్తే ఈ సంసారములో గౌరవ, ప్రతిష్ఠలకంటే నిందావమానాలు పొందమే ఉత్తమము - సాధకునికి ఈ గౌరవప్రతిష్ఠలు తియ్యని విషము, నిందావమానాలు అమృతము లాంటివి. కాబట్టి, నిందించే వారినీ ఆదరంగా చూడాలి. తిరిగి ఏ విధమైన నింద్యమైన

పాపకార్యాన్ని చేయరాదు. దుర్గుణాలు, దురాచారాలు చాలా ప్రమాదకరమైనవి - కాబట్టి వాటిని మనస్సులోంచి తుడిచివేయాలి. తన సద్గుణాలను దాచుకొని దుర్గుణాలను ప్రకటించాలి. ప్రస్తుతం లోకులు దుర్గుణాలను దాచుకొని లేని సద్గుణాల మూటలు ప్రదర్శిస్తూ ప్రచారంచేస్తూ వుంటారు. ఇది నరకానికి సరాసరి బాట. కాబట్టి గౌరవమర్యాదలను పొందాలన్న కోరికను మనస్సులో నుంచి తీసివేయాలి. సమాజంలో మనకు ప్రతిష్ఠ లభించినా మనము దానికి యోగ్యలము కాకపోతే మనము పతనము అవుతాము. గౌరవం, ప్రతిష్ఠ పెంచుకోదలచిన వారినుండి భగవంతుడు దూరమవుతాడు. ఎందుకంటే వాటిపట్ల కోరిక వారిని పతనంలోకి తోసివేసేదే! గౌరవమర్యాదలను రౌరవంగా, ప్రతిష్ఠను విష్ఠ అనే నరకంగా తెలుసుకోవాలి. ఇదే సత్పురుషుల ఆదేశము.

యోగ్యునికి ఇచ్చిన దానము దాతకీ, గ్రహీతకీ ఇద్దరికీ శుభాన్ని కల్గిస్తుంది. అయోగ్యునకిచ్చినది ఆ ఇద్దరినీ ముంచివేస్తుంది. రాతినౌక కూర్చున్న వానితో కలిసి మునిగిపోవునట్లు అయోగ్యునికి ఇచ్చిన దానము దాతను తోడుగా తీసుకొని నరకానికే వెళుతుంది.

దానం గురించి ఇంకొక్క మాటను తెలుసుకోవాలి. చాలా ధనవంతుడైన వ్యక్తి లక్షల రూపాయల దానము కంటే పేదవాడు ఇచ్చిన ఒక రూపాయి దానము ఎక్కువ గొప్పది. ఎందుకంటే పేదవాడు చేసిన ఒక రూపాయి దానము గొప్ప త్యాగమే. భగవంతుని దృష్టిలో ఇదే న్యాయము. ఇలా కాకపోతే పేదవాళ్ళకు ముక్తి అనేదే కలుగదు.

ఒక రాజు తన ప్రజలతో కలిసి తీర్థయాత్రలు చేయడానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో ఒక వ్యక్తి బట్టలు లేకుండా పడి వున్నాడు. చలి కారణంగా అతడు కొంకర్లు తిరిగిపోతున్నాడు. రాజు యొక్క ప్రజలలో ఒక రైతు వున్నాడు. అతడు తన రెండు ధోవతుల నుండి ఒక ధోవతిని ఆ వ్యక్తికి ఇచ్చాడు. దానితో ఆ వ్యక్తి ప్రాణము దక్కింది. రైతు దగ్గర కట్టుకోవడానికి ఒకే ధోవతి మిగిలింది. వారు ముందుకు వెళ్ళగా అక్కడ చాలా ఎక్కువ ఎండ వుంది. కానీ వారు గమనిస్తే మేఘాలు వారిపైన నీడను ప్రసరిస్తూ వస్తున్నాయి. రాజు ఆలోచించాడు. 'మన పుణ్య ప్రభావం

వల్లనే ఈ మేఘాలు ఇలా నీడను పడుతూ వస్తున్నాయి.' తరువాత వారు ఒకచోట ఒక వనంలో విశ్రమించారు. మళ్ళీ బయలుదేరినపుడు ఒక మహాత్ముడడిగాడు. 'రాజా! ఎవరి గొప్పతనం వల్ల ఈ మేఘాలిలా నీడను పడుతూ వస్తున్నాయో మీకు తెలుసా?' దీనికి రాజు ఏ సమాధానమూ ఇవ్వలేకపోయాడు. అపుడా మహాత్ముడు మంచిది, 'మీరు ఒకరొకరుగా ఇక్కడినుండి బయటికి వెళ్ళండి. ఎవరి వెంట మేఘము నీడను పడుతూ వస్తుందో అతని పుణ్యము యొక్క ప్రభావము ఇది అని తెలుసుకోవాలి,' అన్నాడు. అపుడు రాజు ముందుగా తానే బయలుదేరాడు. తరువాత ఒకరొకరుగా అందరూ బయలుదేరారు. కానీ మేఘాలు అక్కడే వున్నాయి. అపుడు రాజు అన్నాడు, 'వెనుక ఎవరు వున్నారో చూడండి.' సేవకులు, అక్కడ ఒకరైతు పడుకొని వుండడాన్ని చూశారు. అతన్ని నిద్ర లేపి, వారు రాజు దగ్గరికి తెచ్చారు. అపుడు మేఘాలు కూడా అతనితో నీడపడుతూ కదలసాగాయి. అపుడు మహాత్ముడన్నాడు, 'ఇది ఈ పుణ్యాత్ముని పుణ్య ప్రభావమే.' రాజు ఆ రైతు నడిగాడు, 'నీవు అంత పుణ్యమేం చేశావు?' అని మాటిమాటికి అడుగగా రైతు 'నేను వేరే పుణ్యమేదీ చేయలేదు. ఇప్పుడే మార్గమధ్యంలో నేను నా రెండే ధోవతుల నుండి ఒక ధోవతిని చలికి కొంకర్లు తిరుగుతున్న ఒక వ్యక్తికి ఇచ్చాను' అని చెప్పాడు.

దానితో ఆ మహాత్ముడు రాజుతో అన్నాడు. 'రాజా! నీవు చాలా దానం చేస్తావు! కానీ నీ వద్ద అపార సంపద వున్నది. కాబట్టే నీ దానము రెండు ధోవతులలో ఒకటి దానమిచ్చిన దానితో సమానము కాజాలదు,' అన్నాడు.

ఈ విధంగా దానము యొక్క రహస్యాన్ని తెలుసుకొని దానమివ్వాలి.



# 5. జ్ఞాన, భక్తి సాధనము

మనిషి దగ్గర ఎంత ఎక్కువ సంపత్తి, ఎంత ఎక్కువ పరివారము వుంటే అంత ఎక్కువ బంధము పెరుగుతుంది. ఒక వ్యక్తి వద్ద ఎన్నెన్నో మిల్లులు, కార్యాలయాలు, దుకాణాలు, భవంతులు వున్నాయనుకోండి. కోట్ల కొలది రూపాయలు ప్రజలలో చెలామణి అయివున్నాయనుకోండి. పరివారము కూడా పెద్దదనుకోండి. కానీ ఆ మిల్లులలోనో, బొగ్గుగనిలోనో, ఒకదానికి నిప్పు అంటుకొన్నా, మిల్లులో భారీ నష్టం వచ్చినా, అపజయం పాలయినా, కుటుంబంలో దగ్గరి వ్యక్తి లేదా తన భార్య, కుమారుడు ఎవరో మరణించినా లేదా ఏదో ఒక ఫర్మ్ దివాలా తీసి తన పెట్టుబడిలో లక్షలు మునిగిపోయినా, ఏదో మిల్లునో, భవంతినో ప్రభుత్వం తన స్వాధీనంలోకి తీసుకున్నా, వీటిలో ఏ ఒక్క సంఘటన జరిగినా మమకారము వల్ల ఆ వ్యక్తికి దుఃఖము కలుగుతుంది. అపుడు అతను నిస్సహాయంగా రాత్రింబగళ్ళు వీటన్నింటి గూర్చి ఆలోచనల నిప్పులగుండంలో మండిపోతుంటాడు. కానీ, తన దగ్గర ఏదీ లేనివానికి ఏ నష్టం జరుగుతుంది. ఒకవేళ జరిగినా అది చిన్న నష్టమే అవుతుంది. ఒక సాధువు వున్నాడనుకోండి. అతని వద్ద ఒక కమండలము వుంది. గడ్డిపరకలతో కట్టిన గుడిసే వుంది. ఒకటి రెండు చుట్టుకొనే, పరచుకొనే బట్టలు వున్నాయి. అతని కమండలాన్ని గానీ, బట్టలను గానీ ఎవరైనా తీసుకొని వెళితే అతనికి ఇతరుల నుండి వేరేవి లభిస్తాయి. కుటీరము తగులబడితే వేరొకచోటికి వెళ్ళి కూర్చోగలడు. అతనికి వీటిని గూర్చి అంత చింత వుండదు. కానీ, అధిక సంపత్తి గలవానికి వస్తువుల పట్ల మమకారముంటుంది. ఎంత ఎక్కువ మమకారము వుంటే అంత ఎక్కువ దుఃఖమూ వుంటుంది. మమకారము లేకుంటే ఎంత ధనవంతునికైనా దుఃఖము వుండదు. తక్కువ సంపదగల వానికీ దుఃఖము వుండదు. కానీ ఎక్కువ సంపద కలుగడంతో ఎక్కువ మమకారము కలిగే అవకాశము వుంది. కానీ జనకుడు, అశ్వపతి మొదలైన రాజులు చాలా సంపద, రాజ్యవైభవము గలిగినప్పటికీ కొంచెము కూడా మమకారము

లేనందువలన ఎప్పుడూ సుఖంగా వుండేవారు. సంపద మొదలైనవి నశించినా కూడా వారికి ఎప్పుడూ దుఃఖము కలిగేది కాదు.

అహంకారము, మమకారము - ఈ రెండే అన్ని దుఃఖాలకు మూలకారణము. కాబట్టి శరీరం కలిగి ఉన్నందుకు అహంకారము, శరీరంతో సంబంధమున్న ప్రాణులపై, పదార్థాలపై, మమకారమును వదిలివేయాలి.

నేను మనిషిని, నేను సాధువును, గృహస్థుడిని, బ్రాహ్మణుణ్ణి, క్షత్రియుణ్ణి, వైశ్యుణ్ణి - అనే ఏ ప్రకారమైన అభిమానము లవలేశము వున్నా అది అహంకారము, అలాగే శరీరముతో సంబంధముగల పదార్థాలపై, ప్రాణులపై, తన శరీరంపై 'నాది' అనే భావన. 'ఈమె నా భార్య, ఇతడు నా కుమారుడు, ఇది నా సంపద, ఇది నాఇల్లు, ఇది నా కమండలము, ఇది నా మృగచర్మము, మొదలైనవి 'మమకారము.' ఈ రెండు భావనలు సాధకునికి చాల పెద్ద అవరోధాలు. కాబట్టి వీటిని విడిచివేయడం చాలా ముఖ్యం. అహంబ్రహ్మాస్మి. నేను బ్రహ్మను - అను మహావాక్యాల ననుసరించి బ్రహ్మంలో అహంబుద్ధి, శుద్ధాహంకార మనబడుతుంది. మనము శుద్ధమైన అహంకారము అంటున్న దానినికూడా విడిచివేయాలి. అద్వైతవాద సిద్ధాంతాన్ననుసరించి ఇది ఉత్తమశ్రేణికి చెందిన సాధనమే! కానీ ఈ సాధనను ఉత్తమమని అంగీకరిస్తూ కూడా మనమందరమూ దీనికి అధికారులమని అంగీకరించము. అందుకే దీనిని అభ్యసించమని మనము అందరికీ చెప్పము. ఎవరికి శరీరంపై అభిమానము నిజంగా లేదో, ఎవరికి బ్రహ్మ స్వరూప స్థితి వున్నదో వారే ఈ సాధనకు అధికారి. దేహంపై అభిమానాన్ని కలిగివుంటూ ఈ అద్వైత భావన ద్వారా పరమగతిని పొందడం చాలా కఠినము. గీతలో ఇలా ఉంది.

**క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్ ।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥**

**(12/5)**

'ఆ సచ్చిదానంద ఘనము నిరాకారము అయిన బ్రహ్మయందు ఆసక్తమైన మనసుగలవానికి సాధనలో శ్రమ ఎక్కువ. ఎందుకంటే, దేహాభిమానము గల వారి ద్వారా అవ్యక్తవిషయకమైన గతి ప్రాప్తించడం చాలా కష్టం.'

కానీ, బ్రహ్మ భూతులైన వారికి బ్రహ్మ స్వరూపములో ఏకత్వ భావనతో నుండు వారికి ఈ సాధన సుగమము. వారికి ఈ సాధనతో బ్రహ్మప్రాప్తి సహజంగానే కలుగుతుంది. భగవంతుడంటాడు -

**ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥**
**యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।**
**సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే ॥**

**(గీత 6/27,28)**

'ప్రశాంతమైన మనస్సు కలవాడును, పాపరహితుడును, రజోగుణము పూర్తిగా అంతరించినవాడును, అయి సచ్చిదానందఘన పరమాత్మయందు ఏకీభావమును పొందిన యోగి బ్రహ్మానందమును పొందును. పాపరహితుడైన ఆ యోగి నిరంతరము ఆత్మను పరమాత్మ యందే లగ్నమొనర్చుచు, పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తిరూపమైన అపరిమితానందమును హాయిగా అనుభవించను.

ఆ బ్రహ్మభూతుడైన యోగి సాధనము యొక్క స్థితిని ఇంకొక శ్లోకంలో వర్ణించారు.

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥**

**(గీత 6/29)**

'సర్వవ్యాప్తమైన అనంత చైతన్యమునందు ఏకీ భావస్థితిరూప యోగయుక్తమైన ఆత్మ గలవాడును, అంతటను అన్నింటిని సమభావముతో చూచువాడును అగు యోగి, ఆత్మను సర్వప్రాణుల యందు స్థితమైయున్నట్లుగను, ప్రాణులన్నింటిని ఆత్మయందు కల్పితములుగను భావించును.'

సాధనావస్థలో ఈ స్థితి రెండువిధాలుగా వుంటుంది. 1. కల్పితము, 2. అకల్పితము. కల్పిత స్థితిలో సాధకుడు ఒకప్పుడు బ్రహ్మయందు, ఒకప్పుడు దేహమందు వుంటాడు. కాని బ్రహ్మలో అకల్పిత స్థితి కలిగినపుడు శరీరంలో స్థితమై వుండడు. ఎప్పుడూ బ్రహ్మలోనే వుంటాడు. ఇదియే అతనికి గీటురాయి.

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మత॥**
**(గీత 6/32)**

'అర్జునా! సర్వప్రాణులను తనవలె (తనతో) సమానముగా చూచువాడును, సుఖమునుగానీ దుఃఖమునుగానీ, అందరిలో సమముగా చూచువారును (ఇతరుల సుఖదుఃఖములను తన సుఖదుఃఖములుగా భావించువారును) ఐన యోగి పరమశ్రేష్ఠుడు.'

ఈ గీటురాయి ద్వారా పరికించినప్పుడు, ఎవరు నిజమని నిర్ధారణ గావింపబడుదురో, వారే ఈ పరీక్షలో ఉత్తీర్ణులైనవారు. వారికే బ్రహ్మ ప్రాప్తి కలుగుతుంది. ఈ విషయం గీత (6/28) లో ముందు చెప్పబడింది. సిద్ధుడైన తరువాత ఆ వ్యక్తికి గీటురాయి ఏదో దాని వర్ణన గీత అధ్యాయం 14/24,25 శ్లోకాలలో చూడవచ్చు.

**సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః।**
**తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః॥**
**మానావమానయోస్తుల్యస్తుల్యోమిత్రారిపక్షయోః।**
**సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే॥**

'నిరంతరము ఆత్మ భావనలో వుండేవాడు, సుఖదుఃఖాలను సమంగా గ్రహించేవాడు, మట్టి, రాయి మరియు బంగారములను సమానంగా చూసేవాడు, ప్రియాన్ని, అప్రియాన్ని ఒకేవిధంగా భావించేవాడు, తన నిందనైనా, స్తుతినైనా సమానంగా గ్రహించేవాడు, గౌరవములో అవమానములో సమానంగా వుండేవాడు, మిత్రపక్షమునైనా, శత్రుపక్షమునైనా సమానంగా చూస్తూ అన్ని పనులలో, కర్త నేను అనే అభిమానాన్ని విడిచినవాడు, గుణాతీతుడునబడును.'

సిద్ధపురుషుని స్వాభావిక లక్షణాలుగా చెప్పబడినవే సాధకునికి సాధనాలు. కాబట్టి వీటిని లక్ష్యంగా వుంచుకొని సాధకులు ఆ సిద్ధపురుషుల సమీపములో వుంటూ సాధన చేయాలి. ఈ లక్షణాలను తనలో పెంచుకోవడానికి ప్రయత్నం చేయాలి.

అందుకనే 'అహం బ్రహ్మాస్మి' ఈ విధంగా సచ్చిదానంద ఘనమైన

బ్రహ్మయందు 'అహం' భావ పూర్వకమైన స్థితిని వుంచడం కూడా సాధనమే. భావమేమిటంటే, 'ఈ శరీరంతో నాకు సంబంధ మేమీలేదు. శరీరంలోని అహంభావము, శరీరంతో సంబంధము గల వస్తువులపై, ప్రాణులపై నున్న మమకారము ఇవి కలలాంటివి, మాయా మాత్రము. నేను విజ్ఞాన, ఆనంద ఘనుడనైనబ్రహ్మను. శరీరముతో, సంసారముతో నాకు సంబంధమేమీ లేదు. ఈ విధంగా అద్వితీయము, విజ్ఞానానంద ఘనము అయిన బ్రహ్మ యొక్క స్థితి మరియు ఆ బ్రహ్మ తప్ప మిగిలిన సంసారము, శరీరము పూర్తిగా లేనివేనని తెలియడం - ఇది అద్వైత పరమైన సాధన - ఈ సాధనయందు ఎప్పుడూ జాగృతిని కలిగి ఉండాలి.

శరీరంతో అహంకారము, శరీరంతో సంబంధము గల పదార్థాలపై మమకారము తొలగినపుడు శరీరంలో ధర్మి (కర్త) ఉండదు. ధర్మి వుండనపుడు రాగ-ద్వేషాలు వుండవు. అలాగే కోరిక, కామన మొదలైనవీ వుండవు. వాటిని మనస్సులో, బుద్ధిలో, సుఖ దుఃఖాది భావాలలో, బంగారము, మట్టి మొదలైన పదార్థాలలో, మాన-అవమానాలలో, నిందా-స్తుతి మొదలైన ఇతరుల ద్వారా జరిగే క్రియలలో (ముందు చెప్పిన గీత అధ్యా14/24,25 శ్లోకాల ననుసరించి) సంపూర్ణమైన సమత్వము కలుగుతుంది. అప్పుడు ఇక 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మను) అనే భావమూ వుండదు. ఎందుకంటే అతడు వాస్తవంగా బ్రహ్మే అవుతాడు, బ్రహ్మ దృష్టిలో ఈ శరీరము, సంసారము లేనే లేనివి, అలాంటప్పుడు ఎవరికి దేనితో సంబంధమేర్పడుతుంది. ఆ స్థితిలో సంబంధము అన్నిరీతులా లేనిదే అవుతుంది. లేదా ఆ సంబంధము పూర్తిగా నాశనమవుతుందని తెలుసుకోండి.

ఈ విధంగా జ్ఞానమార్గంలో 'అహం బ్రహ్మాస్మి' మొదలైన మహావాక్యాల ప్రకారం శుద్ధ అహంభావము కూడా ఆ తరువాత తొలగిపోతుంది. అపుడు ఆ వ్యక్తికి ఎక్కడా మమకారమనేది వుండదు. అతడు సచ్చిదానంద ఘనుడైన పరమాత్మను పొందుతాడు. శ్రీకృష్ణభగవానుడు గీతలో ఇలా తెలిపాడు -

**బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।**
**సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥**
**భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥**

**(గీత 18/54,55)**

'ఆ సచ్చిదానంద ఘనమైన బ్రహ్మయందు, ఐక్యభావములో నుండి ప్రసన్నమైన మనస్సుగల యోగి ఎవరి గురించీ శోకించడు, దేనినీ కోరడు. ఇలా అన్ని ప్రాణులతో సమభావాన్ని గల యోగి నా పరాభక్తిని పొందుతాడు. ఆ పరమభక్తి ద్వారా అతడు పరమాత్మనైన నేను ఎవరిని, ఎలా వున్నాను అనే విషయాన్ని వాస్తవంగా తెలుసుకుంటాడు. అలా భక్తితో నన్ను యథార్థంగా తెలిసి వెంటనే నాలో లీనమవుతాడు.'

అహంకారముతో బాటు మమకారము కూడా నశిస్తుంది. మొదట బ్రహ్మస్వరూపంలో వున్నప్పుడు సాధకునిలో శుద్ధాహంకారము 'నేను శరీరాన్ని కాను, నిర్గుణుడు, నిరాకారుడు, నిత్యుడు, విజ్ఞాన ఘనుడు, ఆనందఘనుడు అయిన బ్రహ్మను; అనే రూపంలో వుంటుంది. అంటే అతనికి శరీరమే నేనను అహంబుద్ధి తొలగిపోయి బ్రహ్మయే నేను అనే అహంబుద్ధి కలుగుతుంది. కాని, తరువాత ముందు చెప్పిన సాధనాల ద్వారా సాధకునికి పరాభక్తి రూపంలోని పరమజ్ఞానము కలిగినపుడు అతడు బ్రహ్మలో లీనమవుతాడు.

ఈ విధంగా భక్తియోగులైన సాధకులు అహంకారాన్ని, మమకారాన్ని విడిచివేసి భక్తియోగాన్నే సాధన చేయాలి. నేను శరీరాన్ని, ఈ శరీరంతో సంబంధము గల కుటుంబ సభ్యులు, సాంసారిక పదార్థాలు నావి - అనే ఈ అభిమానము సాధకుని సాధనలో విఘ్నము. మనిషి జాతి, వర్ణ, ఆశ్రమ, కుటుంబము, జ్ఞానము, బలము, గుణము, ఆచరణ మొదలైన వాటిలో ఏ విధమైన అభిమానమునూ చూపరాదు. ఎలాగంటే - నేను బ్రాహ్మణుణ్ణి, ఉత్తమకులజుడిని, పండితుడిని, సాధువుని, జ్ఞానిని, భక్తుడిని, మహాత్ముడిని, బుద్ధిమంతుడిని, మంచిగుణాలను, మంచి ఆచారాన్ని గలవాడిని, నాకు పెద్ద పరివారము వుంది, నా భార్య పతివ్రత నా కుమారుడు తల్లిదండ్రుల పట్ల భక్తి గలవాడు, నాకు పెద్దపెద్ద మిల్లులున్నాయి, చాలా భవంతులున్నాయి. నాతో సమానమైన ధనికుడు లేడు, ఇలా ఏవిధమైన అభిమానాన్ని కలిగివుండడమైనా సాధనలో అది పెద్ద అడ్డంకి, అపాయకరము అవుతుంది.

దీనికంటే విడిగా (ఇదిలేక) వున్న శుద్ధమైన అహంకారము, మమకారము అనేవి కూడా చివరలో విడిచి వేయబడతాయి. నేను భక్తుడిని,

నేను సాధకుడిని. ఇది శుద్ధాహంకారము. ఎలాగంటే -

**అస అభిమాన జాఇ జని భోరే ।**
**మై( సేవక రఘుపతి పతి మోరే ॥**

అనగా - నేను భగవంతునికి చెందినవాడిని, భగవంతుడు నాకు చెందినవాడు - అనేది శుద్ధ మమకారము. ఈ శుద్ధాహంకారము, శుద్ధ మమకారము కూడా ముందు ముందు వుండవు. నేను సాధకుడిని, భగవద్భక్తుడిని అనే అభిమానము కూడా సాధకుడు వుంచుకోకూడదు. కానీ ప్రజలు అతడిని భక్తుడని, మహాత్ముడని, ధర్మాత్ముడని అంటారు. కాబట్టి ప్రజల దృష్టిలో వాళ్ళ భావాన్ని బట్టి, వాళ్ళ విశ్వాసాన్ననుసరించి ఆచరించాలి.

దీనినే ధర్మరాజు యక్షునితో అన్నాడు. యక్షుడుడగిని ప్రశ్నలన్నిటికినీ ధర్మరాజు సరైన సమాధానాల నిచ్చినపుడు యక్షుడడిగాడు. 'రాజా! మహాబలవంతుడైన భీముడిని, అర్జునుడిని వదిలి నీవు నకులుడిని ఎందుకు బ్రతికించుకోవాలను కుంటున్నావు?' అనగా యుధిష్ఠిరుడన్నాడు -

**ధర్మశీలస్సదా రాజా ఇతి మాం మానవా విదుః ।**
**స్వధర్మాన్న చలిష్యామి నకులో యక్ష జీవతు ॥**

**(మహా.వన.313/130)**

'యక్షుడా! నా విషయంలో ప్రజలందరూ 'ఇతడు ధర్మాత్ముడు' అనుకుంటారు. కాబట్టి నేను నా ధర్మము నుండి చలించను. అందుకే నా సోదరుడు నకులుడు జీవించుగాక!'

'ఎందుకంటే నా తండ్రికి కుంతి మరియు మాద్రి అని ఇద్దరు భార్యలు. వారిలో కుంతీపుత్రుడనైన నేను జీవించివుంటాను. మాద్రి యొక్క పుత్రుడు నకులుడు కూడా జీవించినట్లయితే వారిద్దరు సంతానవతులుగా నుండెదరు. నేను ఇద్దరు తల్లుల యందు సమానమైన భావము కలిగి వుండాలనుకుంటున్నాను. ఇది నాధర్మము.'

నేను వాస్తవానికి ఉన్నతస్థాయికి చెందిన సాధకుడినీ కాను, కావాలనుకుంటున్నాను, ప్రజలు నన్ను ఉన్నతస్థాయికి చెందిన సాధకుడను కుంటున్నారు, కానీ నాలో చాలా లోపాలున్నాయి, నేను తొలగించుకోవాలి.

అలాగే ఆచరించాల్సి వుంది. నేను భగవంతుని దాసుల దాసానుదాసులకు, పేరుతో మాత్రమే కింకరుడిని.' సాధకులు ఇలాంటి భావనము అలవరచుకోవాలి. దీనినే హనుమంతుడిలా అన్నాడు -

**ఏకు మైం( మంద మోహబస కుటిల హృదయ అగ్యాన ।**
**పుని ప్రభు మోహి బిసారేఉ దీనబంధు భగవాన ॥**
**జదపి నాథ బహు అవగున మోరేం( సేవక ప్రభుహి పరై జని భోరేం( ।**
**నాథ జీవ తవ మాయాం( మోహా సో నిస్తరఇ తుమ్హారె హిం( ఛోహా ॥**
**తా పర మైం( రఘుబీర దోహాఈ జానఉం( నహిం కఛు భజన ఉపాఈ ।**
**సేవక సుత పతి మాతు భరోసేం( రహఇ అసో చ బనఇ ప్రభు పోసేం( ॥**

(రామచరితమానస - కిష్కింధా - 2/1-2)

హనుమంతుడు భరతుడిని కలిసినపుడు భరతుడడిగాడు -

**కో తుమ్హ తాత కహాం( తే ఆయే ।**
**మోహి పరమ ప్రియ బచన సునాయే ॥**

అనగా - నాయనా! నాకు ఇంత పరమప్రీతిని కలిగించే మాటలను వినిపించుచున్న నీవు ఎక్కడినుండి వచ్చుచున్నావు?

అపుడు సమాధానంగా హనుమంతుడన్నాడు.

**మారుతసుత మైం( కపి హనుమానా ।**
**నాము మోర సును కృపానిధానా ॥**
**దీనబంధు రఘుపతి కర కింకర...............**

(రా.చ.మా. ఉత్తర 1/4-5)

'దయానిధీ! విను. నేను వాయుపుత్రుడిని, వానరజాతికి చెందినవాడను. నాపేరు మనుమంతుడు, దీనబంధువైన శ్రీరామునికి ఒక సేవకుడిని.'

కాబట్టి తెలుసుకోవాల్సిందేమంటే - 'దీనబంధు రఘుపతి కర కింకర' నేను భగవంతుని దాసానుదాసుల శ్రేణిలో వస్తే అది నా మహద్భాగ్యము. అంటే, భగవంతుని దాసుడు హనుమంతుడు, నేను అతనికి కూడా దాసుడనై వుంటే నా మహద్భాగ్యము, మరి ఇక దాసుడయ్యే మాట ఎక్కడిది? కానీ నేను అలా లేను, అని కావాలని అనుకుంటున్నాను. ప్రజలు నన్ను భక్తుడని పిలవడం సిగ్గుపడే మాట. ఇది ఆ భక్తుని హృదయంలోని భావము.

వ్యవహారంలో మాత్రము ప్రజలు అతనిని భావించిన రీతిగా ఆచరణ కలిగి ఉంటాడు. ప్రజలు నన్ను ఎలా భావిస్తే దానినే భావించి భగవంతుని ప్రసన్నంచేసుకోవడానికి అదే పద్ధతిలో ప్రవర్తించాలని అతననుకుంటాడు. వాస్తవంలో మాత్రము ఎప్పుడైనాగానీ నేను బ్రాహ్మణుడిని, క్షత్రియుడిని, వైశ్యుడిని, సాధువుని, గృహస్థుడిని, సద్గుణవంతుడిని, సదాచార పరుడిని, శ్రేష్ఠుడిని, భక్తుడిని అని అహంకారాన్ని పొందరాదు.

నేను భక్తుడిని, ఫలానావాడు భక్తుడు కాదు. ఇలా ఇతరుల కంటే తాను మంచి వాడినని మంచితనాన్ని గూర్చిన అభిమానము కలిగితే అది సాధనలో బాధను కలిగిస్తుంది. భగవంతుడు నాకే-స్వామి, నేను అతడి సేవకుడిని అనే భావాన్ని ఉంచుకోకుండా అందరూ భగవంతునికి చెందినవారు అని, భగవంతుడు అందరి స్వామి అని - ఆయన తనకూ స్వామి అనే భావాన్ని నిలుపుకోవడం మంచిది. అందరూ భగవంతుని స్వరూపమే, లేదా అందరిలో భగవంతుడు ప్రకాశిస్తున్నాడు. కనుకనే అందరి సేవ భగవంతుని సేవయే అన్న భావన ఇంతకు ముందు దానికంటే కూడా మంచిది.

**సో అనన్య జాకేఀ అసి మతి న టరఇ హనుమంత ।**
**మైఀ సేవక సచరాచర రూప స్వామి భగవంత ॥**

**(రా.చ.మా. కిష్కింధా.దోహా-3)**

అనగా - నేను సేవకుడిని. భగవంతుడు నా స్వామి. స్థావర జంగమమంతా భగవంతుని స్వరూపమే. ఓ హనుమంతా! ఈ విధమైన భావము ఎవరి మనస్సునుండి తొలగిపోదో అతడు అనన్యభక్తుడు.

ఇది చాలా ఉత్తమమైన భావన. అందరి సేవకుడిని, అల్పుడిని, అందరూ నా ప్రభువులు. నేను వారి పాదధూళితో సమానము. ఈ విధమైన భావన ద్వారా, రాను రాను శుద్ధాహంకారము కూడా నశిస్తుంది. నేను ఏమీకాను కేవలం భగవంతుడే అంతా అన్న భావము కలుగుతుంది. అతనికి తన జ్ఞానము కూడా వుండదు. కేవలం భగవంతుని జ్ఞానమే వుంటుంది. అతనిలో అహంకారము, మమకారము లోపిస్తాయి. ఇక అతని పనులు అంతా భగవంతుని ఇచ్ఛను అనుసరించి సహజముగా జరిగిపోవును.

అతడు చెయ్యడమనేది 'జరగడం'లోకి మారుతుంది. తోలుబొమ్మలు తమ నాడించేవాడు ఎలా నర్తింపజేస్తే అలా నర్తిస్తాయి. అలాగే ఆ భక్తుని క్రియలన్నీ అవుతాయి. తోలుబొమ్మలోనైతే మనస్సు వుండదు. కానీ భక్తునిలో మనస్సువున్నా తోలుబొమ్మల కదలికవలె నుంటుంది. తోలుబొమ్మకంటే భక్తునిలో మనస్సు-బుద్ధి ఎక్కువగా వున్నందువల్ల మనస్సులో పరమాత్మ చింతన, బుద్ధిలో పరమాత్మ నిశ్చయము విశేషరూపంలో వుంటాయి. ఇదే నిజమైన భక్తి. ఇదే నిజమైన శరణాగతి. ఆ తోలుబొమ్మకు తన జయాపజయాలతో ఏ సంబంధమూ వుండదు. అలాగే సాధకునికి కూడా ఏ రకమైన సాధన యొక్క ఫలితంతో కూడా సంబంధము వుండదు. తన అన్ని క్రియలను, వాటి ఫలితాలను తనంతట తాను అతను భగవంతునికి అర్పించాలి. భగవంతుడు గీతలో చెప్పాడు -

**యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥**
**తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥**

**(12/6-7)**

'మత్పరులైన ఏ భక్తులు కర్మలన్నింటినీ నాయందు సమర్పించి, సగుణరూప పరమేశ్వరుడైన నన్ను అనన్యభక్తియోగముతో నిరంతర చింతన చేస్తూ సేవిస్తారో, అర్జునా! నాలో మనస్సు నిలిపే ఆ ప్రియ భక్తులను నేను త్వరగా మృత్యురూపమైన సంసారమనే సముద్రము నుండి ఉద్ధరించేవాడినవుతాను.'

ఆ భక్తుడు ఎల్లప్పుడూ కర్మ నాచరిస్తూ కూడా ఏదీ చేయడు ఇంకా భగవంతుని దయచే భగవంతుని పొందుతాడు.

**సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥**

**(గీత 18/56)**

'నా పరాయణుడైన, కర్మయోగియైన భక్తుడు అన్ని కర్మలను చేస్తూ కూడా నా దయతో సనాతనము, నిత్యము అయిన పరమపదాన్ని పొందును.'

అందుకే శ్రీకృష్ణ భగవానుడు అర్జునుని అలాగే కమ్మని ఆజ్ఞాపిస్తాడు-

**చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।**
**బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ ॥**

**(గీత 18/57)**

'అన్ని కర్మలను మనస్ఫూర్తిగా నాయందు సమర్పించి సమబుద్ధి రూపమైన యోగాన్నవలంబించి, నా పరాయణుడవై, నిరంతరము నా యందే మనస్సు గలవానిని కమ్ము!'

పైన చెప్పిన రీతి ననుసరించి సాధన చేస్తూ, చేస్తూ మనిషి భగవంతుని అన్ని రీతులా శరణుజొచ్చినపుడు, అతని అహంకార మమకారాలు అన్ని రకాలుగా నశించి అతడు పరమాత్మను పొందుతాడు. గీతలో 12వ అధ్యాయములో 13,14 శ్లోకాలలో భగవంతుడు చెప్పినట్లు అతడు భగవంతుని జ్ఞానము గలవాడుగా, భక్తుడుగా పూర్తిగా మారుతాడు.

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకార సమదుఃఖసుఖః క్షమీ ॥**
**సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః ॥**

'అన్ని ప్రాణుల పట్ల ద్వేషము లేనివాడు, స్వార్థభావము లేనివాడు, అందరినీ/అన్నిటినీ ప్రేమించేవాడు, నిర్వ్యాజముగా దయగలవాడు, మమకారము, అహంకారము లేనివాడు, సుఖదుఃఖాలు కలిగినపుడు సమంగా వుండేవాడు, ఓర్పుగలవాడు, అంటే తప్పు చేసినవారికి కూడా అభయమిచ్చేవాడు, యోగయుక్తుడు, ఎల్లప్పుడూ సంతోషము గలవాడు, మనస్సు - ఇంద్రియాలతో సహా శరీరాన్ని స్వాధీనంలో వుంచుకున్నవాడు, నాయందు దృఢ నిశ్చయము గలవాడు, నాయందు అర్పించబడిన మనస్సు, బుద్ధిగల నా భక్తుడు నాకు అత్యంత ప్రియమైనవాడు.'

ఇది భగవంతుని పొందిన మనిషికి గీటురాయి - ఈవిధంగా భగవంతుని సాధకుడైన భక్తుడు అనన్యభక్తితో, నేత్రముల ద్వారా భగవంతుని సాక్షాద్దర్శనాన్ని పొంది మరియు పవిత్రమైన బుద్ధి ద్వారా భగవంతుని వాస్తవంగా తెలుసుకొని భగవంతునిలో కలిసిపోతాడు.

గీతలో భగవంతుడు అంటాడు -

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప॥**
**మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః।**
**నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ॥**

**(గీత 11/54-55)**

'పరంతపా! అర్జునా! అనన్యభక్తితో ఈ విధంగా నేను రూపము గలవానిగా చూడడానికి, యథార్థంగా తెలియడానికి అలాగే చేరడానికి అనగా ఐక్యాన్ని పొందడానికి శక్యమయ్యేదను. అర్జునా! ఏ మనుషులు కేవలం నాకై అన్ని కర్తవ్యములను చేస్తారో, నన్ను గతియనినారో, నా భక్తులో, ఆసక్తిలేనివారో, ప్రాణులన్నింటియందు వైరభావము లేనివారో అట్టి అనన్యభక్తి గల మానవులు నన్నే పొందుతారు.

ఈవిధంగా జ్ఞానమార్గంలోనైతే 'నేను సాక్షాత్ పూర్ణబ్రహ్మ పరమాత్మను ఇలా అందరికంటే పెద్దగా మారి (విశాలంగా మారి) అహంకారాన్ని నశింపజేయాలి. భక్తిమార్గంలో 'నేను అందరి సేవకుడను, దాసానుదాసుడను, కింకరుడను, అందరి కాలి ధూళిని, నేను ఏమీ కాను' అని చిన్నవారి కంటే చిన్నవానిగా మారి అహంకారాన్ని నశింపజేసుకోవాలి. అన్నిటికంటే ముందు దేశము, జాతి, వర్ణము, ఆశ్రమము మొదలైన సాంసారికమైన అహంకారాన్ని నశింపజేయాలి. తరువాత చివరగా నేను భక్తుడను, సాధకుడను అనే శుద్ధమైన అహంకారము కూడా నశిస్తుంది. జ్ఞానమార్గమునందు యథార్థ జ్ఞానము వలన అన్ని విధములుగా నున్న అహంకారము సమసిపోతుంది. అదే భక్తిమార్గంలోనైతే భగంతుని కృపవల్ల అన్నివిధాలుగా నున్న అహంకారము నశిస్తుంది. ఈ రెండు సాధనాలవల్ల అహంకార- మమకారాలు నశించగా ఆ మనిషి కర్మ కూడా అకర్మ అవుతుంది. అతడు ఏదైనా పని చేయడమనేది పని కావడమనే రీతిలో మారిపోతుంది. ఇలా రెండు రకాల సాధకులకు కూడా పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. చివరి ఫలము మాత్రము ఇద్దరికీ ఒకటే. (చూడండి గీత 18/54-55 మరియు 11/54-55)

కానీ బయటికి అతని వ్యవహారం ఉన్నతస్థాయి గల సాత్త్విక సాధకుని

వ్యవహారం లాగానే వుంటుంది. లౌకిక దృష్టితో అతడు బ్రహ్మచారి లేదా సాధువు లేదా గృహస్థుడు ఏదైనా అతని వేషాన్ననుసరించి శ్రేష్ఠ బ్రహ్మచారియని, శ్రేష్ఠసాధువని, శ్రేష్ఠగృహస్థుడని వ్యవహారము ఏర్పడుతుంది. అతనిలో స్వాభావికమైన దోషమేది రాదు, అతను తన వేషాన్ని కప్పిపుచ్చడు. ఈ విషయం అవగాహన కావడానికి ఒక చిన్న కథ వుంది.

ఒక పగటివేషగాడు వుండేవాడు. అతడు తన వేషాన్ని పూర్తిగా మార్చుకొని, అందులో చిన్న తప్పు కూడా జరుగకుండా జాగ్రత్త పడేవాడు. ఒకరోజు అతడు రాజుగారి దగ్గరికి వెళ్లాడు. బహుమతి పొందాలనే ఉద్దేశంతో రాజుతో ఇలా అన్నాడు. 'మహారాజా! మీరు ఏ వేషాన్ని చూడాలనుకుంటున్నారు?' రాజు అన్నాడు - 'నీవు సింహం వేషాన్ని వేయుము,' బహురూపి విన్నవించుకున్నాడు -'సింహపు వేషాన్ని గూర్చి చెప్పకండి. ఈ వేషము చాలా క్రూరమైనది. సింహము వేషము వేస్తే దాని స్వభావానికి అనుకూలంగా ప్రవర్తిస్తాను. దానితో తప్పుగానీ, ప్రమాదంగానీ రానివ్వకుండా వుంటాను. కాని వేషాన్ని కప్పిపుచ్చను. ఆ సమయంలో ఆ వేషాన్ని కాపాడుకోడానికి నా చేత ఏదైనా అపరాధము జరిగితే మీరు దానిని క్షమించాలి.' అనగా రాజన్నాడు - 'చాలా మంచిది, వేషాన్ని కాపాడుకొనడానికి నీవు ఏదైనా తప్పు చేస్తే అది క్షమించదగినదని భావిస్తాము. నీవు సింహవేషాన్ని ధరించిరా!' ఈ మాట నగరమంతా వ్యాపించింది. దీనితో నగరంలోని ప్రజలంతా జాగ్రత్త వహించారు.

రెండవరోజు ఆ పగటి వేషగాడు సింహంగా మారి గర్జిస్తూ, దూకుతూ, వీధిని దాటి రాజసభలోకి ప్రవేశించాడు. నగరప్రజలు, సభలోని వారు అందరూ నిశ్శబ్దంగా స్తంభించిపోయి దానినే చూస్తుండిపోయారు. కాని రాజుగారి చిన్నపిల్లవాడు ఒకడు 'నేను రాజకుమారుణ్ణి' అనే అభిమానంతో సింహము యొక్క మలద్వారంలో దంతాన్ని ఒకదాన్ని చొప్పింపజేశాడు. అపుడు ఆ సింహము ముందు పంజాలు రెండింటితో, సింహము లాగానే ఆ రాజకుమారుని పైన దెబ్బతీసింది. దానితో ఆ బాలుడి ప్రాణాలు పోయ్యాయి. సింహము దుముకుతూ తిరిగివెళ్లపోయింది.

రాజకుమారుని మరణంతో రాజపరివారమునకు రాజసభలోని వారికి

చాల దుఃఖము, క్షోభ కలిగింది. మరునాడు ఆ పగటివేషగాడు కూడా తన నిజమైన రూపంతో వచ్చాడు. అతను చాలా దుఃఖాన్ని ప్రకటించాడు. మళ్ళీ విన్నవించాడు! 'మహారాజా! అందుకనే నేను సింహము వేషాన్ని ధరించమని అడుగవద్దని ప్రార్థించితిని. నావలన పెద్ద తప్పు జరిగింది. నేను రాజకుమారుని మరణానికి కారణమైనాను. ఇప్పుడు నేను పగటివేషగాడిని. ఇప్పుడు మీరు కోరినంత అవమానించవచ్చు. దండన విధించవచ్చు. కాని ఆ సమయంలో నేను సింహము వేషములో వున్నాను. దాని స్వభావాన్నే అనుసరించి ప్రవర్తించుచుంటిని. మీరే చెప్పండి. ఏదైనా సింహము మలద్వారంలో దంతాన్ని చొప్పింపజేస్తే దాన్ని ఆ సింహము ఎలా సహిస్తుంది? నేను వేషాన్ని కప్పిపుచ్చలేను. అలా చేస్తే, వేషాన్ని సఫలం చెయ్యలేను, జీవించనే లేను. నేను భగవంతుని ఉపాసకుడిని. అతని దయవల్లనే నా వేషం సఫలమవుతుంది. నాకు దాంట్లో విజయం లభిస్తుంది.' అనగా రాజు ఇదంతా వినసాగాడు. కానీ అతని హృదయంలో రాజకుమారుని మరణం వల్ల చాలా దుఃఖము, క్షోభ కలుగుచుండెను. కానీ అతను మాటకు కట్టుబడి ఏమీ చేయలేకపోయాడు. పగటివేషగాడు రాజునిలా అడిగాడు. 'మహారాజా! ఇపుడు నేను ఏ వేషాన్ని ధరించాలి?' దీనితో రాజకుమారుని మరణశోకముతో తపించుచున్న మంత్రి అన్నాడు. 'నీవు మహాత్ముడైన శుకదేవుని వేషాన్ని ధరించిరా!' అనగా పగటివేషగాడు వెళ్ళిపోయాడు. పదిహేను రోజుల తరువాత శ్రీశుకదేవుని వంటి ఒక ఉన్నతశ్రేణికి చెందిన జ్ఞాని వేషాన్ని కట్టి బయటకు వచ్చి నగరానికి దగ్గరలో ఉత్తరదిక్కున ఇసుకతిన్నె వద్దకు వెళ్ళి కూర్చున్నాడు. దీనితో నగరంలో వెంటనే ఒక మహాత్ముడు ఇక్కడ కూర్చున్నాడన్న వార్త వ్యాపించింది. ఇది తెలిసి ఆ మహాత్ముడిని చూడాలనుకున్న వారి గుంపు అక్కడ ఏర్పడింది. ఈ వార్తను విన్న ఆ మంత్రి రాజుతో అన్నాడు - 'రాజా! ఆ పగటివేషగాడే వేషాన్ని కట్టి వచ్చాడని అర్థమవుతుంది. అతడు రాజకుమారుడిని చంపాడని నా హృదయంలో చాలా దుఃఖము వుంది, ఇప్పుడు కూడా వున్నది. ఆ ఉద్దేశ్యంతోనే నేను శుకదేవుని వేషాన్ని కట్టమని ఇతనితో అన్నాను. ఈ వేషము ధరించుట చాలా కష్టము. ఈ వేషమును అతడు

సరిగ్గా పోషింపక పోయినచో ఇతనికి దండనను విధించవచ్చు. కాబట్టి మీరు కూడా నాతో కలిసి అతనిని చూడడానికి పదండి. అమితమైన లోభాన్ని చూపి అతడిని ఆ వేషం నుండి చలించేటట్లు చేద్దాం' - ఇలా సంభాషించి వారిద్దరూ అచటికి చేరుకొన్నారు. రాజు, మంత్రి ఆ మహాత్మునికి నమస్కారం చేశారు. ఇంకా అతని కాళ్ళవద్ద రత్నాలమూటలను, బంగారు మూటలను నాణాల మూటలను వుంచారు. కానీ ఆ మహాత్ముడు వాటిని తృణీకరించి వెంటనే అక్కడినుండి లేచి అరణ్యం వైపు వెళ్ళిపోయాడు. మంత్రి అతడిని వెంబడించాడు. ఏకాంత ప్రదేశానికి రాగానే మంత్రి అతడి చెవిలో అన్నాడు. 'నీవు పగటివేషగాడివి. మహాత్ముడైన శుకదేవుని వేషాన్ని ధరించి వచ్చావు. ఇది నాకు తెలుసు. ఈ సంచులలో కొన్ని లక్షల రూపాయల ధనమున్నది. కాబట్టి నా ప్రార్థన ఏమంటే. నీవీ ధనాన్నంతా తీసుకో. తరువాత మనము చెరి సగం పంచుకుందాం.' ఆ మహాత్ముని రూంపలో వచ్చిన పగటివేషగాడు మంత్రి మాటను బొత్తిగా వినిపించుకోక వైరాగ్య భావనతో అరణ్యంలోకి వెళ్ళిపోయాడు. అపుడు రాజు, మంత్రి వెనుదిరిగి వచ్చారు.

రెండు రోజుల తరువాత ఆ పగటివేషగాడు రాజ భవనానికి వచ్చి, అన్నాడు 'మహారాజా! శుకదేవుని వేషము మీకు ఎలా అనిపించింది?' అనగా రాజు 'చాలా బాగుంది,' అన్నాడు. అపుడు అతడు 'ఇపుడు ఏ వేషాన్ని ధరించాలి?' అని అడిగాడు. అక్కడ రాజభక్తుడైన ఒక మంగలివాడు కూడా వున్నాడు. అతను ఈ పగటివేషగాడు రాజకుమారుని హత్యచేశాడు. ఇది ఇతని పెద్ద తప్పు, కాబట్టి ఇతనికి పెద్దశిక్ష పడాలి అనుకొని ఇలా అన్నాడు - 'సతీసహగమనము చేయబోయే పతివ్రతయైన స్త్రీ వేషాన్ని ధరించు.' రాజు, మంత్రి కూడా దీనిని సమర్థించారు. పగటివేషధారి ఆనందంగా దీనిని స్వీకరించి అంగీకరించి ఇంటికి వెళ్ళిపోయాడు.

కొన్ని రోజుల తరువాత అతడు ఒక శవము నీటిపై తేలుతూ నది ఒడ్డున పడినదని చూసి దానిని ఇంటికి తీసుకొని వెళ్ళాడు. ఆ శవాన్ని పతిగా అలంకరించి, తాను పదహారు రకాల శృంగార అలంకారాలతో కూడిన పతివ్రతయైన సతీ స్త్రీ వేషాన్ని ధరించాడు. ఆ పతి శవాన్ని అలంకరించి వాయిద్యాలతో చాలా కోలాహలముతో శ్మశానానికి వెళ్ళడానికి ఊరేగింపును లేవదీశాడు. ఈ వార్త వెంటనే నగరమంతా వ్యాపించింది.

వేలకొద్ది స్త్రీ పురుషులు ఆ శవంతో కలిసి శ్మశానస్థలానికి వెళ్ళారు. ఈవిషయం మంత్రికి తెలియగా అతడు రాజుతో ఇలా అన్నాడు. 'ఇతడు ఆ పగటివేషధారియే, పతివ్రతయైన సతియొక్క రూపాన్ని ధరించి వచ్చాడు. ఇతడిని కాల్చివేయడానికి ఏర్పాట్లు చేయించడానికి నేనే వెళతాను' అని మంత్రి కొలిలా మందిని తీసుకొని శ్మశానానికి వెళ్ళాడు. సుమారు వంద దుంగలను కాష్ఠంగా పేర్చి చితిని సిద్ధం చేశారు. ఆ పతివ్రతా సతి తన భర్త శవాన్ని ఒడిలో వుంచుకొని చితిపై భస్మము కావడానికి కూర్చుంది. చితి యొక్క నలువైపులా అగ్ని ప్రజ్వాలింపజేయబడింది. అదే సమయంలో చాలా వేగంగా తుఫాను వచ్చింది. దానివల్ల మంత్రి, మంత్రితో వచ్చిన వ్యక్తులు, నగరానికి చెందిన వారు అందరూ నలుదిక్కులా పారిపోయారు. తుఫానుతోపాటు పెద్దవర్షము కురియసాగింది. ఆ వర్షం చితిపై ఎగసిపడుతున్న మంటలను చల్లార్చింది. అపుడు అగ్ని ఇంకా అంటుకోని వైపునుండి పగటివేషధారి క్రిందికి దిగి ఆ చితికి అన్నివైపులా అగ్నిని ప్రజ్వాలింపజేశాడు. ఆ శవము కాలి బూడిదైనది. ఆ తరువాత అతడు తన ఇంటికి తిరిగివెళ్ళాడు. రెండవరోజు మంత్రి, మరియు రాజు వెళ్ళి చూడగా అక్కడ బూడిద, శవం యొక్క ఎముకలు తప్ప ఏదీ లేదు.

కొద్ది రోజులలోనే ఆ పగటివేషగాడు తన రూపంలో రాజభవనంలోకి వచ్చాడు. రాజుతో ఇలా అన్నాడు. 'మహారాజా! సతి యొక్క వేషము ఎలా వుంది?' రాజు బదులిచ్చాడు - 'చాలా బాగుంది' అని మళ్ళీ అడిగాడు. 'నువ్వు సజీవంగా ఎలా వున్నావు?' అనగా పగటివేషగాడు అన్నాడు, 'మహారాజా! నేను వేషాన్ని కప్పిపుచ్చను. అందుకనే భగవంతుడు నన్ను రక్షిస్తాడు. నేను స్వర్గానికి వెళ్ళాను. మీతండ్రిగారిని, తాతగారిని కలిసాను. వాళ్ళ గడ్డం-మీసాలు, గోళ్ళు చాలా పెద్దవిగా వున్నాయి. మీరందరూ క్షేమంగానే వున్నారు కదా! కష్టమేదీ లేదుకదా. మీసందేశంగా రాజుగారికేమిచెప్పను?' అని నేను అడిగాను. వాళ్ళు అన్నారు. 'ఇక్కడ మేమందరము క్షేమముగా, ఆనందముగా వున్నాము. కేవలం మంగలివాని లోటు వుంది. ఒక మంగలివాడిని ఇక్కడికి పంపాలి.' ఇది విని రాజు ఆ మంగలివానితోటే అన్నాడు. 'నువ్వు వెళ్ళి వాళ్ళ సేవ చెయ్యి.' మంత్రి కూడా మంగలి వానితో అన్నాడు. 'ఇతనెలా స్వర్గానికి వెళ్ళాడో నీవు కూడా రేపు స్వర్గానికి వెళ్ళు.' అనగా ఆ మంగలివాడు పగటివేషగాడిని

విడిగా తీసుకొనివెళ్ళి అన్నాడు. 'నన్నెందుకు చంపించాలనుకుంటున్నావు?' అపుడు పగటివేషధారి బదులిచ్చాడు. 'నీవే నాకు అనిష్టాన్ని కలిగించాలనుకున్నావు. నన్ను చంపించాలనే సతీవేషాన్ని ధరించమన్నావు. అందుకే నేను నిన్ను పంపుతున్నాను. ఏ మనిషి ఇతరులకు అనిష్టాన్ని కలిగించాలనుకుంటాడో అతనికే అనిష్టం కలుగుతుంది.' అనగా మంగలివాడు ఇలా అన్నాడు. 'నా తప్పును క్షమించు, నేను నిన్ను శరణువేడుతున్నాను. నన్ను ఈ ఘోరమైన ఆపద నుండి రక్షించు.'

అపుడు పగటివేషధారి రాజసభలోకి వచ్చి రాజు ఎదుట మంత్రితో మొదటి నుండి చివరి వరకు వాస్తవమైన సంఘటనలను వినిపించాడు. 'నేను వేషాన్ని కప్పిపుచ్చను. కాబట్టి భగవంతుడు నన్ను అన్నివిధాలుగా రక్షిస్తాడు. మీరంతా చితికి నిప్పంటించి తుఫాను - వర్షం యొక్క భయంతో వెళ్ళిపోయినపుడు చాలా వేగంగా వర్షం వచ్చింది. దానితో నిప్పు చల్లారింది. నేను బ్రతికిపోయాను. తరువాత నేను చితకి నలువైపులా నిప్పంటించాను. దానితో ఆ శవము తగులబడింది. స్వర్గానికి వెళ్ళి ఎవడూ తిరిగి రాలేడు. నేనైతే భగవంతుని దయవల్ల బ్రతికిపోయాను. ఈ అమాయకుడైన మంగలివాని ప్రాణాలను పోగొట్టకూడదు.'

దానితో రాజు అతనితో 'నీ వేషధారణతో మేము చాలా ఆనందించినాము. మా కుమారుని మరణంలో ఏది జరగాలో అది జరిగింది. ఇక నీవు దానిని గూర్చి శోకించకూడదు.' అని ప్రసన్నతతో ఆ పగటివేషధారికి వేల రూపాయలను బహుమతిగా ఇచ్చాడు. ఆ బహుమతి నందుకొని పగటివేషగాడు ఇంటికి వెళ్ళిపోయాడు.

ఈ కథ ద్వారా తెలిసే నీతి ఏమంటే, ఏ ఆశ్రమం వాడైనా మరియు ఏ వర్ణానికి చెందినవాడైనా తన రూపాన్ని కప్పిపుచ్చుకోకూడదు. తన వేషాన్ని కప్పిపుచ్చని వానిని భగవంతుడు అన్ని రీతులుగా పగటివేషధారిని రక్షించిన విధంగా రక్షిస్తాడు. అన్న ఉపదేశం లభిస్తుంది. అంతేగాక ఇతరుల అనిష్టాన్ని ఎప్పుడూ కోరుకోవద్దులేకపోతే, మంగలివానికి భయము ప్రాప్తించినట్లు భయము ప్రాప్తిస్తుంది అన్న ఉపదేశము కూడా లభిస్తుంది.

కాబట్టి పైన చెప్పిన వివేచనతో తెలుసుకోవలలసింది ఏమంటే -

జ్ఞానులు, మహాత్ములు అయినవారు లోకవ్యవహారం కోసం రుపాన్ననుసరించి పనులుచేస్తారు. లోకులు వారిని ఏ వర్ణమునకు, ఏ ఆశ్రమమునకు చెందిన వారుగా తెలుసుకుంటారో దానికి తగినట్లు వారు ప్రవర్తిస్తారు. తమ నిజమైన పరిచయాన్ని వారు తమ ఆంతరంగికులకు తప్ప, ఇతరులకు తెలియనివ్వరు. కానీ నేను జ్ఞానిని, మహాత్ముడిని, యోగిని, మహాపురుషుడిని, అధికారిని' అని భావించి చెప్పే వ్యక్తి వాస్తవానికి యోగి, జ్ఞాని, మహాత్ముడు మొదలైనవాడు కాడు. అతడు కేవలం అభిమానము, గర్వము, ప్రతిష్ఠ మొదలగు వానికి దాసుడు, దాంభికుడు, పాషండుడు, శ్రేష్ఠులైనవారు ధనలోభంతో, స్త్రీ మోహంతో, తమ గౌరవ మర్యాదలను పెంచుకోవడానికి ఇతరులకు తమ పట్ల శ్రద్ధ పెరిగేటట్లు చెయ్యరు. ఎందుకంటే, ఏదీ చెయ్యకుండడంవల్లగానీ, ఏదైనా చెయ్యడంవల్ల గాని ప్రయోజనం వుండదు. వారిలో స్వార్థము పూర్తిగా లోపిస్తుంది. గీతలో భగవంతుడు వివరించాడు-

**నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।**
**న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥**

**(3/18)**

'ఆ మహాపురుషునికి ఈ విశ్వంలో ఏదైనా కర్మను ఆచరించడం వల్లగానీ, ఏదైనా కర్మను ఆచరించకపోవడం వల్ల గానీ ప్రయోజనమేదీ వుండదు. అలాగే ప్రాణులన్నింటితో ఇతనికి ఏ కొద్దిగానైనా స్వార్థసంబంధము వుండదు.'

కాబట్టి పరమాత్మను పొందడానికి మనిషి జ్ఞానము లేదా భక్తి ద్వారా అహంకారము - మమకారములను పూర్తిగా తొలగించుకోవాలి.

హరిః ఓం తత్సత్



# 6. సర్వభూతహితేరతాః

భగవంతుణ్ణి పొందడానికి చాలా మార్గాలున్నాయి, 'అవి ప్రాణుల హితము' అనేది అన్ని మార్గాల్లోనూ ఆవశ్యకము. భగవంతుడు ప్రాణులన్నింటిలో ఉన్నాడు కాబట్టి ఏ ప్రాణికి సేవచేసినా, సుఖాన్ని కలిగించినా భగవంతునికి అదే పెద్ద సేవ. ప్రాణి ప్రపంచంలో ఎక్కడ ఏ వస్తువు యొక్క లేమి వున్నదో, అక్కడ భగవంతుడు అదే వస్తువు ద్వారా తన పూజను కోరుతాడు, ఇంకా ఆ పూజలో భగవంతుని ప్రీతి తప్ప వేరే కోరిక వుండకపోతే అట్టి నిస్వార్థ సేవతో ఆత్మోద్ధరణ లేదా భగవత్ ప్రాప్తి సులువుగా లభిస్తుంది. శ్రీతులసీదాసు అంటాడు -

'పరహిత బస జిన్హ కే మన మాహీం తిన్హ కహుం జగ దుర్లభ కఛు నాహీం! ఎవరి హృదయంలో ఇతరుల హితమే వుంటుందో వారికి ప్రపంచంలో దుర్లభమేది వుండదు.' స్కాంద పురణాంలోఇలా చెప్పబడింది-

**పరోపకరణం యేషాం జాగర్తి హృదయే సతామ్ ।**
**నశ్యన్తి విపదస్తేషాం సంపదః స్యుః పదే పదే ॥**
**తీర్థస్నానైర్న సా శుద్ధిర్బహుదానైర్న తత్ఫలమ్ ।**
**తపోభిరుగ్రైస్తన్నాప్యముపకృత్యా యదాప్యతే ॥**

**(కాశి. 6/4-5)**

'ఏ సజ్జనుల హృదయంలో పరోపకార భావన జాగృతమైన వుంటుందో వారి ఆపదలన్నీ నశిస్తాయి. అంతేకాక వారికి అడుగడుగునా సంపదలు కలుగుతాయి. ఇతరులకు ఉపకారము చేయడంవల్ల కలిగేంత ఫలము, పవిత్రత అనేక తీర్థాలలో స్నానము చేయడం వల్లగానీ, అధికంగా దానమివ్వడం వల్లగానీ, తీవ్రమైన తపస్సును చేయడంవల్ల గానీ కలుగదు.'

నిష్కామ భావనతో పరోపకారాన్ని చేసే వ్యక్తికి లౌకికమైన వస్తువులేమిటి, పరమాత్మ లభిస్తాడు. శ్రీమద్భగవద్గీతలోని అయిదవ అధ్యాయం 25వ శ్లోకంలో స్వయంగా భగవంతుడే చెప్పాడు -

**లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః ।**
**ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥**

'ఎవరి పాపములన్నీ నశించాయో, ఎవరి సంశయాలన్నీ జ్ఞానము ద్వారా తొలగిపోయాయో, ఎవరు అన్ని ప్రాణుల హితంలో నిమగ్నులై యుందరో, ఎవరిచేత నిగ్రహింపబడిన మనస్సు నిశ్చల భావముతో పరమాత్మయందు వుంటుందో, అట్టి బ్రహ్మజ్ఞాని అయిన పురుషుడు శాంత బ్రహ్మను పొందుతాడు.'

పైన చెప్పిన లక్షణాలు గలిగి, పాపములు లేని సత్పురుషులు అన్ని ప్రాణుల హితములో ప్రవర్తిస్తూ వుండడంవల్ల నిర్వాణ బ్రహ్మను పొందుతారు. అందువల్ల, అన్నిరకాలుగా స్వార్థాన్ని విడిచిపెట్టి తన శరీరము, మనస్సు, ధనము మీటి ద్వారా, దుఃఖితులు, అనాథలు, బాధితులు అయిన ప్రాణుల సేవ చెయ్యడమే మనిషికి తగినది. అంటే మనిషి తన శరీరాన్ని, మనస్సును, డబ్బును లేమితో బాధపడుతూవున్న ప్రాణుల దుఃఖాన్ని నశింపజేయడానికి, దీనుల కొరకు, దుఃఖితుల కొరకు, అనాథల కొరకు, పీడితుల కొరకు' అనే ఉద్దేశము ఏ మహానుభావులకు వుంటుందో వారి జీవితమే ధన్యము. ఈ విషయాన్ని గురించి ఒక చక్కని కథ వుంది.

ఉన్నతస్థాయికి చెందిన ఒక మహాత్ముడు వుండేవాడు. ఆయన విరాగి, జ్ఞాని, ముందు చెప్పిన లక్షణాలన్నీ ఆయనలో ఉండేవి. సమదర్శి అయిన ఆ మహాత్ముని సత్సాంగత్యంలో చాలా పెద్దవారైన మహారాజులు మొదలుకొని అతి పేదవారైన మనుష్యుల వరకు కూడా వచ్చి చేరేవారు. అలా వచ్చే శ్రోతల, భక్తుల కోసం ఆ మహాత్ముడు ఈ శ్లోకం ఆధారంగా ఉపదేశాల నిచ్చేవాడు. నిష్కామ భావనతో దుఃఖితులకు, పీడితులకు సుఖాన్ని కలిగింపజేయడం ద్వారా పరమాత్మ ప్రాప్తిస్తాడు అనేదే ఆయన ప్రధాన సందేశం.

ఒకరోజు ఆ నగరాన్ని పాలించేరాజు, ఆ మహాత్ముని దగ్గరకు వచ్చాడు. ఆ మహాత్ముని పాదాలకు నమస్కరించి అడిగాడు. 'ఈ యుగంలో కూడా భగవంతుడు ప్రాప్తిస్తాడా? ప్రాప్తించినట్లయితే, దానికి సులువైన ఉపాయమేమిటి?' దానికి ఆ మహాత్ముడు ఇలా బదులిచ్చాడు - 'పరమాత్మ ప్రతిప్రాణి హృదయంలో వున్నాడు - కాబట్టి ప్రాణులన్నింటిని

నిష్కామభావనతో, తత్పరతతో సేవించడం ద్వారా పరమాత్మ ప్రాప్తించగలడు. ప్రాణులలో కూడా దుఃఖమును పొందిన, అనాథలను విశేషంగా సేవించసాగాడు.

ఒక సంవత్సరము గడచిన తరువాత రాజు ఆ మహాత్ముని వద్దకు వెళ్ళి అన్నాడు - 'మీ ఆజ్ఞానుసారము అనుష్ఠానము చేస్తూ నాకు సంవత్సరం గడిచింది. కానీ ఇంతవరకు పరమాత్మ ప్రాప్తించలేదు.' అనగా మహాత్ముడన్నాడు. 'రాజా! ధైర్యాన్ని వహించు, నిష్కామభావనతో ఉత్సాహంతో ఇంకా విశేషంగా దుఃఖితులను సేవిస్తూ వుండు. అలా చేస్తూ వుండగా, నీ మనస్సు శుద్ధమై పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది.' దీనిని విని రాజు నివాసానికి తిరిగి వెళ్ళి అంతకు ముందు వలెనే ఇంకా విశేషంగా మరింత ఉత్సాహముతో దీన దుఃఖితుల సేవ చెయ్యసాగాడు.

ఇలా చేస్తూ వుండగా మరొక సంవత్సరం గడిచింది, కానీ పరమాత్మ ప్రాప్తి కలగులేదు. అపుడు రాజు మహాత్ముని వద్దకు వెళ్ళి ఇలా ప్రార్థించాడు. 'మహాత్మా! మీ ఆజ్ఞానుసారము సేవానుష్ఠానము నడుస్తూ వుంది. నేను మీ ఆదేశాన్ననుసరించి నా శరీరాన్ని, మనస్సును, ధనమును అంతా సేవలో వినియోగించాను. ఇప్పటివరకు చాలా భాగము ధనము పరోపకారానికే వ్యయమైంది. అయినా పరమాత్మ ప్రాప్తించే లక్షణమేదీ నాకు కనిపించడం లేదు.' దీనితో మహాత్ముడన్నాడు. 'నీవు దృఢ విశ్వాసాన్ని వహించు. కొద్దిగా కూడా సందేహించకు. నీకు నిశ్చయంగా పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. నీవు చాలా చక్కగా, శుద్ధ భావనతో సేవను చేస్తూ వున్నావు. కానీ, నిజానికి ఏ రకమైన దుఃఖితులకు, అనాథలకు, పీడితులకు ఏ విధమైన సేవ జరగాలో అలాంటి సేవ ఇంతవరకు నీ చేత జరుగలేదు. కానీ, పరమోల్లాసముతో, శ్రద్ధతో ఎల్లప్పుడూ చేస్తూ వుంటే ఎప్పుడో ఒకప్పుడు అలాంటి సేవ కూడా జరుగుతుంది. కాబట్టి, నీవు మనస్సును, బుద్ధిని, ఇంద్రియాలను నిగ్రహించి వాటిని నిస్వార్థభావనతో కేవలము భగవంతుని ప్రీతికై దుఃఖితుల సేవలో వినియోగించు.'

మహాత్ముని అమృతమయమైన మాటలను విని రాజు చాలా ఆనందించాడు. తన ఇంటికి వచ్చి ఆ మహాత్ముని ఆదేశంప్రకారం చాలా ఉత్సాహముతో అందరి హితములో నిమగ్నుడైనాడు. ఇక ఆయన దీన

దుఃఖితుల, అనాథల రూపములో నారాయణుని విశేషంగా సేవించసాగాడు.

అదే నగరంలో ఒక విధవ ఉండేది. ఆమె బీదరాలు, అనాథ కూడా. ప్రతిరోజూ అడవినుండి ఎండుకట్టెలు తెచ్చి నగరంలో అమ్మి దానితో తన ఏకైక పుత్రుడైన ఐదేళ్ళ బాలుణ్ణి పోషించుకునేది. ఆమె సంపాదించిన దానితో వారిద్దరి కడుపులు నిండడమే కష్టంగా ఉండేది. కాబట్టి ఆమె దగ్గర ఒక పైసా కూడా నిలవ వుండేది కాదు. ఒకరోజు ఆమె తన కొడుకును తీసుకొని అడవికి వెళుతూ వుండగా ఆ బాలుడు మార్గమధ్యలో గిలక్కాయ మొదలైన ఆటబొమ్మలతో ఆడుకుంటున్న ధనికుల అబ్బాయిని చూశాడు. దాన్ని చూసి ఆ బాలుడు తనకు గిలక్కాయ, చక్రము మొదలైనవి తెమ్మని తన తల్లిని అడిగాడు. కొడుకు మాటను విని తల్లి అన్నది. 'బాబూ! నేను పేదదాన్ని, నాదగ్గర డబ్బులెక్కడివి? కట్టెలను అమ్మి నేను తెచ్చే డబ్బులతో కడుపు నిండడమే చాలా కష్టంగా వుంది. ఇక ఆటబొమ్మలను ఎక్కడి నుండి కొని ఇవ్వగలను?' అమాయకుడైన ఆ బాలుడు ధనవంతునికి బీదవానికి మధ్య భేదాన్ని అర్థం చేసుకోలేకపోయాడు. వానికి ఆటబొమ్మలు కావాలన్న పట్టుదల మాత్రము వుంది. వాడు ఏడవడం మొదలుపెట్టి అక్కడే పడి దొర్లసాగాడు. ఆ తల్లి ఎలాగో వాణ్ణి లేపి ఇంటికి తీసుకొని వచ్చింది. ఆమె బాలునికి అన్ని విధాలుగా నచ్చచెప్పింది, కానీ పిల్లవాడు ఏదీ వినలేదు. ఈ కారణం చేతనే ఆ రోజు కట్టెలను తేవడానికి వెళ్ళలేకపోయింది. రోజంతా వారిద్దరూ ఆకలితో మాడవలసి వచ్చింది. ఆ పిల్లవాడు తన మొండిపట్టును వీడలేదు. ఏడుస్తూనే వున్నాడు. వాని ఏడుపును చూసి బాధపడిన తల్లి కూడా ఏడుస్తూనే వుంది. బాలుని మొండిపట్టును పూర్తిచేయడానికి ఆమె దగ్గర డబ్బు అయితే లేదు.

అర్ధరాత్రి సమయము అంతా నిశ్శబ్దంగా వుంది. అందరూ నిద్రిస్తున్నారు. కానీ గుడిసెలోని ఒక మూల పేదవారైన తల్లీకొడుకులు ఏడుస్తూ వున్నారు. పిల్లవాని ఏడుపు తీవ్రంగావుంది. రాజమహలు దగ్గరలోనే వుంది. దానిలో నిద్రిస్తూ వున్న రాజు ఈ ఏడుపు విన్నాడు. జాలి గొలిపేట్లు వున్న ఆ ఏడుపుని విని రాజు ఉలిక్కిపడి లేచి చుట్టూ చూడసాగాడు. కొత్వాలును పిలిచి అడిగాడు. 'చూడు! ఎవరో ఏడుస్తున్న ధ్వని వినవస్తుంది. నీవు వెంటనే వెళ్ళు. అతడిని ఓదార్చి నా దగ్గరకు తీసుకొని రా!' ఇది విని

కొత్వాలు వెంటనే అక్కడికి వెళ్ళి ఆ పేదరాలుతో అన్నాడు. 'నడువు, మహారాజుగారు నిన్ను పిలుస్తున్నారు.' పాపం ఎండుకట్టెలను అమ్ముకొనే ఆ స్త్రీ కొత్వాలును చూడగానే భయముతో వణకసాగింది. ఆమె అన్నది 'దొరా! వీడు చిన్నపిల్లవాడు. ఏడుస్తున్నాడు. వీడి తప్పును మన్నించండి.' కొత్వాలు ధైర్యాన్ని కలిగిస్తూ అన్నాడు. 'భయపడకు. నాతో రా! రాజు దయతలిచే నిన్ను పిలుస్తున్నారు.' అన్నప్పటికీ ఆ పేదరాలి భయము తొలగిపోలేదు. ఆమె ఇలా అనుకున్నది. 'పిల్లవాని ఏడుపు వల్ల రాజు గారి నిద్ర పాడయినది. ఇందువల్ల ఆయన శిక్ష వేస్తారు. కానీ ఉపాయమేమున్నది? వారు పిలుస్తూ వున్నప్పుడు వెళ్ళవలసిందే,' అనుకొని ఆమె రాజు దగ్గరికి బయలుదేరింది. కొత్వాలు మాటలతో ఆ స్త్రీ ఏడుపు అయితే ఆగిపోయింది. కానీ భయముతో ఆమె శరీరము వణకసాగింది. ఇక ఆ పిల్లవాడు ఏడుస్తూ తల్లి వెంట నడువసాగాడు.

కొత్వాలుతో కలిసి ఆ తల్లీ కొడుకులిద్దరూ రాజమహలుకి చేరుకున్నారు. రాజు దయగొలిపే ఈ దృశ్యాన్ని చూసి భయంతో వణికే ఆ స్త్రీని ఓదారుస్తూ ఇలా అన్నాడు. 'అమ్మా! భయపడకు! చెప్పు, ఈ పిల్లవాడు ఎందుకు ఏడుస్తూ వున్నాడు?' అని అడగగా ఆ స్త్రీ వున్నది వున్నట్లుగా విషయాన్నంతా చెప్పింది. ఆమె ఇలా అన్నది - 'మహారాజా! నేను అడవి నుండి ఎండుకర్రలు తెచ్చి అమ్ముతుంటాను. దానితోనే మా యిద్దరి కడుపు నిండాలి. ఈరోజు నేను కట్టెలు తేవడానికి అడవికి వెళుతుండగా మార్గమధ్యంలో ఒక ధనవంతుల పిల్లవాడు గిలక్కాయ మొదలైన వాటితో ఆడుతుండడం చూసి వీడు అల్లరిచేసి నాకూ ఇలాంటి ఆటబొమ్మలు తెచ్చి ఇమ్మని మంకుపట్టాడు. ఆ కారణంతోనే ఏడవసాగాడు. దానితో నేను కట్టెలు తేవడానికి కూడా వెళ్ళలేక పోయాను, దానితో వీడు ఆకలితో అలమటిస్తున్నాడు. సగం రాత్రి గడిచిపోయింది. వీడు వినడంలేదు. ఏడుస్తూనే వున్నాడు. ఏడవకూడదని నచ్చచెప్తూ నేను చాలా ప్రయత్నించాను కాని చిన్నపిల్లవాడు, తెలివిలేనివాడు ఏం చెయ్యాలి?

రాజు వెంటనే రాజమహలు నుండి మిఠాయిలు ఇతర తిను పదార్థములను తెప్పించి ఇచ్చి అన్నాడు. 'ఇప్పుడే నేను ఆటబొమ్మలను తెప్పిస్తాను. విధవ స్త్రీ అయిన ఆ తల్లి ఆ అబ్బాయికి తినిపించాలని

చాలా ప్రయత్నించింది కానీ మంకు గల ఆ పిల్లవాడు తన కోరిక తీరలేదని ఏదీ తినలేదు. తల్లి కూడా పిల్లవానికి తినిపించకుండా ఎలా తింటుంది? అపుడు రాజు కొత్వాలుతో అన్నాడు. 'ఇపుడే బజారుకు వెళ్ళు. వెళ్ళి ఈ పిల్లవాడు ఏయే ఆటబొమ్మలను కోరుతున్నాడో, అవి ఎక్కడెక్కడ లభించినా సరే, వాటిని ఒక బస్తాలో నింపి తీసుకొనిరా!' అనగా కర్తవ్య పరాయణుడైన కొత్వాలు వెంటనే ఆటబొమ్మల వ్యాపారి ఇంటికి వెళ్ళి అతడిని మేల్కొలిపాడు. తొందరగా అపుడే తనకు దుకాణాన్ని తెరిచి బస్తా ఆటబొమ్మలను ఇవ్వమని చెప్పాడు. రాజుగారి ఆజ్ఞ. ఆ వ్యాపారి వెంటనే ఒక బస్తా ఆటబొమ్మలను ఇచ్చాడు. కొత్వాలు వాటికి తగిన ధరను చెల్లించి ఆ బస్తాను తీసుకొని రాజు ఎదుట వుంచాడు. రాజు వాటన్నిటినీ పిల్లవానికి ఒప్పగించాడు. పిల్లవాడు రెండు చేతులతో ఎన్ని తీసుకోగలడో అన్ని తీసుకొని నవ్వుతూ గంతులు వేయసాగాడు. పిల్లవాడు ప్రసన్నుడవడం చూసి తల్లి సంతోషమునకు కూడా హద్దు లేకపోయింది.

ఆ తరువాత రాజు వారిద్దరికీ కోరిన భోజనాన్ని పెట్టి తృప్తి పరచినాడు, తరువాత మిగిలిన ఆటబొమ్మలను, ఆహారాన్ని ఆ పిల్లవాని తల్లికి ఇచ్చివేశాడు. తల్లీ కొడుకులు ఇద్దరూ చాలా ప్రసన్నమైన మనస్సు గలవారై తమ గుడిసెకు తిరిగి వెళ్ళారు. రాజు నుండి అనుమతిని పొంది కొత్వాలు కూడా తన స్థానానికి తిరిగి వెళ్ళాడు. అదే సమయంలో రాజుకు విజ్ఞానానందఘనుడైన పరమాత్మ స్వరూపం యొక్క ప్రాప్తి కలిగింది. అలాగే అతని ఆనందానికి, శాంతికి హద్దు లేకపోయింది.

తెల్లవారగానే రాజు మహాత్ముని వద్దకు వెళ్ళి దండప్రణామము చేసి మొదటినుండి చివరి వరకు తన అనుభవాన్ని ఆయనకు వినిపించాడు. అపుడు ఆ మహాత్ముడు అన్నాడు. 'రాజా! నీవు చాలామందికి సేవ చేశావు. పరోపకారము కొరకు చాలా ధనాన్ని ఖర్చు చేశావు. కానీ ఈ రోజు జరిగినంత సేవ ఇంతకుముందు ఎప్పుడూ జరుగలేదు. ' ఆ మహాత్ముని మాటలు విని రాజు చాలా సంతోషించి తిరిగి తన నివాసానికి వచ్చాడు.

రాజు తన అనుభవాన్ని వినిపించే సమయంలో ఆ మహాత్ముని దగ్గర నగరానికి రెండు కోసుల దూరంలో వుండే ఒక కటిక దరిద్రుడు కూడా వున్నాడు. అతను ఈ సంఘటనను చాలా ఆసక్తిగా విని మహాత్మునితో

అన్నాడు. 'మహాత్మా! నాలాంటి దరిద్రునికి కూడా భగవంతుడు లభిస్తాడా?' అనగా ఆ మహాత్ముడన్నాడు - 'ఎందుకు లభించడు? భగవంతునికి ధనికుడు, పేదవాడు అనే తేడా వుండనే వుండదు. ఆయన భావం పట్ల ఆకలిగొని వుంటాడు. (భావాన్ని కోరుతాడు) ఒకసారి చోళరాజుకీ, విష్ణుదాసు అనే పేదబాపనికి మధ్య, భక్తి విషయంలో తీసుకొని భగవద్దర్శనానికై పరస్పరము పోటీ మొదలైంది. దానిలో చివరికి ఆ పేద బాపడైన విష్ణుదాసునికి విజయం కలిగింది. ఆ బ్రాహ్మణునికే మొదటగా భగవంతుడు దర్శనమిచ్చాడు.'

ఇది విని దరిద్రుడు అడిగాడు - 'మహారాజా! ఆ చోళరాజు ఎవరు? పేదవాడైన విష్ణుదాసుడు ఎవరు? వారిద్దరి మధ్య ఏవిధమైన పోటీ నడిచింది? రాజుకంటే ముందు ఆ పేద బ్రాహ్మణునికే భగవంతుడు దర్శనమెలా ఇచ్చాడు? దయచేసి ఆ నాకు ఈ కథనంతా విస్తారంగా వినిపించండి.'

మహాత్ముడు ఇలా చెప్పాడు. 'మొదట కాంచీపురంలో చోళుడనే చక్రవర్తి రాజైనాడు. అతని వశంలో ఎన్ని దేశాలున్నాయో అవన్నీ 'చోళ' అనే పేరుతో ప్రసిద్ధమైనాయి. చోళరాజు ఈ భూమండలాన్ని శాసిస్తున్నప్పుడు ఏ మనిషీ దరిద్రుడు, దుఃఖితుడు, పాపి లేదా రోగిగా లేడు. ఆ రాజు లెక్కలేనన్ని యజ్ఞాలు చేశాడు.'

ఇది ఒకనాటి మాట. చోళరాజు 'అనంతశయన' మనే తీర్థానికి వెళ్ళాడు. అక్కడ జగదీశ్వరుడైన శ్రీవిష్ణువు శేషశాయి రూపంలో ఉన్నాడు. అక్కడ రాజు శ్రీవిష్ణువు యొక్క దివ్యమంగళ విగ్రహాన్ని విధి పూర్వకంగా పూజించాడు. అతడు బంగారముతో చేసిన పూలతో, మణులతో, ముత్యాలతో భగవంతుడిని పూజించి అతనికి సాష్టాంగ ప్రణామమును చేశాడు. ప్రణమిల్లి అతడు అలా కూర్చోగానే కాంచీనగర నివాసియైన విష్ణుదాసుడనే బ్రాహ్మణుడు భగవంతుని పూజ కొరకు చేతిలో తులసీదళాలను, నీటిని తీసుకొని అక్కడికి వచ్చాడు. ఆ బ్రాహ్మణుడు విష్ణుసూక్తాన్ని చదువుతూ దేవదేవుడైన భగవంతునికి స్నానం చేయించాడు. తరువాత తులసీదళాలతో పూలగుత్తులతో ఆ దేవదేవుడిని యథావిధి పూజించాడు. చోళరాజు అంతకుముందు ఏ రత్నాలతో భగవంతుడిని పూజించాడో అవి అన్నీ ఈ బ్రాహ్మణుడర్పించిన తులసీదళాలతో కప్పబడినాయి. ఇది చూసి రాజు కోపించి ఇలా అన్నాడు.

'విష్ణుదాసా! నేను మణులతో, బంగారముతో భగవంతుని పూజించాను. అవెంత శోభను వెదజల్లుతున్నాయి! కానీ నీవు తులసీపత్రాలను వేసి అన్నిటినీ కప్పివేశావు చెప్పు. ఇలా ఎందుకు చేశావు? నీవు చాలా మూర్ఖుడవనపిస్తుంది. భక్తి నీకు బొత్తిగా తెలియదు. లేకపోతే అత్యంత సుందరంగా అలంకరించబడిన పూజను పత్రపుష్పాలతో ఎలా కప్పివేశావు? నీ ప్రవర్తన నాకు చాలా ఆశ్చర్యం కలిగింది.'

అపుడు విష్ణుదాసు అన్నాడు - 'రాజా! మీకు భక్తి గూర్చి ఏమీ తెలియదు. కేవలం రాజ్య సంపద కారణంగా మీరు దర్పాన్ని పొందుతున్నారు. ఇంతకుముందు మీరు ఎన్ని వైష్ణవ వ్రతాలను చేశారు? చెప్పండి.'

రాజు అన్నాడు - 'బ్రాహ్మణా! ఒకవేళ నీవు విష్ణుభక్తి గర్వంతో ఇలా మాట్లాడుతున్నట్లయితే చెప్పు, నీలో ఎంత భక్తి వుంది? నీవైతే దరిద్రుడివి, నిర్ధనుడివి. శ్రీవిష్ణువును సంతోషింపజేసే యజ్ఞము, దానము మొదలైన వాటిని ఎప్పుడూ చెయ్యలేవు. ఎప్పుడూ ఒక గుడిని కూడా కట్టించలేవు. ఇలాంటప్పుడు కూడా నీకు నీ భక్తిని గూర్చి ఇంత గర్వమా? మంచిది, ఈ రోజు ఇక్కడ వున్న బ్రాహ్మణులందరూ శ్రద్ధగా నా మాటను వినండి. చూద్దాం - నేను ముందు విష్ణుదర్శనాన్ని పొందుతానా? లేక ఇతడా? దీనితో ప్రజలందరికీ ఇది స్వయగా తెలుస్తుంది మా ఇద్దరిలో ఎంత భక్తి వున్నదో?'

ఇలా చెప్పి చోళరాజు తన భవనానికి వెళ్ళిపోయాడు, అతడు మహర్షి ముద్గలుని ఆచార్యునిగా చేసి వైష్ణవయాగం ప్రారంభించాడు, చాలామంది ఋషులు ఆహ్వానించబడ్డారు. భోజనాదులతో తృప్తిపరిచి, దక్షిణలతో ఆనందపరిచారు.

వేరొకవైపు విష్ణుదాసుడు కూడా భగవంతుని మందిరంలో వుండిపోయాడు. శ్రీవిష్ణువుకు సంతోషాన్ని కలిగించే శాస్త్రోక్తనియమాలను చక్కగా పాటిస్తూ ఎప్పుడూ వ్రతానుష్ఠానము చేయసాగాడు. మాఘమాసవ్రతము, కార్తీకవ్రతములను చేయడం, తులసీవనాన్ని చక్కగా పాలించడం, ఏకాదశీ వ్రతాన్ని చేయడం, 'ఓం నమో భగవతే వాసుదేవాయ' ద్వాదశాక్షర మంత్రాన్ని జపించడం, గీతము, నృత్యము మొదలైన మంగళకర ఉత్సవాలతో ప్రతిదినము

శ్రీమహావిష్ణువును పూజించడం - ఇది ఆ బ్రాహ్మణుని దినచర్య. ఆయన ఈ వ్రతాలనే పాటిస్తూండేవాడు. నడుస్తూ, భుజిస్తూ, నిద్రిస్తూ కూడా అతడు నిరంతరము శ్రీ విష్ణువు యొక్క స్మరణను చేసేవాడు. ఆయన అందరినీ సమంగా చూసేవాడు. ప్రాణులన్నింటిలో భగవంతుడైన శ్రీవిష్ణువునే చూసేవాడు. అతడు శ్రీవిష్ణువు యొక్క ఉద్యాపన - విధి సహితంగా మాఘ, కార్తీక మాసాలలో విశేష నియమాలను కూడ పాటించాడు.

ఈ విధంగా, చోళరాజు, విష్ణుదాసు అనే బ్రాహ్మణుడు పోటీపడి భగవంతుడైన శ్రీవిష్ణువు యొక్క ఆరాధననే చేయసాగారు. ఇద్దరూ తమ తమ వ్రతంలో వుండసాగినారు, ఇద్దరి ఇంద్రియాలు, కర్మలు భగవంతునిపైననే కేంద్రీకరించబడినాయి.

ఒకనాడు విష్ణుదాసు నిత్యకర్మ నాచరించిన తరువాత ప్రసాదం సిద్ధం చేశాడు. కాని ఎవరో దానిని దొంగిలించారు. ఆ దొంగను ఎవరూ చూడలేదు. విష్ణుదాసుడు ఆ ప్రసాదం దొంగిలింపబడ్డా, రెండవసారి సిద్ధం చేయించలేదు. ఎందుకంటే, అలా చేస్తే సాయంకాల పూజకు అవకాశము దొరకదు, అదీగాక ప్రతిదినము పాటించే నియమానికి భంగము వాటిల్లుతుందనే భయము వుండింది. రెండవరోజు అదే సమయంలో ప్రసాదం సిద్ధం చేయించి అతడు అలాగే దాన్ని భగవంతుని భోగానికై తీసుకొని వెళ్ళాడు. వెళ్ళాడో లేదో ఎవరో వచ్చి దానిని మొత్తంగా దొంగిలించారు. ఇలా వరుసగా ఏడురోజులు ఎవరో వచ్చి ఆ బ్రాహ్మణుని ప్రసాదాన్ని దొంగిలించేవారు. దీనితో విష్ణుదాసుకు చాలా ఆశ్చర్యం కలిగింది. అతడు ఆలోచించసాగాడు. 'ఆహా! ప్రతిరోజూ నా వంటకాలను దొంగిలించుకొని పోతున్నది ఎవరైవుంటారు? నేను క్షేత్రసన్యాసాన్ని తీసుకున్నాను. కాబట్టి ఏవిధంగానైనా ఈ ప్రదేశాన్ని విడువలేను. రెండవసారి ప్రసాదాన్ని సిద్ధం చేయిద్దామంటే దానితో సాయంకాలపు పూజ భంగమవతుంది. సామగ్రినంతా శ్రీవిష్ణువునకు నివేదించనంత వరకు నేను భుజించను. అలా ప్రతిరోజూ ఉపవాసం చేస్తే వ్రతమయిపోయేంత వరకు ఎలా బ్రతికి వుంటాను? మంచిది, నేను ఈ రోజు వంటకాలను జాగ్రత్తగా రక్షిస్తాను.'

ఇలా ఆలోచించి వంట చేసిన తరువాత అక్కడే ఒకచోట దాక్కొని నిల్చున్నాడు. ఇంతలో ఒక చండాలుడు కనబడ్డాడు. అతడు విష్ణుదాసుని అన్నాన్ని దొంగిలించి తీసుకొని పోవడానికి సిద్ధంగా ఉన్నాడు. ఆకలిగొన్న అతని శరీరమంతా నీరసించి బలహీనముగా ఉంది.ముఖంపై దీనత్వము, శరీరంపైన బొమికలు, చర్మము తప్ప ఇంక ఏదీ మిగిలిలేదు. అతడిని చూసి విష్ణుదాసుని హృదయము కరుణతో నిండిపోయింది. అతడు ఆ చండాలునితో అన్నాడు. 'సోదరా! కొద్దిగా ఉండు, ఉండు. ఎందుకలా ఎండిన దానిని తింటున్నావు? ఈ నెయ్యినైనా తీసుకో!' ఈ విధంగా చెప్తూ విప్రశ్రేష్ఠుడైన విష్ణుదాసుడు రావడాన్ని చూసి చండాలుడు ఇంకా వేగంగా పరుగెత్తాడు. భయంతో మూర్ఛను పొంది పడిపోయాడు. విష్ణుదాసు వెంటనే అతని వద్దకు వెళ్ళాడు. కరుణతో అతడు తన వస్త్రంతో చండాలునికి గాలి విసరసాగాడు. తరువాత ఆ చండాలుడు లేచి నిలబడగా విష్ణుదాసు అతనివైపు చూశాడు. అతడు చండాలుడు కాదు. సాక్షాత్తు నారాయణ భగవానుడే శంఖచక్రగదా పద్మాలను ధరించి ఎదుట నిలిచాడు. అతడు పీతాంబరము ధరించి, నాలుగు భుజములతో, ఎదపై శ్రీవత్సమును, తలపై కిరీటమును గలిగి శోభిల్లుచున్నాడు. అతసీ పుష్పాలవలె నీలంగా సుందరంగా నున్న శరీరము, కౌస్తుభమణితో ప్రకాశిస్తున్న వక్షఃస్థలము అపూర్వమైన శోభను కలిగివున్నవి. తన ప్రభువును ప్రత్యక్షంగా చూసిన విష్ణుదాసు పులకించిపోయాడు - కన్నుల నీరు తిరిగింది. భగవంతుని స్తుతించడానికి గానీ, నమస్కరించడానికి గానీ అతనికి చేతకాలేదు. ఆ సమయంలో అక్కడికి ఇంద్రాది దేవతలు, మహర్షి గణాలు వచ్చాయి. శ్రీమహావిష్ణువు సాత్త్వికవ్రతాన్ని పాలించే తన భక్తుడైన విష్ణుదాసును అక్కున చేర్చుకున్నాడు. అంతేగాక అతనికి తనవంటి రూపాన్ని ఇచ్చి వైకుంఠానికి తీసుకొని వెళ్ళాడు.

ఆ సమయంలో యజ్ఞదీక్షలో నున్న చోళరాజు సుందరమైన విమానంలో కూర్చొని భగవాన్ శ్రీమహావిష్ణువు యొక్క నివాసానికి విష్ణుదాసు వెళుతుండగా చూశాడు. రాజు వెంటనే తన గురువైన ముద్గల మహర్షిని పిలిచి అన్నాడు. ఎవరితో పోటీ పడడానికి నేను యజ్ఞదానాది కర్మలను ఆచరించానో ఆ బ్రాహ్మణుడు ఈనాడు విష్ణుభగవానుని రూపాన్ని ధరించి నాకంటే ముందే

వైకుంఠానికి వెళుతున్నాడు. నేను ఈ వైష్ణవయాగంలో చక్కగా దీక్షబూని అగ్నిలో హవనాన్ని చేశాను. దానము మొదలైన వాటి ద్వారా బ్రాహ్మణుల మనోరథాన్ని పూర్తిచేశాను. అయినా ఇంతవరకు భగవంతుడు నాపట్ల ప్రసన్నుడు కాలేదు. ఆ బ్రాహ్మణునికి కేవలం భక్తి అనే కారణంతో శ్రీహరి ప్రత్యక్షంగా దర్శనమిచ్చాడు. భగవంతుడు కేవలం దాన, యజ్ఞ కర్మలతో ప్రసన్నుడు కాడు. ఆ ప్రభువు యొక్క దర్శనాన్ని కలిగించడంలో భక్తియే ప్రధానమైన కారణమని అనుకొనెను.

చోళరాజు చిన్నతనం నుండే యజ్ఞదీక్షను తీసుకొని వాటిలో తల్లీనుడై వుండేవాడు. అందువల్ల అతనికి సంతానము కలుగలేదు. కాబట్టి అతడు తన అల్లుడిని సింహాసనాభిషిక్తుడిని చేశాడు. తరువాత అతడు యజ్ఞశాలలోకి వెళ్ళి యజ్ఞగుండం ఎదుట నిల్చొని శ్రీవిష్ణువును సంబోధిస్తూ మూడుమార్లు గట్టిగా ఈ క్రింది మాటలను పలికాడు. 'ఓ విష్ణుమూర్తీ! నీవు నాకు మనస్సు, వాక్కు, శరీరము చేష్ట ద్వారా నిశ్చలభక్తి నివ్వు.' ఇలా అని అతడు అందరూ చూస్తూ వుండగానే అగ్నిలో దూకినాడు. రాజు అలా దూకగానే, భక్తవత్సలుడైన శ్రీవిష్ణు భగవానుడు ప్రత్యక్షమై రాజును అక్కున చేర్చుకొని ఒక ఉత్తమమైన విమానంలో కూర్చొబెట్టాడు. తరువాత తనవంటి రూపాన్ని ఆ రాజుకు ఇచ్చి దేవేశ్వరుడు దేవతలతో కలిసి వైకుంఠానికి బయలుదేరాడు. (ఈ కథ పద్మపురాణం యొక్క ఉత్తరఖండంలో 110-111వ అధ్యాయంలో వర్ణింపబడింది.)

కథను విన్న ఆ కటిక దరిద్రునికి మహదానందము కలిగింది. అతడు ఉత్సాహంగా మహాత్మునితో అన్నాడు - 'నాలాంటి దరిద్రునికి భగవంతుడు శీఘ్రాతిశీఘ్రంగా ఎలా లభిస్తాడు?, అనగా మహాత్ముడన్నాడు - 'అన్ని ప్రాణులలో పరమాత్ముడు వ్యాపించినట్లు భావిస్తూ నీ కర్మల ద్వారా వాటిని సేవించు.' భగవద్గీతలో భగవంతుడు ఇలా అన్నాడు-

**యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥**

**(18/46)**

'ఏ పరమేశ్వరుని నుండి ప్రాణులన్నిటి ఉత్పత్తి జరిగిందో, ఎవరిచేత

జగత్తంతా వ్యాపించియుందో ఆ పరమేశ్వరుణ్ణి మనిషి తన స్వాభావిక కర్మల ద్వారా పూజిస్తూ పరమాత్మను పొందుతాడు.'

మహాత్ముని ఆదేశాన్ని పొంది ఆ కటిక దరిద్రుడు తన గ్రామానికి వెనుదిరిగాడు. ఆ మహాత్ముడు ఆజ్ఞానుసారము సాధన చేయసాగాడు. తన వృత్తి ద్వారా అతడు రోజుకు రెండు రూపాయలను సంపాదించేవాడు. వాటిలో రూపాయిన్నర తన కుటుంబమునకు ఖర్చు చేసేవాడు. మిగిలిన అర్ధరూపాయిని దుఃఖితుల, అనాథల, అసహాయుల, దీనుల, ఆకలిగొన్న ప్రాణుల సేవకై వినియోగించేవాడు.

ఈ విధంగా అతడు సేవిస్తుండగా మూడు సంవత్సరాలు గడిచాయి. కాని భగవత్ప్రాప్తి జరిగే సూచన ఏదీ కనిపించక అతడు ఒకరోజు మళ్ళీ ఆ మహాత్ముని దగ్గరికి వచ్చి అడుగసాగినాడు - 'స్వామీ! నేను రోజూ రెండు రూపాయలు సంపాదిస్తాను. ఒక్కటిన్నర రూపాయలతో నా పోషణను చూసుకొని అర్ధరూపాయను దుఃఖితుల సేవలో వినియోగిస్తాను. కానీ ఇంతవరకు భగవంతుని దర్శనానికి ముందు కనబడే లక్షణాలేవీ నాలో కనబడడం లేదు. మీరే చెప్పండి. అతిత్వరగా భగవంతుడిని దర్శించడానికి నేనేం చెయ్యాలి.' అనగా మహాత్ముడన్నాడు. 'నీవు చేస్తున్నది సరిగానే చేస్తున్నావు. ఇంకా ఉత్సాహముతో, ఉల్లాసముతో, విశ్వాసపూర్వకంగా విశేషంగా దరిద్రులను, దీనులను, దుఃఖితులను, రోగులను నారాయణ స్వరూపులుగా సేవిస్తూవుండు.' దీనితో ఆ కటిక దరిద్రుడు, చాలామంచిది అని తన ఇంటికి మరలి, ఆ మహాత్ముని ఆజ్ఞ ప్రకారము మళ్ళీ విశేషంగా ఉత్సాహంతో దుఃఖితులను సేవించసాగాడు.

అదే నగరంలో ఒక కట్టెలమ్ముకునేవాడు గుడిసె కట్టుకొని ఉండేవాడు. అతడు అడవినుండి ఎండినకర్రలను తెచ్చి వాటిని అమ్మి చాలా కష్టంగా పొట్టపోసుకునేవాడు. అతడికి అడవిలో దగ్గరలో కట్టెలు దొరకలేదు. దానితో అతడు అడవిలో కొంచెం దూరం వెళ్లాడు. దానివల్ల అతడికి తిరిగి రావడంలో ఆలస్యమైంది. అతడు కట్టెలు తీసుకొని తిరిగివచ్చే సరికి పగలు పన్నెండైంది. ఎండాకాంలోని తీవ్రమైన ఎండవేడిమి వల్ల అతడు చెమటతో తడిసిపోయాడు. అప్పటికి అతడు నగరం నుండి ఒకమైలు దూరంలో వున్నాడు. అపుడతని

ప్రాణం పోయినంత పనైంది. కళ్ళు బైర్లు గమ్మి అతడు క్రింద పడిపోయాడు. కట్టెలమోపు అతని తలపై నుండి ఒకవైపుకు పడిపోయింది. అతడు స్పృహ కోల్పోయాడు.

అదే సమయంలో ఆ కటిక దరిద్రుడు తన ఊరినుండి కొన్ని తినుపదార్థములు, త్రాగునీరు తీసుకొని నగరంవైపు బయలుదేరాడు. మార్గంలో ఆ కట్టెలమ్ముకునేవాడు స్పృహ తప్పి పడిపోయి వుండగా చూసి ఆ దరిద్రునికి జాలి కలిగింది. అతని దగ్గర తిను పదార్థములు, నీళ్ళు వున్నాయి. వెంటనే నీళ్ళు తీసుకొని ముఖంపై చల్లాడు. తరువాత బట్ట అంచుతో అతని ముఖానికి గాలి విసరసాగినాడు. దానితో స్పృహలోకి వచ్చిన ఆ కట్టెలమ్ముకొనే వాడు కళ్ళు విప్పాడు. అతడు స్పృహలోకి వచ్చి లేచి కూర్చోగానే, ఆ దరిద్రుడు అతడిని చెట్టు నీడలోకి తీసుకొని వెళ్ళి తన దగ్గరున్న తిను పదార్థములను తినిపించి నీరు త్రాగించాడు. దీనితో అతడి మనసులో చాలా తృప్తి కలిగింది. తన దుఃఖపూరితమైన కథనంతా ఆ కటిక దరిద్రునకు వినిపించాడు. తరువాత అతడు ఆ దరిద్రునితో కృతజ్ఞతగా, వినయపూరితమైన మాటలతో స్తుతించసాగాడు. దీనితో దరిద్రుడన్నాడు - 'సోదరా! భగవంతుడే స్తుతికి తగినవాడు. ఇక్కడ వున్నదంతా భగవంతునిదే. నేను కేవలం నిమిత్తమాత్రుణ్ణి. నీవు భగవంతుణ్ణి మాత్రమే స్తుతించాలి. నేను చేయగలిన సేవ ఏదైనా ఉంటే చెప్పు నీ సేవలో సిద్ధంగా ఉన్నాను.' అనగా కట్టెలవాడన్నాడు - 'ఇప్పుడు నాకు శక్తి వచ్చింది. నాకు ఏ కష్టమూ లేదు. ఈకట్టెల మోపును తలపై కెత్తండి నేను నగరానికి వెళ్తాను' అప్పుడా కటిక దరిద్రుడు కట్టెలమోపును పైకెత్తగానే, కట్టెలవాడు నగరంవైపు బయలుదేరాడు.

దాని తరువాత ఆ కటిక దరిద్రుడు తన చర్మాన్ని, నీటి ముంతను తీసుకొని నగరం వైపు బయలుదేరబోగా భగవంతుడు ప్రత్యక్షమయ్యాడు. భగవంతుణ్ణి చూసి అతనికి ఒళ్ళు గగుర్పొడిచింది. కంట నీరు ఉబికింది. ఆ సమయంలో అతని ఆనందానికి, శాంతికి హద్దులేదు. అపుడు భగవంతుడన్నాడు. 'దరిద్రుల, దుఃఖితుల రూపంలోని నాకు నీవు చేసిన సేవతో నేను సంతోషించాను. ఇపుడు నీవు ఇష్టమైన వరాన్ని కోరుకో!'

అనగా ఆ దరిద్రుడు అన్నాడు. 'ప్రభూ! ఈ రోజు నీ దర్శనాన్నిచ్చి నీవు నన్ను ధన్యుడిని చేశావు. ఇక ఇంతకుమించి నాకు కావలసినదేమి? దేనిని నేను కోరను?' భగవంతుడు మళ్ళీ మళ్ళీ పట్టుదల చూపడంతో అన్నాడు. 'మీయందు నాకు అనన్య విశుద్ధమైన ప్రేమ ఎప్పుడూ ఉండుగాక!' అని ఆ కటిక దరిద్రుడు కోరగానే భగవంతుడు 'తథాస్తు' అని మాయమయినాడు.

భగవంతుని దర్శనానందంలో మునిగి ఆ దరిద్రుడు మహాత్ముని దగ్గరికి వచ్చాడు. అతని కాళ్ళకు సాష్టాంగ నమస్కారము చేసి జరిగినదంతా మొదటినుండి చివరి వరకు వినిపించాడు. ఆ మహాత్ముడన్నాడు - 'దరిద్రుడు, దుఃఖితుడు, పేదవాడు అయిన ఆ కట్టెలవానికి నీవు ఆహార మివ్వడం, నీళ్ళు త్రాగించడం అనే సేవాకార్యములు చాలా శ్రేష్ఠమైనది. ఇంతకుముందు నీవు చేసిన సేవాకార్యము లన్నింటిలో ఇది చాలా గొప్పది.' అనగా ఆ మహాత్ముని మాటలు విని అతడు ఆనందంలో మునిగిపోయి ఆ మహాత్మునికి నమస్కరించి తన ఇంటికి వెళ్ళిపోయాడు.

ఈకథ నుండి మనం తెలుసుకోవాల్సిందేమంటే దుఃఖితుల, అనాథల సేవ చేస్తూ వుండగా భగవంతుడు ప్రాప్తించడంలో ఆలస్యమైనా తల్లడిల్లకూడదు, పైగా అన్నింటిలో భగవంతుడున్నాడన్న భావనతో నిష్కామభావంలో, పరమశ్రద్ధ, విశ్వాసము, వినయము మరియు ప్రేమ తత్పరతలతో సేవ చేస్తూనే ఉండాలి. సేవలో శ్రద్ధ -ప్రేమపూర్వక భగవద్భావము మరియు నిష్కామ భావము ఉండడం వల్ల ఆ సేవ ఉత్తమస్థాయికి చెందిన సాధన అవుతుంది. కాబట్టి ఈ సాధన చేస్తూవుండడం వల్ల ఇలాంటి భావనలు క్రమంగా పెరగాలి. పైన చెప్పిన భావాలు (భగవద్భావము మరియు నిష్కామభావము) రెండూ తోడు వుంటే చెప్పేదేముంది! ఏ ఒక్క భావన వున్ననూ భగవత్ప్రాప్తి కలుగవచ్చు. కాబట్టి మనమందరమూ అన్ని ప్రాణులలో భగవంతుడు, పరబ్రహ్మ వ్యాపించినాడని తెలిసి అందరినీ సేవించడంలో, పరులకు ఉపకారం చేయడంలో తత్పరులమై ఉండాలి.

**నారాయణ! నారాయణ!! నారాయణ!!!**



# 7. త్యాగప్రభావము

రాజా చక్వవేణుని కథను నేనెక్కడా ఏ పుస్తకంలోనూ చూడలేదు. పరంపర ద్వారా లోక ప్రసిద్ధిమైనదిది. ఈ చక్వవేణుని చరిత్ర వాస్తవికమో, కల్పనో నాకు తెలియదు.ఏమైనా మనకు ఈ కథ ద్వారా నేర్చుకోవాల్సింది చాలావుంది.

ఒకప్పుడు చక్వవేణుడనే రాజు వుండేవాడు. అతడు చాలా సద్గుణ, సదాచార సంపన్నుడు. ధర్మాత్ముడు, సత్యవాది. అనితర సహాయుడు. స్థిరబుద్ధి. త్యాగి, విరాగి, జ్ఞాని, భక్తుడు, తేజస్వి, తపస్వి, మహానుభావుడు. అతడు రాజ్యద్రవ్యము దూషితమని భావించి ఆ ద్రవ్యాన్ని తనకుగానీ తనవారికి గానీ ఉపయోగించేవాడు కాదు. ప్రజల నుండి తీసుకోబడే 'పన్ను' అంతటినీ ప్రజల సేవలో వినియోగించేవాడు. అతడు అభిమానము, మమకారము లేకుండా త్రికరణశుద్ధిగా రాజ్యకార్యాన్ని చూసుకునేవాడు. ప్రజలపై అతని ప్రభావం చాలా ఉండేది. అతనిరాజ్యం రామరాజ్యం. అందరూ అన్ని విధాలుగా సుఖంగా ఉన్నారు.

ఆ రాజు తన కోసం విడిగా వ్యవసాయం చేసేవాడు. ఎద్దుస్థానంలో వుండి రాణి స్వయముగా నాగలిని లాగేది. మహారాజు విత్తనాలను జల్లేవాడు. అతడు తన పొలంలో పండిన ధాన్యంతో వారు తమను తాము పోషించుకునేవారు. వారు చెరకు, ప్రత్తి, ధాన్యము, ఫలాలు, ఆకుకూరలు పండించేవారు. తన పొలములో పండిన ప్రత్తితోనే వస్త్రం తయారు చేసుకొని ధరించేవారు. తన పొలములో పండిన చెరకుతోనే బెల్లం తయారుచేసుకొని తినేవారు. పండిన ధాన్యము, కూరలు, పళ్ళు వీటినే భోజనంలో ఉపయోగించారు. అతని భార్యకు ఏ నగలూ వుండేవి కావు, ఎందుకంటే రాజ్యానికి చెందిన ద్రవ్యముతోనయితే నగలు చేయించలేరు, తమ పొలంలో పండిన పంట ధాన్యంతో నిజాయితీతో అన్నపానాల వ్యవస్థ నడుస్తుండేది. వ్యవసాయమేకాక ఆ రాజు రాజ్యకార్యమునకై సమయం కేటాయించాల్సి వచ్చేది. అతని జీవితం ఒక మామూలు రైతు జీవితం

లాగా ఉండేది. ఆరుగంటలు నిద్రను విడిచి మిగిలిన సమయమంతా భగవత్ భక్తి, పరోపకారము, రాజ్యకార్యము, వ్యవసాయానికి చెందిన పనులలో గడిచేది. అతనికి ప్రాణులన్నింటి పట్ల సమత, దయ, ప్రేమ అను భావనలు ఒకే రీతిగా ఉండేవి. అన్ని ప్రాణులూ పరమాత్మ స్వరూపమని భావించి నిష్కామభావంతో అందరినీ, అన్నిటినీ సేవించేవాడు. తనకు చెందిన పనులు ఏ రాజపురుషుని చేతనో, సేవకుని చేతనో చేయించుకునేవాడు కాదు. తానే చేసుకునేవాడు. అతడేపని చేసినా ఆసక్తి, అహంకారము లేక చాలా ఉత్సాహముతో, ధైర్యముతో చేసేవాడు.

ఒకనాడు చక్వేణమహారాజు వున్న దేశంలో ఒక పెద్ద జాతర జరిగింది. నగరానికి ఇతర ప్రాంతాలకు చెందిన ప్రజలనేకులు చాలా ఎక్కువ సంఖ్యలో చేరారు. రాజును, రాణిని చూడడానికైతే ప్రజలు ఎలాగూ వస్తూ ఉండేవారు. కాని జాతర కారణంగా స్త్రీ పురుషుల గుంపు కొంచెం ఎక్కువగానే ఉంది. రాజుదగ్గరికి ఎక్కువమంది పురుషులు వచ్చేవారు అలాగే రాణి దగ్గరికి ఎక్కువమంది స్త్రీలు వచ్చేవారు. ఒకరోజు చాలా విలువైన ధగధగలాడే వస్త్రాలు ధరించి అనేకంగా దాసీజనం చుట్టూ వుండి నడువగా చాలామంది ధనిక వ్యాపారుల స్త్రీలు రాణిని దర్శించుకోవడానికి ఆమె వద్దకు వచ్చారు. వాళ్ళన్నారు - 'రాణిగారూ! మీ వస్త్రాల్లాంటివి మా కూలిపనివాళ్ళు కూడా కట్టుకోరు. మీరు మా దాసీజనాన్ని చూడండి. ఎలాంటి వస్త్రాలను కట్టుకుంటారో, నగలను పెట్టుకుంటారో, మీ వస్త్రాలు, నగలు మాకంటే కూడా మించినవై వుండాలి. మాకు ఈ దాసీ జనమెలాగో, మేము మీకు అలాంటి దాసీజనంలాంటి వాళ్ళము. మీనాథుడు మహారాజు. మీరు ఆయనతో కొంచెము సూచన ఇచ్చినా వారు మీకోసం మాకంటే కూడా అధికమైన వస్త్రాలను, నగలను సమకూర్చగలరు. మీరు మా యజమానురాలు. కాబట్టే మిమ్మల్ని ఈ వేషంలో చూస్తున్న మాకు బాధ కలుగుతుంది. ఇలాంటి బట్టలను అడుక్కునే బిచ్చగత్తెలు కూడా కట్టుకోవాలనుకోరు. ఒకమహారాజు యొక్క మహారాణికి తగిన వస్త్రాభూషణాలతో మిమ్మల్ని మేము చూడాలనుకుంటున్నాము' ఇలా అని వాళ్ళు వెళ్ళిపోయారు. రాణి మనస్సుపైన వారి మాటల ప్రభావం చాలా పడిపోయింది.

రాత్రి మహారాజు వచ్చినప్పుడు రాణి జరిగిన సంఘటనంతా ఆయనకు వినిపించి పగలు ఆ ధనికవ్యాపారుల స్త్రీలు అన్నందంతా తెలియజేసింది. తరువాత తాను ధరించడానికి విలువైన వస్త్రాలను, నగలను తెప్పించమని కోరింది. మహారాజు ఇలా బదులిచ్చాడు. 'ఎలా తెప్పిస్తాను? వినియోగించడం కాదు కదా, రాజ్యం యొక్క ధనాన్ని కనీసం తాకను గూడా లేను. దానితో బుద్ధి నశిస్తుంది. రాణి కూడా చాలా ఉన్నతస్థాయికి చెందిన సంస్కారం ఉన్న పవిత్రమైన స్త్రీ, గానీ విలువైన వస్త్రాలను, నగలను ధరించిన ధనిక స్త్రీల ప్రభావం ఆమెపై చాలా పడిపోయింది. అందుకే ఆమె అన్నది - 'ఎలాంటిదైనా గానీ, మీరు మహారాజులు, నేను మీ పట్టపురాణిని కదా! ఒక పట్టపురాణికి తగిన విలువైన బట్టలను, నగలను తెప్పించే కృప మీరు చేయాల్సిందే.' భార్య కోరికతో ప్రేరితుడైన రాజు ఆలోచించాడు. 'రాణి ఎంత పట్టుబట్టిన నేను రాజ్యం యొక్క ద్రవ్యాన్ని ఏ పరిస్థితిలో కూడా వాడుకోలేను. కానీ నేను మహారాజును. దుష్టులు, దురాచారులు, బలవంతులు అయిన రాజుల నుండి 'పన్ను' తీసుకోగలను' అని ఆలోచించి అతడు ఇతర రాజ్యాల పనులను చూసుకునే మంత్రిని పిలిపించాడు. అతనితో ఇలా అన్నాడు. 'మంత్రీ! మీరు రాక్షసరాజు రావణుని దగ్గరికి వెళ్ళి నేను రాజు చక్వవేణుని దగ్గరి నుండి వస్తున్నాను. పన్ను రూపంలో మీ నుండి మణుగు బంగారాన్ని తీసుకురమ్మని మహారాజు నన్ను పంపాడు అని చెప్పండి.'

మహారాజు ఆజ్ఞతో మంత్రి కొంతమందిని తీసుకొని రథాన్నెక్కి సముద్రతీరానికి చేరుకొని నావలో సముద్రాలన్ని దాటి లకంలోకి ప్రవేశించాడు. రావణుని సభలోకి వెళ్ళి చాలా వినయంతో, సభ్యతతో చక్వవేణరాజు సందేశాన్ని వినిపించాడు. సందేశాన్ని వినగానే రావణుడు నవ్వి సభ్యులతో అన్నాడు. 'చూడు! ఇలాంటి మూర్ఖమైన రాజులు ఈ లోకంలో ఇంకా ఉన్నారు. ఋషులు, దేవతలు, రాక్షసులు మొదలైన అందరి నుండి పన్ను తీసుకునే నాలాంటి బలవంతుడు సర్వతంత్రుడు, స్వతంత్రుడు అయిన మహాసమ్రాట్టు నుండి పన్ను తీసుకోవాలని ఆశ పడుతున్నాడు.' అతడు చక్వవేణరాజు దూతను బంధించాలనుకున్నాడు కానీ సభ్యులందరి ప్రార్థనతో అతణ్ణి విడిచిపెట్టాడు. ఆ దూత రావణుని సభ నుంచి లేచి సముద్ర తీరానికి తిరిగి వెళ్ళాడు.

తరువాత రాత్రిసమయంలో మండోదరి దగ్గరికి అంతఃపురంలోకి వెళ్ళినపుడు రావణుడు నవ్వి వినోదంగా మండోదరికి చెప్పాడు. 'భారతదేశంలో చక్రవేణుడనే ఒక రాజున్నాడు. ఈ రోజు ఆ రాజుకు చెందిన ఒక దూత ఒకడు సభలోకి వచ్చి మణుగు బంగారాన్ని పన్నురూపంలో ఇవ్వమని నాకు చెప్పాడు. దానితో నాకు చాలా నవ్వు వచ్చింది. చూడు, లోకంలో ఇలాంటి మూర్ఖులు ఇంకా బ్రతికేవున్నారు. అందరి నుండి పన్ను తీసుకునే నా నుండే పన్ను తీసుకోవాలని ఆశపడుతున్నాడు. నేను నిజానికి అతని దూతను బంధించాలనుకున్నాను, కానీ సభ్యుల ప్రార్థనలతో అతణ్ణి విడిచిపెట్టాను.' ఇది విన్న మండోదరి బాధపడి అన్నది - 'స్వామీ! మీరు చాలా తప్పు చేశారు. చక్రవేణుడు నాకు తెలుసు, అతడు ధర్మము తెలిసినవాడు, సత్యవాది. అతని చక్రము నడుస్తూనే వుంటుంది. అతని ఆజ్ఞను పాలించనివానికి అనిష్టం కలుగుతుంది. అతని దూతను సంతోషపెట్టి మీరు పంపించాల్సింది. అతని జాడను తెలుసుకొని ఇప్పటికైనా అతణ్ణి సంతోషపరచండి. లేకపోతే మనకెంత అనిష్టము కలుగుతుందో తెలియదు.' అనడంతో రావణుడన్నాడు - 'నీవు చాలా పిరికిదానివి. మామూలు మానవ ప్రజల గురించి ఇంత భయపడుతున్నావు. నేను దీని నేమాత్రమూ లెక్కించను.' అనగా రాణి అన్నది -'రేపు ప్రొద్దున నేను మీకు చక్రవేణుని ప్రభావాన్ని చూపగలను.' తెల్లవారగానే రాజుతో కలిసి మండోదరి భవనం పైభాగానికి వెళ్ళింది. అక్కడి నుండే ఆమె ప్రతిరోజు పావురాలకు దానిమ్మ గింజలను వేస్తుంటుంది. దానిమ్మ గింజలను తినడానికి అక్కడికి చాలా పావురాలు వస్తుంటాయి. మండోదరి గింజలను వేస్తూ పక్షులతో అన్నది. 'ప్రభువు రావణుని ఒట్టు ఇది. జాగ్రత్త. గింజలను తినవద్దు.' కానీ పావురాలు గింజలను తింటూనే వున్నాయి. తరువాత రాణి రాజుతో అన్నది - 'చూడండి! మీ ఎదుట మీ పేరు చెపుతున్నా ఇవన్నీ గింజలను తింటూనే వున్నాయి.' అనగా రావణుడన్నాడు - 'మూర్ఖురాలా! ఈ అమాయకమైన పక్షులకేమి తెలుస్తుంది?' అది విని మండోదరి అన్నది - 'ఇప్పుడు మీరు రాజు చక్రవేణుని ప్రభావాన్ని చూడండి,' అని పక్షులతో అన్నది - 'జాగ్రత్త, చక్రవేణుని ఒట్టు. గింజలనెవ్వరూ తినరాదు.' ఇంతమాత్రం వినడంతోటే పక్షులన్నీ ఒక్కసారిగా గింజలను తినడం మానివేశాయి. వాటిలో ఒక

పావుర చెవిటిది. దానికి కొద్దిగా కూడా వినబడదు. అందుకే అది గింజలను తీసుకుంది. తీసుకోగానే దాని గొంతు తెగి కిందపడింది. రాణి రావణునితో అన్నది - 'చూడండి! రాజు చక్వవేణుని ఒట్టుతో అన్నీ గింజలను తినడం మానినాయి. కాని ఈ చెవిటి పావురం విననందువల్ల గింజలను తినబోయింది దానితో చక్వవేణుని చక్రంతో దాని తల తెగి కిందపడింది.' తరువాత రాణి పక్షులతో అన్నది - 'ఇప్పుడు నేను చక్వవేణుని ఒట్టును తీసివేస్తున్నాను. ఇపుడు గింజలను తినండి.' వెంటనే పక్షులన్నీ గింజలను తినసాగాయి. రాణి మళ్ళీ అన్నది. 'మీ ఎదుట నిలుచున్న రావణుని ఒట్టు. ఎవరూ గింజలను తినరాదు.' కాని రావణుడు ఎదుట వున్నప్పటికీ ఏదీ లెక్కించలేదు. అన్నీ గింజలు తినసాగాయి. మండోదరి రావణునితో అన్నది. 'చూడండి! ఈ పక్షులపైన మీ ప్రభావమేమీ లేదు. కానీ చక్వవేణుని ప్రభావాన్ని గూర్చి ఆలోచించండి. ఆయన ఎదుట లేకున్నా ఆయన ప్రభావమెంత ఉన్నది!' రావణుడన్నాడు, 'దీంట్లో నీ మాయ ఏదో వున్నదనిపిస్తుంది. లేకపోతే అమాయక పక్షులకేం తెలుస్తుంది?' ఇలా రావణుడు మండోదరి మాటలను లెక్కపెట్టకుండా రాజసభలోకి వెళ్ళాడు.

ఇక్కడ రాజు చక్వవేణుని మంత్రి సముద్రతీరాన ఒక నకిలీ లంకను సృష్టించాడు. కాటుకలాగ నల్లని మట్టిని సముద్రజలంతో కలిపి బురదలాగా చేసి ఒడ్డునవున్న ప్రదేశాన్ని సమతలంగా చేసి దానిపై ఆ నల్లని మట్టితో ఒక చిన్న నకిలీ లంక తయారుచేశాడు. చిన్న మటిముద్దలతో లంక యొక్క కోటను, ద్వారాలను మొదలైన వాటిని నిర్మించాడు. కోట నాలుగువైపులా బురుజులు నిర్మించి లోపల లంక యొక్క రాజధానిని, నగరంలోని ప్రసిద్ధమైన పెద్దపెద్ద భవనాలవలె చిన్నచిన్న మట్టిముద్దలతో నిర్మించాడు. తరువాత మళ్ళీ రావణుని సభకు వెళ్లాడు. అతణ్ణి చూచి రావణుడు విస్మితుడైనాడు, అతనితో అన్నాడు- "ఏమిటి? నీవు ఇక్కడకు మళ్ళీ ఎందుకు వచ్చావు?" అపుడా మంత్రి అన్నాడు. 'నేను మీకు ఒక ఆశ్చర్యాన్ని చూపాలనుకుంటున్నాను. మీరు నాతో సముద్రతీరానికి పదండి!' అనగా రావణుడు కూడా ఆ ఆశ్చర్యాన్ని చూద్దామని ఉత్సాహంతో కొంతమంది సభ్యులను వెంట తీసుకొని మంత్రి నకిలీ లంకను తయారుచేసిన సముద్రతీరానికి వెళ్ళాడు.

ఆ మంత్రి రావణునితో అన్నాడు - 'చూడండి! ఇది పూర్తిగా మీ

లంకకు ప్రతిరూపముగా వుంది కదా!' అనగా రావణుడు అతని అద్భుతమైన నైపుణ్యాన్ని చూసి అన్నాడు - బాగుంది. ఇది చూపించడానికే నీవు నన్ను ఇక్కడికి తెచ్చావా?' అనగా మంత్రి అన్నాడు - 'లేదు, లేదు, ఈ లంకతో నేను మీకొక అద్భుతాన్ని చూపిస్తాను. చూడండి, లంక యొక్క తూర్పువైపు కోట, ద్వారము, బురుజు మరియు తోరణము అన్నీ స్పష్టంగా వున్నవి వున్నట్లుగా కనిపిస్తున్నాయి కదా?' అనగా రావణుడన్నాడు 'కనిపిస్తున్నాయి!' అనడంతో మంత్రి అన్నాడు -'నేను తయారు చేసిన ఈ లంక పూర్వద్వారాన్ని నేను రాజు చక్కవేణుని ఒట్టును తీసుకొని పడగొడతాను దీనితో మీలంక పూర్వద్వారం యొక్క తోరణము కూలిపోవడాన్ని మీరుచూస్తారు.' ఇంతమాత్రమే చెప్పి మంత్రి 'రాజు చక్కవేణుని ఆన' అని చెప్పి తాను తయారుచేసిన లంక యొక్క పూర్వద్వారం తోరణమును పడగొట్టాడు. అవి పడడంతోటే రావణుని నిజమైన లంకయొక్క పూర్వద్వారము, తోరణము పడిపోతూ కనిపించాయి. ఇది చూసి రావణునికి చాలా ఆశ్చర్యం కలిగింది. దీని తరువాత దూత అన్నాడు - 'ఇప్పుడు నేను తయారుచేసిన లంకయొక్క తూర్పు దగ్గరున్న నాలుగు బురుజులు కూడా కూలిపోతాయి. చూడండి. అని ఆ మంత్రి రాజు చక్కవేణుని ఆనను తీసుకొని నకిలీ లంక యొక్క బురుజులను కూల్చివేశాడు. దానితోబాటు రావణుని లంక తూర్పువైపునున్న బురుజులు పిండిగా మారి కూలిపోయాయి. ఇది చూసిన రావణునికే చాలా ఆశ్చర్యమైంది అతనికి మండోదరి చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది.

తరువాత రాజు చక్కవేణుని మంత్రి అన్నాడు - 'రాజా! మీరు మణుగు బంగారాన్ని పన్ను రూపంలో ఇవ్వకపోతే కూడా రాజు చక్కవేణునికి మీతో యుద్ధం చేయవలసిన అవసరం వుండదు. రాజు చక్కవేణుని ప్రభావముయొక్క చక్రము నడుస్తుంది. నేనొక్కడినే మీ లంకను నశింపజేయడానికి సరిపోతాను. ఇపుడే రాజు చక్కవేణుని ఆనను తీసుకొని మీ లంకను క్షణంలోనే చిటికెతో నశింపజేయగలను. మీరు ఈ లంకను రక్షించగలిగితే రక్షించండి. మీరు లంకను రక్షించాల్సివుంటే 'పన్ను' రూపంలో మణుగు బంగారాన్ని ఇవ్వండి. ఇది తప్ప వేరే మార్గము లేదు.' అనగా రావణుడు ఆలోచించాడు - 'నేను చూస్తూ వుండగా క్షణంలో తూర్పువైపు

ద్వారం యొక్క తోరణాలు, నాలుగు బురుజులు నేలకూలాయి. అవి లోహముతో నిర్మింపబడ్డాయి. చాలా గట్టివి కూడా. ఈవిధంగా లంకనంతా నాశనం చేయడం ఇతనికి ఎడమచేతి ఆట,' అని ఆలోచించి రావణుడు మణుగు బంగారాన్ని పన్ను రూపంలో ఇవ్వడానికి అంగీకరించాడు.

మంత్రి, రావణుని వద్ద బంగారాన్నంత తీసుకొని రాజు చక్రవేణుని దగ్గరికి తిరిగి వచ్చాడు. అతడు రాజు-రాణిల దగ్గరికి వెళ్ళి వారి దగ్గర మణుగు బంగారాన్ని వుంచి అన్నాడు. 'మీ ఆజ్ఞపై రావణుని దగ్గరి నుండి పన్నురూపంలో మణుగు బంగారాన్ని తెచ్చాను,' అనగా రాజు 'నీవీ బంగారాన్ని ఎలా పొందావు?' అని అడుగగా మంత్రి జరిగిన దానినంతా రాజుకు వినిపించాడు.

ఈ సంఘటనను విని రాణికి చాలా ఆశ్చర్యం కలిగింది. ఆమెపైన దీని ప్రభావం చాలా పడింది. ఆమె రాజు నడిగింది. 'ఇది ఏమిటి?' అని, అపుడు రాజు చెప్పాడు. 'మనము ఎవరిమీదా ఆధారపడక పరిశ్రమ పూర్వకంగా వ్యవసాయాన్ని చేసి మనల్ని పోషించుకుంటూ వైరాగ్యముతో, త్యాగబుద్ధితో జీవితాన్ని గడుపుతున్నాము. అంతేగాక నిష్కామభావనతో ప్రజల ధనాన్ని ప్రజల సేవలోనే వినియోగిస్తాము. మన వ్యక్తిగతమైన పనులకు ప్రజల ధనాన్ని ముట్టనైనా ముట్టము. దాని ప్రభావమే ఇది.

దీనిని విని రాణి మనస్సు మారింది. ఆమె అన్నది - 'స్వామీ! నేను బహు మూల్యమైన బట్టలను, నగలను ధరించను. ఇంతవరకు ఎలా నియమంతో వుంటూ వచ్చానో అలాగే వుంటాను. కొంత కూడా మారను. ధనిక స్త్రీల చెడు ప్రబోధం వల్ల నా బుద్ధి, త్యాగము, వైరాగ్యము, ధర్మము వీనినుండి చలించినది, కాని ఇపుడు వాళ్ళ మాటల ప్రభావం నాపైన ఏమీ లేదు. నేను మీతో ఈ విషయములో పట్టుదలను చూపిన దానికై క్షమించమని ప్రార్థిస్తున్నాను. నా తప్పును క్షమించి మీరు ఈ బంగారాన్ని తిరిగి ఇచ్చివేయండి?

రాజు ఆమె మాటను మన్నించి మంత్రితో అన్నాడు - 'మంత్రీ! ఈమె పైన చెడు సహవాసము ప్రభావమేది వున్నదో, అది ఈశ్వరుని కృప చేత దూరమైనది ఇక నీవు ఎక్కడి నుండి ఈ ధనాన్ని తెచ్చావో

అక్కడికే తిరిగి ఇవ్వుము.' రాజుగారి ఆజ్ఞ కావడంతోటే మంత్రి ఆ బంగారాన్ని తీసుకొని లంకాపతి రావణుని వద్దకు మళ్ళీ వెళ్ళాడు. సభలోకి వెళ్ళి అన్నాడు - 'మహారాజు చక్వవేణుడు మీ ఈ బంగారాన్ని తిరిగి ఇచ్చాడు. ఆయన భార్యకు విలువైన వస్త్రాలను, నగలను ధరించాలనే కోరిక దైవానుగ్రహం వల్ల ఇపుడు లేదు. కాబట్టి ఆమెకు ఈ బంగారం అవసరం లేదు.'

ఈ మాటను విని రావణుని హృదయంపై చక్వవేణుని త్యాగము యొక్క ప్రభావము చాలాపడింది. అతడు ఆ బంగారాన్ని వుంచుకొని చాలా ఆదరంగా సత్కారంతో మంత్రికి వీడ్కోలు పలికాడు. మంత్రి తిరిగివచ్చి రాజు-రాణికి బంగారమును తిరిగి ఇచ్చిన స్థితినంతా వినిపించాడు. దూత యొక్క మాటను విని రాజు-రాణి చాలా ప్రసన్నులైనారు. రాజు చక్వవేణుని ప్రభావము యక్ష,రాక్షస, దేవ, మనుష్య, ఋషి, ముని, పశుపక్షులు మొదలైన అన్నిటిపైనా వుంది.

స్త్రీ పురుషులు నిష్కామ భావనతో తమ తమ వర్ణాశ్రమ ధర్మాన్ననుసరించి న్యాయపూర్వకంగా సత్యపూర్వకంగా తమ జీవితాన్ని గడపాలి. ఇతరులపై ఆధారపడి తమ జీవితాన్ని నడపడం కూడా తమకు నిందాస్పదమవుతుంది. అసత్యము, మోసము, అవిశ్వాసము ద్వారా సంపాదించిన ధనంతో మనకు పంచభక్ష్య పరమాన్నాలు లభించినా అవి మనకు విషంతో సమానమే. కానీ న్యాయంగా సంపాదించిన పవిత్ర ద్రవ్యముతో ఒక పిడికెడు అన్నము తినడానికి లభిస్తే అది మనకు అమృతంతో సమానము. మనకు అనారోగ్యము, ఆపదలు కలిగినపుడు తప్ప - పసివాళ్ళు, భార్యాపిల్లలు, శిష్యులు మొదలైన వాళ్ళు ఉన్నప్పటికీ తమ శరీరం ద్వారా ఎంత వీలయితే అంత స్వయంగా పని చేసుకొనే అభ్యాసం చేసుకోవాలి. దానివల్ల మనం ఇతరులపై ఆధారపడి బ్రతకాల్సిన అవసరం ఉండదు. శ్రేయస్సును కోరుకునే వారికి ఇతరులను ఆశ్రయించి బ్రతకడం సిగ్గుచేటు.

దీనితోబాటే మనము సమయాన్ని అమూల్యమని తెలుసుకొని ఒక్కక్షణాన్ని కూడా వ్యర్థంగా గడపరాదు. ప్రతి సమయంలో భగవంతుడిని స్మరించుకుంటూ పరోపకారము, శరీరనిర్వాహణ మొదలైన పనులను

చేసుకోవాలి. ఆరుగంటలు నిద్రించే సమయం తప్ప మిగిలిన సమయాన్ని వ్యర్థంగా గడపడం కానీ, దురుపయోగం చేయడం కానీ చేయరాదు. మానవ జీవితం చాలా అమూల్యమైనది. కాబట్టి క్షణము కూడా పని చేయకుండా వుండరాదు. మన బుద్ధితో దేన్ని గొప్పదని భావిస్తామో దానినే చేస్తూ వుండాలి.

కొద్దిసేపటి చెడుసహవాసమైనా మనుష్యునికి చాలా హానిని కలిగిస్తుంది. దీనిని మనసులో వుంచుకొని నాస్తికులు, నీచులు, పొగరుబోతులు, భోగులు, పాపులు, పనిలేనివాళ్ళు, బద్ధకస్తులు, ఇతరులపై ఆధారపడిబ్రతికేవాళ్లు, (పరాన్నభక్కులు) విలాసవంతమైన బట్టలను, నగలను ధరించేవాళ్ళు, ఆటపాటలు, మాదకద్రవ్యాలు సేవించేవారు, చెడువ్యసనాలు గల స్త్రీ పురుషులెవరితోనూ పొరపాటున కూడా క్షణమైనా కలిసి వుండరాదు. తొందర, ఆలస్యము, నిద్ర, భయము, ఉద్వేగము, రాగము, ద్వేషము, అహంకారము, దుర్వ్యసనాలు మొదలైన వాటి నుండి దూరంగా వుంటూ వివేకము, వైరాగ్యము, త్యాగము, సంయమనముతో నిష్కామభావనతో భజన, ధ్యానము, సత్సంగము, స్వాధ్యాయము వీనితో జీవితాన్ని గడపాలి. అలాగే ప్రాణులన్నీ పరమాత్మ యొక్క స్వరూపమని తెలిసి అహంకారము లేకుండా నిష్కామ భావనతో త్రికరణశుద్ధిగా అందరినీ సేవించాలి. అందరిపట్లా సమాన భావనతో దయ మరియు ప్రేమభావము కలిగివుండాలి.

హరయేనమః



# 8. జీవన సాఫల్యానికి సాటిలేని శిక్షణ

ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥

(గీతా 13/8)

ఈశ్లోకం యొక్క భావం హృదయంగమము కావడానికి క్రింద ఇవ్వబడిన కథ ఉపకరిస్తుంది. అవంతీపురం రాజు చాలా ధర్మాత్ముడు. అతని పేరు విష్వక్సేనుడు. అతని రాజ్యం ధనధాన్యాలతో తులతూగేది. ప్రజలు అతని అదుపులో వుండేవారు. అతనికి ఆ నగరంలో ఏ పదార్థం యొక్క లోటూ లేదు కాని అతనికి సంతానము లేదు. అతడు సద్గుణ సంపన్నుడు, సదాచారుడు. ఒక విరక్తుడైన మహాపురుషుని దగ్గరికి వెళుతూండేవాడు. అతడిని సేవిస్తుండేవాడు.

ఒకరోజు మహాత్ముడడిగాడు - 'నీవు చాలా రోజులనుండి మా దగ్గరికి వస్తూనే వున్నావు. నీవు రావడంలోని ఉద్దేశమేమిటి?'

విష్వక్షేనుడన్నాడు - 'నాకిక్కడ దేనికీ లోటులేదు. మీ దయతో నా రాజ్యము ధనధాన్యములతో తులతూగుతూ వున్నది. కానీ నాకు సంతానము లేదు. ఇది ఒకటే లోటు. మీరు దయచేసి నాకు ఉత్తమపుత్రుడు కలిగే ఉపాయాన్ని చెప్పండి.'

మహాత్ముడన్నాడు - 'నీవు పుత్రుడు లభించడానికి విష్ణుయాగాన్ని చెయ్యి. అది సముచితమైనదని భగవంతుడు భావిస్తే నీకు పుత్రుడినివ్వవచ్చు.'

రాజు విష్వక్సేనుడు ఆ మహాత్ముడు చెప్పినట్లు శాస్త్రప్రకారం విష్ణుయాగాన్ని అనుష్ఠించాడు. ఆ యజ్ఞశేషమైన ప్రసాదాన్ని గ్రహించడం యొక్క ఫలరూపంగా అతని భార్య గర్భం నిలిచింది. పది నెలల తరువాత అతనికి ఒక కుమారుడు కలిగాడు. ఎవరో యోగభ్రష్టునిలాగా ఆ పిల్లవాడు సుందరంగా, బుద్ధిమంతుడై వున్నాడు. అతడు పుట్టడంతో రాజు శాస్త్రోక్త విధి ప్రకారం ఆ పిల్లవాని జాతకర్మ మొదలైన సంస్కారాలు చేయించి జనార్దనుడని నామకరణం చేశాడు. కొద్దిగా పెద్దయిన తరువాత రాజు

అధ్యాపకుడిని ఇంటికే పిలిపించి బాలునికి విద్యాభ్యాసం చేయించాడు. కుశాగ్రబుద్ధి కావడంతో జనార్దనుడు త్వరగానే విద్యలో ఆరితేరాడు. అతడు వివిధ భాషలలో మంచి విద్వాంసుడైనాడు. అందరు పిల్లలతో ప్రేమగా ఉండేవాడు. ఎవరితో కూడా ఎప్పుడూ పోట్లాడడం, తిట్టడం చేసేవాడు కాదు. సహజంగానే సరైన ప్రవర్తన సద్గుణసదాచారాలు గలవాడు, మేధావి.

ఒకరోజు విష్వక్సేన మహారాజు మహాత్ముని దగ్గరికి వెళుతూ కుమారుడిని కూడా వెంటతీసికొని వెళ్ళాడు. రాజు మహాత్ముని పాదాలకు నమస్కరించాడు ఇది చూసి బాలుడు కూడా అలాగే నమస్కరించాడు.

రాజు అన్నాడు - 'మహాత్మా! మీరు చెప్పిన అనుష్ఠానం యొక్క ఫలరూపంగా మీ దయతో ఈ కుమారుడు నాకు జన్మించాడు. కాబట్టి ఇతనికి ఏదైనా శిక్షణ నిచ్చి, దయచూపండి.'

మహాత్ముడన్నాడు -

**ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ।**
**జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥**

(గీతా - 13/8)

'ఈ లోకంలోని మరియు పరలోకం లోని భోగాలన్నిటి పట్ల ఆసక్తి లేకపోవడం, అహంకారము లేకపోవడం, జన్మము, మృత్యువు, ముసలితనము, రోగము మొదలైన వాటిలోని దుఃఖాన్ని, దోషాలను మాటిమాటికీ ఆలోచించడం - ఇది జ్ఞానము.'

తరువాత పిల్లవాని హావభావాలను చూసి మహాత్ముడన్నాడు - 'ఈ బాలుడు యోగభ్రష్టుడైనవాడని తెలుస్తుంది. కాబట్టి ముందు ముందు ఇతడు ఉత్తమశ్రేణికి చెందిన విరక్తుడైన మహాపురుషుడు కాగలడు.'

ఇది విని రాజు తన ఇంటికి తిరిగి వెళ్ళి భార్యను, మంత్రులను, సేవకులను ఏకాంతంగా పిలిచి విషయాన్నంతా వారికి చెప్పి వివరించాడు. అదేమంటే ఈ బాలుణ్ణి భోగ విలాసవంతమైన వాతావరణములోనే ఎల్లప్పుడూ వుంచాలి. భక్తి, జ్ఞానము, వైరాగ్యము ఇలాంటి విషయాలనుండి ఇతడిని ఎప్పుడూ దూరంగా వుంచాలి. ఏ సన్నివేశమూ ఇతనికి భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను కలిగించకుండా జాగ్రత్త వహించాలి.

రాజుగారి ఆజ్ఞ ప్రకారం ఏర్పాట్లన్నీ జరిగాయి, కానీ జనార్దనుని మనస్సులో పూర్వజన్మ యొక్క బలమైన సంస్కారాలు ఎలా ఆపబడతాయి? అంతేగాక, అతని మనస్సుపై ఆ మహాత్ముని శిక్షణ యొక్క ప్రభావం కూడా చాలానే వున్నది. జనార్దనుడు తన సమానమైన వయస్సుగల పిల్లలతో ఆడుకునేవాడు. కానీ అతని మనస్సు ఆటపాటలలో, సౌకర్యాలలో, విశ్రాంతిలో నిలిచేది కాదు. పర్యటన కోసం ఎప్పుడైనా బయటికి వెళితే రాజు యొక్క ఆంతరంగిక మంత్రి విద్యాసాగరుడు వెంట వుండేవాడు.

జనార్దనునికి పద్దెనిమిదేళ్ళు రాగా అతనికి వివాహము చేశారు. అతడు తన భార్యతో వుండసాగాడు. కొన్ని రోజుల తరువాత అతని భార్య గర్భవతి అయింది. సంతానము కలిగే సమయం రాగా ఆమెకు చాలా కష్టమైనది. ఆ రాత్రి పిల్లవాడు కలిగాడు. అపుడు జనార్దనుడు తన భార్యతోనే వున్నాడు. ప్రసవంలోని కష్టాన్ని చూసి అతడు చాలా భయపడ్డాడు. మావి మరియు మైలతో పిల్లవాడు పుట్టడాన్ని చూసి అతనికి చాలా సంతాపం కలిగింది దానితో సహజంగానే వైరాగ్యభావం కలిగింది.

తెల్లవారగానే మంత్రి వచ్చాడు. ఇంటివాళ్ళందరూ ఒక్కచోట చేరారు. రాత్రి సమయంలో జనార్దనుని భార్య పురటి నొప్పులను అనుభవించడం ఆవేదనను విని అందరికీ చింత కలిగింది. వారు వైద్యుడిని పిలిపించి చూపించారు. వైద్యులన్నారు. 'పిల్లవాని ప్రసవం కష్టం బాగానే కలిగింది కానీ చింతించాల్సినదేమీ లేదు.'

అపుడు మంత్రి విద్యాసాగరుని జనార్దను డడిగాడు - 'మంత్రీ! పుడుతూనే పిల్లవాడు చాలా ఏడ్చాడు, ఆరాటపడ్డాడు! ఇలా ఎందుకు జరిగింది?'

విద్యాసాగరుడన్నాడు - 'పిల్లవాడు గర్భంలో వున్నప్పుడు ద్వారాలన్నీ మూసికొని వుంటాయి. అతడు బయటికి వచ్చినపుడు అతనికి ఒక్కమారుగా కష్టం కలుగుతుంది.'

జనార్దనుడు - ఈ మావి, మైల ఎందుకుంటాయి?

విద్యాసాగరుడు - ఇవన్నీ గర్భంలో శిశువుతో వుంటాయి.

జనార్దనుడు - అలా అయితే గర్భంలో చాలా కష్టముండవచ్చు.

విద్యాసాగరుడు - ఇందులో సందేహమేముంది? గర్భకష్టము చాలా భయాన్నే కలిగిస్తుంది.

జనార్దనుడు - గర్భంలో ఈ కష్టము ఎందుకు వుంటుంది?

విద్యాసాగరుడు - పూర్వజన్మ యొక్క పాపాల వల్ల.

జనార్దనుడు - పూర్వజన్మ అంటే ఏమిటి?

విద్యాసాగరుడు - ఇంతకు ముందు జీవుడు ఏ శరీరంలో వున్నాడో అది అతని పూర్వజన్మ. ఆ శరీరంలో ఈ జీవుడు ఏదో పాపము చేశాడు. అందువల్ల ఇతనికి ఇంత కష్టము కలిగింది.

జనార్దనుడు - పాపమని దేన్ని అంటారు?

విద్యాసాగరుడు - అబద్ధాన్ని చెప్పడం, కపటాన్ని ఆచరించడం, దొంగిలించడం, ఇతర స్త్రీలను కోరడం, మద్యమాంసాలను సేవించడం, ఇతరులకు కష్టాన్ని కలిగించడం మొదలైనవి, ఏవేవి శాస్త్రాల్లో నిషేధించబడ్డాయో అవన్నీ పాపాలు.

జనార్దనుడు - శాస్త్రమేమిటి?

విద్యాసాగరుడు - శ్రుతులు, స్మృతులు ఇతిహాసాలు, పురాణాలు మొదలైన ధర్మశాస్త్ర గ్రంథాలు.

జనార్దనుడు - మీ ఇంట్లో ఇవి ఉన్నాయా?

విద్యాసాగరుడు - లేవు.

జనార్దనుడు - అయితే తెప్పించండి, నేను చదువుతాను. మంత్రి విద్యాసాగరుడు మౌనంగా వున్నాడు. అతడు దీనికి సమాధానమేమీ చెప్పలేదు. మంత్రి చెప్పిన మాటలను విని జనార్దనుని మనస్సు ఉదాసీనంగా మారింది. అతడు గర్భము మరియు జన్మ వీని దుఃఖాన్ని తెలుసుకొని తనలోనే ఆలోచించుకోసాగాడు. 'ఆహా! ఎంత కష్టం!' అతని వికసించిన ముఖము ముడుచుకుపోయింది. అతని ముఖంపై విషాదరేఖ స్పష్టంగా కనబడసాగింది. ఇది చూసి రాజు మంత్రితో అన్నాడు. 'మంత్రి వర్యా! రాజకుమారుడెందుకు ఉదాసీనంగా ఉన్నాడు?

విద్యాసాగరుడన్నాడు - అతనికి పిల్లవాడు పుట్టాడు. దానితో ఇతని మనస్సులో కొంత సంతాపమేర్పడింది.'

రాజన్నాడు - 'తనకి పిల్లవాడు పుడితే ఉత్సాహము, ప్రసన్నత కలగాలి,' అని జనార్దనునిలోని ఈ ఉదాసీనతకు కారణ మేమిటి? - అని రాజు అడిగాడు.

జనార్దనుడు - ఇలాగే వుంది కారణమని ఏమీలేదు.

విష్వక్సేన మహారాజు పిలిచి జనార్దనుడి మనస్సు ప్రసన్నంగా వుండడానికి షికారుకి తీసుకువెళ్ళమని, వన విహారానికి తీసుకువెళ్ళమని ఆజ్ఞాపించాడు.

విద్యాసాగరుడలాగే చేశాడు. పెద్ద గుర్రాలు పూన్చబడ్డాయి. ఒక అందమైన గుర్రపుబగ్గీలో కూర్చోబెట్టి వనవిహారానికి, షికారుకి తీసుకెళ్ళాడు. నగరం నుండి బయటకు రాగానే జనార్దనుని దృష్టి ఒక దయనీయమైన కుష్టురోగిపై పడింది. ఆ రోగి చేతి వేళ్ళు క్రిందపడ్డాయి, కాళ్ళు, చెవులు, ముక్కు, కళ్లు కొంకర్లు తిరిగివున్నాయి. అతడు కుంటుతూ నడుస్తూ వున్నాడు.

జనార్దనుడడిగాడు - మంత్రిగారూ! ఇది ఏమిటి?

విద్యాసాగరుడు - ఇతడు కుష్ఠురోగి.

జనార్దనుడు - ఇతడికి ఈ పరిస్థితి ఎలా కలిగింది?

విద్యాసాగరుడు - పూర్వజన్మ యొక్క పెద్దపాపాల వల్ల.

జనార్దనుడు - నాకు కూడా ఇలాంటి స్థితి కలుగవచ్చా?

విద్యాసాగరుడు - పరమాత్ముని కృప వల్ల అలా జరుగకూడదు. మీరు పవిత్రాత్ములు.

జనార్దనుడు - కలుగనైతే కలుగవచ్చు కదా!

విద్యాసాగరుడు - 'నాయనా! చాలా పాపి అయిన వారికే ఈ రోగం కలుగుతుంది. మీ విషయంలో ఏమిటి ఏమని చెప్పను? కానీ మీ విషయంలో కూడా పూర్వపు పాపమేదైనా ఘోరమైనది వుంటే మీకు కూడా ఈ దశ కలుగవచ్చు.'

జనార్దనుడు - 'ఈ ఘోరమైన పాపాల యొక్క, వాటి ఫలితాల యొక్క వర్ణన ఏ గ్రంథాలలో వుందో ఆ గ్రంథాలను నాకోసం తెప్పించండి. నేను ఇంతకు ముందు కూడా మీకు చెప్పాను. ఇపుడు త్వరగా తెప్పించండి.'

విద్యాసాగరుడు - 'మీ తండ్రిగారి ఆజ్ఞ వుంటే తెప్పించవచ్చు'. ఇంతలోనే ఎదుట వేరొక మనిషి కనిపించాడు. అతని శరీరంపై ముడుతలు పడివున్నాయి. వెంట్రుకలు తెల్లబడినాయి. అవయవాలు శుష్కించాయి. కళ్ళకాంతి మందగించినది. వీపు వంగింది, కర్ర సహాయంతో అతడు కుంటుతూ నడుస్తున్నాడు. అతని కాళ్ళు, చేతులు వణుకుతున్నాయి.

మాటిమాటికీ దగ్గు, కఫం రావడంతో అతడు చాలా కష్టపడుతూ అలసిపోతున్నాడు. అతడిని చూసి రాజకుమారుడడిగాడు. 'ఇతడెవరు?'

విద్యాసాగరుడు - ఇతడు తొంభై సంవత్సరాల ముదుసలి.

జనార్దనుడు - నేను తొంభై సంవత్సరాల వాణ్ణయినపుడు నాకూ ఇదే స్థితి కలుగుతుందా?

విద్యాసాగరుడు - నాయనా! నీవు చిరకాలము క్షేమంగా ఉండాలి! మనుష్యుడు వృద్ధుడైతే అందరికీ ఇదే దశ కలుగుతుంది.

ఇది విని రాజకుమారుడైన జనార్దనునికి చాలా విచారం కలిగింది. 'నాదశ కూడా ఇలాగే కావచ్చు' అన్న విచారం కలిగింది. ఈ విధంగా వ్యాధి, ముసలితనముతో పీడింపబడిన వారిని చూసి రాజకుమారుని మనస్సులో శరీరము, ఆరోగ్యము, సౌందర్యము పైన ఆసక్తిపోయింది.

తరువాత తిరిగి వెళ్తున్నపుడు మార్గమధ్యలో స్మశానభూమి తగిలింది. అక్కడ ఒక శవము తగులబుడుతుంది. వేరొకవైపు ఆ శవానికి చెందినవాళ్ళు స్మశానం వైపు వస్తూంటే మరికొందరు శవం వెంట ఏడుస్తూ వెళ్తున్నారు.

రాజకుమారుడడిగాడు - ఇదేమి స్థలము?

విద్యాసాగరుడు - ఇది స్మశానభూమి.

జనార్దనుడు - ఇక్కడ ఏమి జరుగుతుంది?

విద్యాసాగరుడు - మనిషి మరణిస్తే అతడిని ఇక్కడికి తెచ్చి కాలుస్తారు.

జనార్దనుడు - ఈ గుంపు ఎవరిది? గుంపు వెనకగా వచ్చేవాళ్ళు ఏడుస్తున్నారెందుకు?

విద్యాసాగరుడు - చూస్తుంటే ఎవరో యువకుడు మరణించినట్లు తెలుస్తూ ఉంది. అతని కుటుంబంలోని వాళ్ళు అతడి శవాన్ని స్మశానభూమికి తెస్తున్నారు. ఈ ఏడ్చేవాళ్ళు అతని తండ్రి - బంధువులు మొదలైనవారు.

జనార్దనుడు - మృత్యువు అంటే ఏమిటి? శవము అని దేన్నంటారు?

విద్యాసాగరుడు - ఈ శరీరం నుండి మనస్సు, ఇంద్రియాలు, ప్రాణము వెళ్ళిపోవడం 'మృత్యువు,' మనిషి మరణించినపుడు అతని శరీరాన్ని శవమంటారు. అతని ఇంటివాళ్ళు ఆ శవాన్ని ఇక్కడకు తెచ్చి కాల్చివేస్తారు. ఆ తర్వాత ఇంటికి వెళ్ళిపోతారు.

జనార్దనుడు - మరి వీళ్ళు ఏడుస్తున్నారెందుకు?

విద్యాసాగరుడు - చనిపోయినవానికి వీరందరి పట్ల చాలా ప్రేమ వుండేది. ఇపుడా వ్యక్తి శాశ్వతంగా వీరి నుండి దూరమైనాడు, ఈ ఎడబాటు వల్ల దుఃఖంతో ఇంటివాళ్ళు ఏడుస్తున్నారు.

జనార్దనుడు - మనం కూడా ఒకరోజు మరణిస్తామా?

విద్యాసాగరుడు - నాయనా! అలా అనకు! పరమాత్మ నీకు నూరు సంవత్సరాల ఆయుష్షు నివ్వాలి.

జనార్దనుడు - ఎంతైనాగానీ, ఒకనాటికి మాత్రము మరణించాల్సిందే కదా!

విద్యాసాగరుడు - నాయనా! అందరూ ఒకనాటికి మరణించాల్సిందే. పుట్టినవాడు ఏదో ఒకనాటికి తప్పక మరణించాలి.

మంత్రి మాటను విని రాజకుమారుడు ఆలోచనలో మునిగిపోయాడు. తరువాత ముందుకు వెళ్ళగా వారికి మార్గమధ్యలో ఒక విరక్తుడైన మహాపురుషుడు కనిపించాడు. రాజకుమారుడడిగాడు - 'ఇతనెవరు?'

విద్యాసాగరుడు - ఇతనొక జీవన్ముక్తుడైన వైరాగ్యము కల మహాపురుషుడు.

జనార్దనుడు - జీవన్ముక్తుడు, విరక్తుడు అయిన మహాపురుషుడని ఎవరినంటారు?

విద్యాసాగరుడు - భగవదారాధన, ధ్యానములతో తన ఆత్మను కల్యాణ వైభవముగా మార్చుకున్నవాడిని అలా అంటారు.

జనార్దనుడు - కల్యాణమంటే ఏమిటి?

విద్యాసాగరుడు - వివేకము - వైరాగ్యము మరియు భజన- ధ్యానము మొదలైన సాధనల ద్వారా కలిగే పరమశాంతిని, పరమానందాన్ని కల్యాణము 'శుభము' అంటారు. ఇట్టి కళ్యాణమును పొందిన మహాత్ముమే జీవన్ముక్తుడని అంటారు.

అతడు శాశ్వతంగా పరమాత్మను పొందుతాడు. మళ్ళీ అతడు జన్మమృత్యురూపంలో అపారమైన సంసారంలోకి రాడు. వాస్తవానికి సంసారంలో ఇలాంటి పురుషుని జన్మ పొందడమే ధన్యము.

జనార్దనుడు - ఏమిటి మంత్రివర్యా! నేను కూడా ఇలా కాగలనా?

విద్యాసాగరుడు - ఎందుకు కాదు? మనస్ఫూర్తిగా కోరుకునేవాడు తప్పక కాగలడు. కానీ మీరింకా యువకులు. మీరు సంసారంలోని సుఖవిలాసాలను, భోగాలను ఇంకా అనుభవించాలి. ఇదంతా శేషజీవితం మాట.

జనార్దనుడు - అలాగైతే మనిషి యౌవనంలో మరణించడా? ఇంతకుముందు మార్గమధ్యలో ఊరేగింపు వెళుతుంటే మీరు ఆ యువకుడు మరణించాడని చెప్పారా లేదా?

విద్యాసాగరుడు - మరణించవచ్చు. పూర్వజన్మలోని ఘోరమైన పాపమేదైనా వుంటే మనిషి యౌవనంలో మరణిస్తాడు.

జనార్దనుడు - అయితే నేను యౌవనంలో మరణించనని ఏదైనా హామీ వుందా?

విద్యాసాగరుడు - హామీ ఎవ్వరికీ వుండదు. మరణించడంలో ముఖ్య కారణము ప్రారబ్ధమే.

ఇది విని రాజకుమారుడు జనార్దనుడు చాలా దుఃఖంతో మనస్సులోనే నాకు శుభమెలా జరుగుతుంది అని ఆలోచించసాగాడు.

అతడు ఇంటికి తిరిగి వచ్చాడు. అతని ముఖంపై ముందుకంటే ఎక్కువ నిర్లిప్తత వుండడాన్ని చూసి విష్వక్సేన మహారాజు చింతించసాగాడు. మూడవ రోజు రాజకుమారుడదే స్థితిలో వుండడాన్ని చూసి రాజు మంత్రి నడిగాడు. 'మంత్రీ! నేను చూస్తూవున్నాను. రాజకుమారుని ముఖము రోజురోజుకీ వాడిపోతోంది. ఆనందం మచ్చుకి కూడా కనబడడంలేదు. ఇలా ఎందుకు జరిగింది?'

విద్యాసాగరుడన్నాడు - 'రాజా! ఏమి చెప్పాలి? మూడు రోజులు గడిచాయి రాజకుమారునికి పుత్రుడు కలిగి, అప్పటినుండి ఇదే అవస్థ.'

రాజు మంత్రిని మళ్ళీ అడిగాడు. ఇతణ్ణి పూర్తిగా సుఖ విలాసాలలో, విషయభోగంలోకి తీసుకురండి. ఇతని తోటి స్నేహితులకు జెప్పి వారితో ఇతడిని ఆటపాటలకు, వినోదగృహాలకు తీసుకువెళ్ళండి. తినడానికి రకరకాల స్వాదిష్ఠ పదార్థాలను మృష్టాన్నాన్ని ఇవ్వండి. సుందరమైనవి, మనోహరమైనవి

అయిన దృశ్యాలను చూపండి. అత్తరు, పన్నీరు మొదలైన సుగంధాలను చిలుకరించండి. ఆటపాటలను ఏర్పరచి ఇతని మనస్సును ఉల్లాస పరచండి.

రాజుగారి ఆజ్ఞ ప్రకారం మంత్రి రంగమంతా సిద్ధం చేశాడు కానీ అదంతా నిష్ఫలమైంది. రాజకుమారుని కిప్పుడు సంసారంలోని వస్తువేదీ సుఖాన్నిచ్చేదిగా అనిపించడంలేదు. అన్నీ అతనికి క్షణభంగురాలుగా, దుఃఖాన్నిచ్చేవిగా అత్యంత చేదుగా అనిపించసాగాయి. భోగముల పట్ల జుగుప్స కలగడంతో అవి త్యాజ్యాలని తెలుస్తుంది. భోగాలను సేవించడం ఒక పెద్ద విషవలయమని రాజకుమారునికి తోచసాగింది. అత్తరు, పన్నీరు, మొదలైనవి అతనికి మూత్రంతో సమానంగా అనిపించేవి. పూలపాన్పు, పూలు మరియు దండలు, గంధము అతనికి దగ్గు రోగమున్న వాని తడిసిన బట్టలలాగా రుచించడం లేదు. వీణ, సితార్ లను వాయించడం అతని చెవులకు కోలాహలంగా తోచేది. నాటకము, ఆటపాటలు, వినోదాలు అతనికి అనవసరమైన వ్యాసంగంగా కనిపించేది. మంచి పళ్ళు, వెన్న, మీగడ, మృష్టాన్నము మొదలైన పదార్థాలు జ్వరంతో వున్న రోగికి రుచిని కలిగించనట్లు ఆ రాజకుమారునికీ చెడు పదార్థాలుగా తోచేవి. శరీరంపై, విషయాలపై అతనికి తీవ్రమైన వైరాగ్యమేర్పడడంవల్ల సంసారం యొక్క పదార్థమేదీ అతనికి సుఖమిచ్చేదిగా అనిపించేది కాదు. అతడికి ఎక్కడా ఏ విషయంలో కూడా ఏ విధమైన ఆకర్షణా లేకుండా పోయింది.

అతని ముఖమండలం పైన విషాదాన్ని, చింతతో కూడిన ఆ ఔదాసీన్యాన్ని చూసి రాజు అడిగాడు. నీకు కుమారుడు జన్మించి మూడు రోజులయింది. నీ ముఖం వాడిపోయి చింతతో కూడి వుండడాన్ని చూస్తున్నాను నేను. దీనికి కారణమేమిటి? సంతోషము, ఉత్సాహము వుండాల్సిన సందర్భంలో నీకీ చింత ఎక్కడిది?

జనార్దనుడన్నాడు - నాన్నగారూ! మీరు అన్నది పూర్తిగా సత్యము. పిల్లవాడు పుట్టినపుడు అతని శరీరంపై మైల, మావి వుండగా పట్టడాన్ని చూసి, దుఃఖంతో కూడిన అతని రోదనమును విని నాకు చాలా దుఃఖము, ఆశ్చర్యమూ కలిగాయి. నేను చాలా పట్టుదలతో మంత్రిగారి నడిగాను. దానికి మంత్రిగారు, ' ఈ కష్టమితనికి పూర్వజన్మలోని పాపాలవల్ల

కలిగింది' అని చెప్పారు. దానిని విని నాకు 'నేను కూడా అసత్యము, కపటము, దొంగతనము, వ్యభిచారము, హింస, మద్యమాంస సేవనము మొదలైన పాపాలను చేస్తే నాకు ఇలాగే గర్భవాసము, జన్మ యొక్క దుఃఖాన్ని అనుభవించడం తప్పవు.

విష్వక్సేన మహారాజన్నాడు - 'ఇదంతా అబద్ధము కపోలకల్పన. చనిపోయిన తరువాత జన్మ వుండనే వుండదు.' తరువాత రాజు కోపించి మంత్రితో అన్నాడు. 'ఏమయ్యా! నీవు ఈ విషయాన్నంతా ఇతనికి తెలిపావా?'

మంత్రి వణుకుతూ అన్నాడు - 'ప్రభూ! నేనే చెప్పాను.' జనార్దనుడు చెప్పసాగాడు. మీ ఆజ్ఞపై మంత్రి నన్ను షికారు కని నగరం బయటికి తీసుకువెళ్ళాడు. అపుడు మధ్యలో నేనొక కుష్ఠురోగిని చూశాను. అతడిని చూసి నేను ఉదాసీనుడనయ్యాను. ఇతడి నడిగితే తెలిసింది. పూర్వము చేసిన మహాపాపాల వల్ల ఈ రోగము వస్తుందని. రాజు అన్నాడు - "పాపమనేదేదీ లేదు. ఇది ఈ మంత్రిలాంటి మూర్ఖుల కల్పన. నీవు చూసిన కుష్ఠురోగి అలాగే జన్మించాడు. అలాగే వుంటాడు. వానితో నీకు పోలిక ఏమిటి? నీవెలా వున్నావో అలా జన్మించావు. అలాగే వుంటావు.'

తరువాత రాజు కోపగించి మంత్రితో అన్నాడు - 'నీకు బుద్ధి లేదా! నీవీ పిల్లవానికి ఎందుకివన్నీ చెప్పావు?' అపుడు మంత్రి అన్నాడు - 'ప్రభూ! ఈ విషయంలో నేను ఎలా తెసుకున్నానో అలాగే చెప్పాను.'

జనార్దనుడు మళ్ళీ అన్నాడు - 'తరువాత మార్గమధ్యలో నాకు బాగా దుఃఖించిన ముదుసలివాడు కనిపించాడు. నేనంతకు ముందు అలాంటివాణ్ణి చూడలేదు. తెలుసుకోవడానికి మంత్రిగారినడిగితే ఆయన వాడు ముసలివాడని చెప్పారు. మనిషి చాలా ఎక్కువ ఆయుష్షుగల వాడైతే అందరికీ ఇదే దశ కలుగుతుంది. దాన్ని చూసిన నాకు నేను కూడా ఒకప్పటికి ఈ దశను పొందుతా ననిపించింది.'

రాజు అన్నాడు - 'లేదు, ఎప్పటికీ అలా కాదు. వృద్ధుడుగా వుండే వాళ్ళు వృద్ధులుగానే వుంటారు. యువకులు యువకులుగానే వుంటారు,' అని కోపంతో మంత్రితో అన్నాడు. 'ఈ శిక్షణనంతా ఇవ్వడానికే నీవిక్కడ నియోగింపబడ్డావా?'

మంత్రి అన్నాడు - రాజకుమారు డడిగితే నేను, నాకు తెలిసిన విధంగా చెప్పాను.

రాజు అన్నాడు - నీ జ్ఞానము పనికిరానిది. ఇవన్నీ పిల్లవానికి చెప్పవలసినవేనా.

తరువాత జనార్దనుడన్నాడు - 'నాన్నగారూ! ఆ తరువాత మేము తిరిగి వస్తూవుంటే ఆ సమయంలో నగరం నుండి ఒక ఊరేగింపు రావడం చూశాను. నలుగురు వ్యక్తులు ఏదో వస్తువును భుజాలమీద మోస్తున్నారు, వారివెంట కొందరు ఏడుస్తూ వస్తున్నారు. వారందరూ చనిపోయిన ఒక వ్యక్తిని కాల్చడం చూశాను. చాలామంది అతనికి నలువైపులా నిల్చున్నారు. దీనిని చూసి నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. మంత్రిగారిని అడిగితే ఆయన చెప్పారు. ఎవరో యువకుడు మరణించాడు. అతని ఇంటివాళ్ళు ఆ యువకుడి శవాన్ని స్మశానభూమికి తెస్తున్నారు. ఈ ఏడ్చేవాళ్ళంతా ఆ యువకుడి తండ్రి మొదలైన బంధువులని తెలుస్తుంది. వీళ్ళు ఈ యువకుడి వియోగాన్ని భరించలేక దుఃఖంతో ఏడుస్తున్నారు,' అని. ఈ దృశ్యాన్ని చూసినప్పటి నుండీ నాకు మృత్యువును గూర్చిన ఆలోచన మొదలైంది. నాకు మృత్యువు కలిగితే నాకు కూడా ఇదే దశ కలుగుతుందనుకుంటాను.'

విష్వక్సేనరాజు అన్నాడు - ఈ మూర్ఖపు మంత్రి మాటలను నీవు పట్టించుకోవద్దు. యువకుడికి మృత్యువు ఎప్పటికీ కలుగదు. ఇతడు చెప్పిందంతా అజ్ఞానంతో కూడిన మాటలు.

తరువాత అతడు మంత్రితో అన్నాడు. 'నా పిల్లవానికి ఇలాంటివి చెప్పడం నీకు తగినదేనా? నీవు నిజంగా నాకు చాలా ద్రోహం చేశావు.'

విద్యాసాగరుడు చేతులు జోడించి ఇలా అన్నాడు - 'ప్రభూ! నన్ను అడిగితే ఆ సమయంలో తెలిసిన దానిని మాత్రమే చెప్పాను.'

జనార్దనుడు - ఆ తరువాత మేము తిరిగి నగరంలోకి ప్రవేశించాము. అపుడు ఒక కాషాయవస్త్రధారి కలిశాడు. నేనడిగితే మంత్రిగారు చెప్పారు. ఇతడు జీవన్ముక్తుడు, విరక్తుడు అయిన మహాత్ముడు, భజన-ధ్యానము, సత్సంగము - స్వాధ్యాయము

వలన ఇతడు ఆత్మశ్రేయస్సును పొందినాడు, దానితో ఇతడు శాశ్వతమైన పరమశాంతిని, పరమానందమును పొందుచున్నాడు. చివరకు ఇతడు భగవంతుని పరమపదానికి వెళతాడు. తిరిగి ఈ దుఃఖరూప సంసారంలోకి ఎప్పుడూ రాడు. అక్కడే పరమశాంతి పరమానందములో మునగి వుంటాడు. ఇతని జన్మయే ధన్యము' అని. అప్పటినుండి నా మనస్సులో 'ఎప్పటికైనా నేను ఇలా కాగలనా' అని అనేక పర్యాయాలు అనిపిస్తుంది. అడిగితే తెలిసిందేమంటే ఈ విషయాలన్నీ శ్రుతి -స్మృతి, పురాణ, ఇతిహాసాలలో వ్రాయబడివున్నాయని. కాబట్టి నేను ఈ పుస్తకాలను తెప్పించమని మంత్రిగారికి చెప్పాను. కానీ ఆయన 'మీ తండ్రిగారి ఆజ్ఞ తీసుకునే తెప్పించగలను' అని బదులిచ్చారు. కాబట్టి నాన్నగారూ! ఇప్పుడీ పుస్తకాలను నాకు త్వరగా తెప్పించండి.'

విష్వక్సేనుడన్నాడు - 'నాయనా! ఇవన్నీ నీవు చూడతగ్గ పుస్తకాలు కావు.

రాజు మళ్ళీ మంత్రితో అన్నాడు - ఈ పుస్తకాల పేర్లు చెప్పి నీవు ఈ పిల్లవాని మెదడు పాడుచేశావనిపిస్తుంది. నీకు శిక్షణ నిచ్చిన దాని ఫలితంగా, నా ఈ సుకుమార సుందరుడైన రాకుమారుడు ఈ లేత వయస్సులో సంసార విషయభోగాల పట్ల విరక్తుడై రాత్రింబగళ్ళు వైరాగ్యము - జ్ఞానము చింతనలో మునిగిపోతున్నాడు. నేను ఏ ఉద్దేశంతో నిన్ను నియోగించానో దానికి విపరీతమైన పరిణామము కలిగింది. నీవిక్కడ వుండడానికి యోగ్యుడివి కావు, ఇష్టమున్న చోటికి నీవు వెళ్ళవచ్చు.'

విద్యాసాగరుడు చేతులు జోడించి అన్నాడు - 'ప్రభూ! నా అజ్ఞానం వల్లనే ఇదంతా జరిగింది. రాజ కుమారుడేదేది అడిగాడో దానికి నేను నాకు తెలిసిన దాని ప్రకారం యథార్థాన్ని చెప్పాను. ఈ విషయంలో మీరు నన్ను క్షమించండి'.

విష్వక్సేనుడన్నాడు - 'నీ జ్ఞానమే నాశనం కానీ! నేను నివసించే ఇంటినే నువ్వు నాశనం చేశావు. ఇక నీ అవసరం నాకు లేదు' అని చెప్పి విద్యాసాగరుణ్ణి మంత్రి పదవి నుండి తొలగించాడు.

జనార్ధనుడన్నాడు - 'నాన్నగారూ! మీరిలా ఎందుకు చేస్తున్నారు? దీంట్లో మంత్రిగారి తప్పు ఏదీ లేదు. వీరు చెప్పినదంతా సరిగ్గా చెప్పారు అది కూడా నేను అడిగితేనే చెప్పారు. నాలో జ్ఞానము, వైరాగ్యము, భక్తి కొంత మాత్రము కూడా లేవు. అవును, నేను జ్ఞానము, వైరాగ్యము, భక్తులను పొందినట్లయితే నేనుకూడా జీవన్ముక్తుడైన మహాత్ముడినై ఆత్మోద్ధరణ చేసుకుంటాను. సంసారము నుండి విరక్తులై పరమాత్మ యొక్క భజన, ధ్యానము, సత్సంగము, స్వాధ్యాయము వీనిలో తమ జీవితాన్ని గడుపుతూ తమ శ్రేయస్సును పొందినవారి జీవితం ధన్యం. ఈ శరీరముపై, సంసారముపై విరక్తిని పొంది నా మనస్సు శాశ్వతంగా నిరంతరంగా పరమాత్మపై నిలిచివుండేట్లు ఆశీర్వదించండి.'

దానితోరాజు విష్వక్సేనుడు రాజకుమారుడైన జనార్ధనునికి ఎన్నో చెప్పి నచ్చజెప్పినా జనార్ధనునికి అవి ఒక్కటి కూడా రుచించలేదు. ఎందుకంటే అసలే అతడు యోగభ్రష్టుడైనవాడు. మంత్రి యొక్క శిక్షణ అతని హృదయంలో చాలా పనిచేసింది. వైరాగ్యము యొక్క మత్తులో రాజకుమారుడు మునిగిపోయాడు. అహంకారము, మమకారము లేకుండా అతడు సంసారము నుండి విరమించి పరమాత్మ శోధనలో జీవితాన్ని గడపసాగాడు.

కొన్నిరోజుల తరువాత అతనికి వైరాగ్యము, ఉపరతి తీవ్రమైనప్పుడు సహజంగానే రాజ్యం పట్ల ఉదాసీనుడై ఆ మహాత్ముని దగ్గరికి వెళ్ళాడు. అతని దగ్గరినుండే రాజకుమారుడు చిన్నతనంలో ఈ శ్లోకాన్ని విన్నాడు.

**ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।**
**జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥**

(గీత. 13/8)

ఈ శ్లోకము యొక్క భావము రాజకుమారుడైన జనార్ధనునిలో ప్రత్యక్షముగా నిండిపోయింది. భక్తి, జ్ఞాన, వైరాగ్యముల గూర్చి అతడు మహాత్ముడిని ప్రార్థించాడు. అపుడతన్ని ఓదారుస్తూ మహాత్ముడు భక్తి, జ్ఞాన వైరాగ్యములను ఇట్లు తెలియజేశాడు. అతడన్నాడు -

అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥
మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది ॥
అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।

(గీతా. 13/9-11)

అభిప్రాయమేమంటే - భార్య, పిల్లలు, ఇల్లు, శరీరము, డబ్బు మొదలైన పదార్థాలతో మనిషికి విశేషసంబంధ మేర్పడడంతో వాటి పట్లనే అతనికి విశేషమైన ఆసక్తి కలుగుతుంది. ఇంద్రియాలు శబ్దాది విషయాల పట్ల విరక్తిని కలిగివున్నప్పటికీ వీటిలో ఆసక్తి దాగివుంటుంది. కాబట్టి మనిషి ఆసక్తిని అన్ని రకాలుగా తొలగించుకోవాలి. ఇక్కడ 'అనభిష్వంగ' మంటే 'నాది' అనే భావన లేకపోవడం. ఈ భావన వల్లనే మనిషికి భార్య-పిల్లలు మొదలైన వాటితో తీవ్రమైన సంబంధమేర్పడుతుంది. వాటివల్ల అతనికి సుఖదుఃఖాలు, లాభనష్టాలు ఏర్పడడంతో మనిషే సుఖదుఃఖాలు గలవాడుగా అవుతుంటాడు. మమకారం తొలగిపోతే సుఖదుఃఖాలూ తొలగిపోతాయి. కాబట్టి మనిషి ఈ పదార్థాలన్నింటిలో మమకారం తొలగించుకోవాలి.

అనుకూలమైన వ్యక్తి, పని, సంఘటన పదార్థాలు లభించడం ప్రతికూలమైనవి తొలగిపోవడం అందరికీ 'ఇష్టము'. అలాగే అనుకూలమైనది దూరం కావడం, ప్రతికూలమైనది లభించడం 'అనిష్టము.' ఈ 'ఇష్ట-అనిష్ట'ములతో సంబంధము కలిగినపుడు హర్షము, శోకము మొదలైనవి కలుగకపోవడం అనుకూలమైనది లభించినపుడు ప్రతికూలమైనది దూరమైనపుడు మనస్సులో రాగము, కామము, హర్షము మొదలైనవి కలుగకపోవడం, అలాగే ప్రతికూలమైనది లభించి అనుకూలమైనది దూరమైనపుడు కూడా చిత్తంలో ద్వేషము, శోకము, భయము మరియు క్రోధము మొదలైనవి కలుగకపోవడం అంటే ఎప్పుడూ నిర్వికారంగా, ఏకరసంగా సమానంగా వుండడం - దీన్నే ఇష్టానిష్టాలు ప్రాప్తించినపుడు 'సమచిత్తత'తో ఉండడము అంటారు.

భగవంతుడే సర్వశ్రేష్ఠుడు అతడే మన స్వామి, శరణువేడదగినవాడు,

పరమగతి, సర్వాధారము, తల్లి తండ్రి, సోదరుడు, బంధువు, పరమహితాన్ని కలిగించేవాడు, పరమాత్మీయుడు, సర్వస్వము. అతను తప్ప మనకెవరూ లేరు. ఈ భావనతో భగవంతునితో అనన్యసంబంధాన్ని కలిగివుండడమే 'అనన్యయోగము' అంటారు. ఈ విధమైన సంబంధంతో భగవంతుని యందు మాత్రమే నిశ్చలము, పూర్ణము అయిన ప్రేమను కలిగి నిరంతరము భగవంతుని భజన - ధ్యానము మొదలైనవాటిని చేస్తూ వుండడమే 'అనన్యయోగము' దీని ద్వారా భగవంతుని యందు అవ్యభిచార భక్తిని కలిగివుండాలి.

ఈ విధంగా భక్తిని కలిగేవానిలో స్వార్థముగానీ, అభిమానము గానీ లేశమైన వుండవు. అంతేగాక ప్రపంచములోని ఏ పదార్థం పట్లా అతనికి మమకారము వుండదు. సంసారములో అతనికి భగవంతుని సంబంధంతో సంబంధముంటుంది, ఏ ప్రకారమైన స్వతంత్ర సంబంధము వుండదు.

అంతా భగవంతునిదే అని తెలుస్తూ అతడు శ్రద్ధ, ప్రేమ వీనితో నిష్కామ భావనతో నిరంతరము భగవంతుని ధ్యానిస్తూ వుంటాడు. అతడు చేసేదంతా భగవంతుని కోసమే అవుతుంది.

సాధకుడెప్పుడూ ఏకాంత ప్రదేశంలో ఉండాలి. ఏవిధమైన శబ్దము, అలజడి లేనిది, వేరొకడెవడూ లేనిది, వేరొకడికి ఆపదను, క్షోభను కలిగించనిది, ఏ విధమైన దుర్వాసన లేనిది, ముళ్ళూ, చెత్త, చెదారము లేనిది. సుందరమైన ప్రకృతి దృశ్యాలు గలది. నిర్మలము, పవిత్రము అయిన వాతావరణము, నీళ్ళు, గాలి గలది, రోగాలను కలిగించనిది. హింసించే మృగాలు లేదా హింస లేనిది. స్వభావంగానే సాత్త్వికత యొక్క పరమాణువులతో నిండినది అయిన గుడి, తపోభూమి, గంగ మొదలైన నదుల తీరాలు, పవిత్రమైన వనము, పర్వత గుహ మొదలైన నిర్జనమైన పవిత్ర ప్రదేశాలను 'వివిక్తదేశము' లంటారు. జ్ఞానాన్ని పొందడానికి చేసే సాధన కోసం ఇలాంటి ప్రదేశాలలో నివసించడమే వాటిని సేవించడం.

సాధకుడు ఎప్పుడూ కూడా ప్రమత్తులు, విషయాసక్తులు అయిన మనుష్యుల సముదాయంలో ప్రేమను కలిగివుండరాదు. ఇక్కడ 'జనసంసది' అన్నపదం 'ప్రమత్తులు - విషయాసక్తులు' అయిన సాంసారిక జనుల

సమూహాన్ని సూచిస్తుంది. వారిలో ప్రేమను కలిగివుండరాదు అంటే దాని అర్థం వీరి సహవాసము సాధనలో అన్నిరకాల ఆటంకాల్ని కలిగిస్తుందని తెలుసుకొని వారి పట్ల విరక్తిని కలిగివుండడమే. సత్పురుషులు, మహాత్ములు, సాధకులు అయిన వారి సహవాసము మాత్రము సాధనలో ఉపయోగపడుతుంది. కాబట్టి ఇక్కడ 'జనసంసది' అన్న పదము వారి సమూహాన్ని సూచిస్తుందనుకోరాదు.

ఆత్మ నిత్యము, చేతనము, వికారరహితము, నాశరహితము. దానికంటే విడిగా నశించేవి, జడములు, పరిణామము గలవిగా తెలిసే వస్తువులన్నీ అనాత్మ. ఆత్మకు వాటితో ఏ సంబంధమూలేదు. శాస్త్రము లేదా ఆచార్యుని ఉపదేశముతో ఆత్మతత్త్వాన్ని ఇలా స్పష్టంగా తెలుసుకోవడమే 'అధ్యాత్మజ్ఞానము' అలాగే ఆ జ్ఞానాన్ని బుద్ధిలో అదేవిధంగా నిశ్చయించి మనస్సుతో ఆ తత్త్వాన్ని నిత్యము, నిరంతరంగా ధ్యానించడము ఆధ్యాత్మ జ్ఞానంలో నిత్యము నిలచివుండడమ'ని అనబడుతుంది.

'తత్త్వజ్ఞానము' అంటే సచ్చిదానంత ఘనము, పూర్ణబ్రహ్మ, పరమాత్మ. ఎందుకంటే తత్త్వజ్ఞానముతో ఆ పరమాత్మయే పొందబడుతాడు. ఆ సచ్చిదానందఘనుడు, గుణాతీతుడు అయిన పరమాత్మను అంతటా సమభావనతో నిత్యము, నిరంతరముగా ధ్యానించడమే ఆ అర్థము యొక్క దర్శనము.

ఈ విధంగా ఉపదేశాన్నిచ్చి మహాత్ముడు మౌనంగా వుండిపోయాడు. రాజకుమారుడు ఎలాగూ పాత్రుడే కాబట్టి మహాత్ముని శిక్షణ ప్రకారం సాధన చేయడంతో అతనికి త్వరగానే పరమాత్మ ప్రాప్తి కలిగింది.

మరునాడు ప్రొద్దున లేవగానే రాజుకు రాజకుమారుడు ఆ రాత్రి రాజమహలు నుండి బయటపడి ఎక్కడికో వెళ్ళాడని తెలిసింది. నలువైపులా అన్వేషించారు. కానీ రాజకుమారుని జాడ తెలియలేదు. అపుడు రాజు విష్వక్సేనుడు చాలా దుఃఖపడ్డాడు.

కొన్నిరోజుల తరువాత రాజు ఎవరి ఉపదేశం ప్రకారం చేసిన, అనుష్ఠానం వల్ల రాజకుమారుడు జన్మించాడో ఆ మహాత్ముని దర్శనానికి వెళ్ళాడు. ఆయనకు సాష్టాంగ ప్రణామం చేసి అన్నాడు - 'మహాత్మా! మీరు నాకు ప్రసాదించిన కుమారుడు కొన్ని రోజులనుండి జాడ తెలియకుండాపోయాడు.'

మహాత్ముడన్నాడు - 'కొన్ని రోజులుగా అతడు నా దగ్గర వున్నాడని నీకు తెలియదా? అతడు జ్ఞాని. ఎప్పుడూ ధ్యానములో మునిగివుంటాడు. అతడు తన జీవితాన్ని సఫలంచేసుకున్నాడు. ఈ బాలుడు ఉత్తమశ్రేణికి చెందిన విరాగి, మహాపురుషుడవుతాడని నేను నీకు ముందే చెప్పాను కదా! ఇప్పుడు అదే మాట నిజమైనది. రాజా! ఇలాంటి కుమారుణ్ణి కన్న నీ జన్మ కూడా ధన్యము. ఆ బాలుడు అదృష్టవంతుడు.

రాజకుమారుడు ఇంత త్వరగా ఊహించలేనంత ఉన్నతిని పొందడాన్ని విని అలాగే అతడి స్థితిని ప్రత్యక్షంగా చూసి రాజుకు చాలా ఆశ్చర్యం కలిగింది. తన కుమారుడు ఇంటినుండి వెళ్ళిపోయాడన్న దుఃఖము ఇప్పుడు నెమ్మదించింది. అతడు తన కుమారుడు కావడం గొప్ప భాగ్యమని భావించాడు.

తరువాత రాజు మహాత్ముడిని శరీరము నుండి సంసారము నుండి వైరాగ్యము కలిగే ఏదైనా ఉపదేశాన్నిమ్మని ప్రార్థించాడు. దానితో మహాత్ముడు చాలా ప్రసన్నుడై అన్నాడు -

**ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।**
**జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥**

**(గీతా 13/8)**

అభిప్రాయమేమంటే - ఈ లోకానికి చెందిన మరియు పరలోకానికి చెందిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధమనే విషయ పదార్థాలు అంతఃకరణము, ఇంద్రియాల ద్వారా అనుభవింపబడతాయి. మనిషి తన అజ్ఞానం వల్ల వీటిని సుఖమిచ్చేవిగా భావిస్తాడు. కానీ అవి వాస్తవానికి దుఃఖాన్ని కలిగిస్తాయి. అలాంటి విషయపదార్థాలలో ఏ విధమైన ప్రీతీ లేకపోవడం 'ఇంద్రియార్థేషు వైరాగ్యమ్' అంటే ఇంద్రియాల విషయాల పట్ల వైరాగ్యాన్ని కలిగివుండడం.

మనస్స, బుద్ధి, ఇంద్రియాలు, శరీరము - వీటిలో 'నేను' అన్న ఏ బుద్ధివుందో - ఏది అజ్ఞానం వల్ల అనాత్మ వస్తువులలో ఆత్మబుద్ధిగా ఏర్పడిందో - ఆ దేహాభిమానము పూర్తిగా లేకపోవడమే 'అనహంకారము.'

జన్మయొక్క కష్టము సహజము కాదు. మొదట అసహాయుడైన జీవునికి తల్లి గర్భంలో చాలాకాలము రకరకాల క్లేశాలను అనుభవించాల్సి

వస్తుంది. తరువాత పుట్టేటప్పుడు అసహ్యామైన యాతన అనుభవించాల్సి వస్తుంది. నానా ప్రకారాల యోనులలో పలుమార్లు పుట్టడంతో ఈ జన్మ, దుఃఖము కలుగుతాయి. మృత్యు సమయంలో కూడా చాలా కష్టము కలుగుతుంది. ఏ శరీరంపై, ఇంటిపై జీవితాంతము మమకారము వుందో వాటిని తప్పనిసరిగ వదిలి వెళ్ళాల్సి వస్తుంది. మరణ సమయంలో నిరాశతో వున్న కళ్ళను, శారీరక పీడను చూసి ఆ సమయంలో బయటకు వెళ్ళే స్థితిని ఊహించవచ్చు. వృద్ధాప్యంలోని కష్టం కూడా తక్కువేమీ కాదు. ఇంద్రియాలు సడలి బలహీనమవుతాయి, శరీరము బిగి సడలిపోతుంది. మనస్సులో ఎప్పుడూ భోగించాలన్న తపన యొక్క అలలు ఎగిసి పడుతుంటాయి. కానీ అసహాయమైన అవస్థ వుంటుంది. ఈ అశక్తమైన అవస్థలో కలిగే కష్టము చాలా భయాన్ని కలిగించేదిగా వుంటుంది. ఇదే విధంగా వ్యాధియొక్క పీడ కూడా చాలా దుఃఖాన్ని కలిగిస్తుంది. శరీరము క్షీణిస్తుంది. అనేక విధాలైన అసహ్యామైన కష్టాలు కలుగుతాయి, ఇతరులపై ఆధారపడడం వుంటుంది. ఏ మార్గమూ లేని స్థితి వుంటుంది. ఇవన్నీ జన్మ, మృత్యు, జరా, వ్యాధి అనే వాటి దుఃఖాలు ఈ దుఃఖాలను మాటిమాటికీ స్మరించడం వీటిని గూర్చి ఆలోచించడమే వీటిలో దుఃఖాలను దర్శించడం.

జీవులకు ఈ జన్మ, మృత్యు, జరా, వ్యాధులు కలుగుతాయి. పాపాల పరిణామంగా కలిగే ఈ నాలుగూ దోషాలతో కూడినవి. వీటిని గూర్చి పలుమార్లు విచారించడమే వీటిలోని దోషాలను దర్శించడం.

వాస్తవానికి లోకంలో ఆత్మ తప్ప ఈ దోషాలు లేనిది వేరొకటి లేదు. జడమైన మనం నివసించే ఇల్లు ఒకరోజు కట్టబడుతుంది. ఇది దాని జన్మ. ఎందుకో కూలుతుంది. ఇది వ్యాధి. మరమ్మత్తు చేయబడుతుంది. ఇది చికిత్స. పురాతనమైనదవుతుంది. అదే వృద్ధాప్యము. ఇక ఇప్పుడు మరమ్మత్తు చేయడం వీలుకాదు. మళ్ళీ శిథిలమై కూలిపోతుంది. ఇది మృత్యువు. చిన్నా పెద్ద వస్తువులన్నిటికీ ఈ అవస్థ వుంటుంది. ఈ విధంగా జగత్తులోని ప్రతి వస్తువుకు వున్న జన్మ, మృత్యు, జరా, వ్యాధి దోషాలను బాగా చూసి వాటిపట్ల విరక్తుడు కావాలి.

మహాత్ముని ఈ సుందరమైన ఉపదేశాన్ని విని రాజు తన రాజభవానికి తిరిగివచ్చాడు. ఆ మహాత్ముడు చెప్పిన సాధన ప్రకారం ప్రయత్నించసాగాడు. దీనితో అతి తక్కువ కాలంలో రాజుకు శరీరము పట్ల, సంసారము పట్ల

తీవ్రమైన వైరాగ్యము కలిగింది. అపుడు రాణిని తీసుకొని మళ్ళీ ఆ మహాత్ముని దగ్గరికి వెళ్ళి అన్నాడు - 'మీ ఉపదేశం వల్ల నాకు చాలా లాభం కలిగింది. ఇక ఇప్పుడు జనార్దనుణ్ణి యువరాజుగా అభిషేకించి, భక్తి వైరాగ్యాలలో శేషజీవితాన్ని గడపాలని నాకోరిక.' దీనికి మహాత్ముడు జనార్దనుణ్ణి పిలిపించి అన్నాడు - 'నాయనా! నీవు రాజ్యపాలనను చెయ్యి, ఇక నీకు ఏవిధమైన భయము లేదు. కాబట్టి ఇపుడు నీ తండ్రిగారికి అవకాశమివ్వు. దానితో ఇతనూ భజన-ధ్యానాలను చేసి తన శ్రేయస్సును కలిగించుకోగలడు.'

జనార్దనుడెలాగూ నిత్య విజ్ఞానానంద ఘనుడైన పరమాత్మలో ఆసక్తి గలిగి వున్నాడు. అతడు చాలా ప్రసన్నతతో తండ్రిగారి ఆజ్ఞ ప్రకారం రాజ్యభారాన్ని చూడసాగాడు. అపుడు రాణితో కలిసి రాజు విష్వక్సేనుడు అపుడపుడు మహాత్ముని సత్సంగాన్ని చేస్తూ, అతను చెప్పిన సాధన ప్రకారం శ్రద్ధగా ప్రయత్నించసాగాడు.

ఒకరోజు రాజు విష్వక్సేనుడు మహాత్ముని పాదాలకు నమస్కరించి వినయంగా, దీనంగా ప్రార్థించాడు - 'మహాత్మా! జనార్దనుని వలె నాకూ నిత్య నిరంతరము నిశ్చలమైన స్థితి కలిగేట్లు భక్తి, జ్ఞాన, వైరాగ్యాల ఉపదేశాన్నివ్వండి.'

అపుడు మహాత్ముడు జనార్దనునికి తాను ముందు ఇచ్చిన విస్తారమైన ఉపదేశాన్నే రాజుకు ఇచ్చాడు. మహాత్ముని ఉపదేశాన్ని విని రాజు, రాణి ఇద్దరూ శ్రద్ధాభక్తితో చాలా ఏకాగ్రతతో ఆ మహాత్ముడు చెప్పిన సాధన ననుసరించి అభ్యాసము చేశారు. దాని ఫలితంగా ఇద్దరికీ పరమాత్మ ప్రాప్తి కలిగింది.

ఈ కథనుండి మనం నేర్చుకోవాల్సిందేమంటే మనము కూడా శరీరము నుండి సంసారము నుండి విరక్తుడైన జనార్దనుని వలె పైన చెప్పబడిన సాధనను అనుసరించి మన శేషజీవితాన్ని జ్ఞాన, వైరాగ్య, భక్తి, సత్సంగము మరియు స్వాధ్యాయములో నిలిపి సఫలము చేసుకోవాలి.

హరిః ఓం తత్సత్

# 9. భగవత్ప్రాప్తికి సులభోపాయము

మూక చండాలుడు తన తల్లిదండ్రులను భక్తిశ్రద్ధలతో ప్రేమగా నిరంతరం సేవించుచుండేవాడు. అతడు అలా శ్రద్ధాభక్తులతో ప్రేమగా సేవించిన ప్రభావంతో భగవంతుడే స్వయంగా బ్రాహ్మణుని రూపాన్ని ధరించి ఎప్పుడూ అతని ఇంట్లో వుండేవాడు. తత్పరిణామంగా మూక చండాలుడు భగవంతుని పరమధామానికి వెళ్ళినపుడు అతని తల్లిదండ్రులు కూడా అతనితో బాటు పరమధామానికి వెళ్ళారు. ఇంతే కాదు, అతని ఇంటిలో వున్న జీవులు, జంతువులు కూడా అతని ప్రభావముతో దివ్యమైన రూపాన్ని ధరించి భగవంతుని పరమధామానికి వెళ్ళాయి. దానిలో ప్రభావమేమిటి? ఏమీలేదు - కేవలం తల్లిదండ్రుల సేవయొక్క ప్రభావము.

శుభ అనే ఒక స్త్రీ తన భర్తను భక్తిశ్రద్ధలతో ప్రేమతో నిత్యమూ సేవించుచుండేది. ఆ సేవా ప్రభావం వల్ల ఆమె తన భర్తతో కలిసి విమానంలో కూర్చుని భగవంతుని పరమధామానికి వెళ్ళింది. ఈ విషయాన్ని గమనించి ఒక నరోత్తముడైన బ్రాహ్మణుడు భగవంతుని అడిగాడు - 'భగంతుడా! ఇది ఏమిటీ? అనగా భగవంతుడు మూక చండాలుడు తన తల్లిదండ్రుల సేవతో, శుభ అనే స్త్రీ తన భర్త సేవతో తన పరమధామాన్ని చేరుకున్నారని చెప్పాడు. ఈ కారణం వల్లనే తాను ఈ ఇద్దరి ఇంట్లో వేరే వేరే రూపాన్ని ధరించి ఎల్లప్పుడు వుంటానన్నాడు. వారికి మూడు కాలాలకు చెందిన జ్ఞానము వున్నది. నీ సంఘటనలన్నీ వారికి తెలుసు అని మూడు విషయాలను ప్రశంసించాడు. మూక చండాలుని విషయంలో వేరొక విశేషం కూడా వుంది. అదేమిటంటే అతని ఇల్లు ఆకాశంలో వేలాడుతుండేది. నేలపైన కాదు. ఇల్లు ఆకాశంలో వేలాడడం మరియు మూడు కాలాల జ్ఞానం వుండడం. ఇవి లౌకిక ప్రభావము. లౌకికమంటే సాధారణమైన, సాంసారికమైన, వృద్ధి సిద్ధి గల ప్రభావము. కానీ, భగవంతుడు అతని ఇంట్లో నివసించడం. అతని ఇంట్లోని జీవులు అతనితో పరమధామానికి వెళ్ళడం అలౌకికము. పారమార్థికమైన ప్రభావము. ఇదే అసలు ప్రభావము. మనము అసలు ప్రభావం వైపు ఎక్కువ శ్రద్ధ చూపాలి. లౌకిక ప్రభావము

వున్నా లేకపోయినా సరే. వాటికి అంతే విశేషమైన విలువ లేదు. భగవంతుడు గోవర్ధన గిరిని ఎత్తాడు. ఇది లౌకిక ప్రభావము.

రామేశ్వరము యొక్క సేతువు కట్టుబడినపుడు హనుమంతుడు మొదలైన వానరశ్రేష్ఠుడు పెద్దపెద్ద రాళ్ళు ఎత్తి తెచ్చారు. కానీ ఎవరూ వారిని 'గిరిధరుడని' అనలేదు. కానీ భగవంతుడిని 'గిరిధరుడ'ంటారు. 'పెద్దవాళ్లకే గౌరవం దక్కుతులంది. పర్వతాన్ని ధరించడం వల్లనే అతడు గిరిధరుడనబడ్డాడన్న మాట' కాదు. ఇది లౌకిక ప్రభావము మాత్రమే. భగవంతుని అలౌకిక ప్రభావమీ విధంగా వుంది. వందల వేల రూపాలను ఒకేసారిగా ధరించడం, గొల్లపిల్లవాని రూపంలో గొల్లల ఆవుల మందలకు, తల్లులకు మేలును కలిగించడం. భగవంతుడు పిల్లవాడయితే వారికీ మేలు కలిగిస్తాడు, చాలా దయగలవాడు. అతని దయ అంతులేనిది. కపటవేషాన్ని ధరించి పూతన కుటిల నీతితో పిల్లవాణ్ణి చంపాలని వచ్చి స్తనాలలో విషాన్ని వుంచుకొని ఆ విషాన్ని తాగించినపుడు భగవంతుడనుకున్నాడు. 'మంచిది, ఇది నాకు విషాన్ని తాగించింది. కానీ నేనేమీ చెయ్యాలి? నా దగ్గరికి ఎవరు వచ్చినా వారిని ఉద్ధరించడమే కదా! నా పని,' అనుకొని భగవంతుడామెను ఉద్ధరించాడు.

శ్రీరామచంద్ర భగవానుడు సరయూ ప్రవాహముతో అందరినీ ఉద్ధరించాడు. సరయూ ప్రవాహం నుండి అందరినీ తరింపజేశాడు. 'నాతో ఎవ్వరైనా రావాలనుకుంటే వాళ్ళు సరయూలో స్నానం చేయండి,' అన్నాడు శ్రీరాముడు. అలాగే శ్రీకృష్ణుడు ఏరక (రెల్లు) గడ్డి ద్వారా అందరినీ వాళ్ళతో వాళ్ళను చంపించి దాటించాడు (తరింపజేశాడు). శ్రీరామచంద్రుడు సరయూ ప్రవాహముతో అందరినీ తరింపజేస్తే, శ్రీకృష్ణుడు రెల్లుగడ్డితో అందరినీ తరింపజేశాడు. మహాభారత యుద్ధ సమయంలో శ్రీకృష్ణ భగవానుడు ముందుగానే తానెవ్వరినీ శస్త్రంతో దెబ్బతీయని ప్రతిజ్ఞ చేశాడు. ఎందుకంటే అలా చంపితే వారు ముక్తిని పొందుతారు. ఇది ఒక విధంగా భేదభావంతోనే భగవంతుడు చేశాడు. అదేమంటే తన కుటుంబాన్ని ఉద్ధరించాడు. మహాభారత యుద్ధంలో మరణించబోయే వాళ్ళను ఒకరిని మరొకరితో చంపింపజేశాడు.

దానిలో ఏమైనా కారణముందా?

వుంది. కారణమేమంటే, ఏ వంశములో జన్మించాడో, ఆ వంశము యొక్క ఉద్ధరణ తప్పక జరగాలి.

**కులం పవిత్రం జననీ కృతార్థా వసుంధరా పుణ్యవతీ చ తేన ।**
**అపార సంవిత్సుఖసాగరే-స్మింల్లీనం పరే బ్రహ్మణి యస్య చేతః ॥**
**(స్కాంద. మహే. కౌమార. 55/140)**

జ్ఞానస్వరూపుడు, సుఖసాగరుడు అగు పరబ్రహ్మ, పరమాత్మలో ఎవని చిత్తము విలీనమగుతుందో, ఎవని ఆనందము అగాధ సముద్రమువలె అంతులేనిదో, అట్టి మహాత్ముల సంబంధంతో, సహవాస ప్రభావంతో వారి కులము పవిత్రమవుతుంది. అంతేగాక అతనికి జన్మనిచ్చే తల్లి అయితే ముక్తురాలవుతుంది. ఇది భక్తుల విషయంలో అయితే, మరి సాక్షాత్తు భగవంతుని విషయంలో ఇంత కంటే ఎక్కువే వుండాలి కదా! తనకి చెడు వేసిన వారికి కూడా మంచిని చెయ్యాలి అని భగవంతుడంటాడు. దీనిని భగవంతుడు పూతనోద్ధరణం ద్వారా చూపించాడు.

విషమిచ్చే పూతననే భగవంతుడు ఉద్ధరించాడంటే మరి అమృతం లాంటి పాలను తాగించే యశోదకు భగవంతుడేమి ఇవ్వగలడు? అన్నిటికంటే మహత్తరమగు ముక్తి అందామా!

కాదు ముక్తి కంటే మించినది ఒకటుంది.

ఏమిటది?

స్వయంగా భగవంతుడే. భగవంతుడు తనను తానే యశోదకు అర్పించుకున్నాడు.

ఆమె ప్రాంగణంలో ఆడడం ద్వారా, ఆమెకు కొమరుడై వాత్సల్యభావంతో ప్రేమిస్తూవుండడం ద్వారా, తనను తాను ఆమె కర్పించుకోవడం ద్వారా, యశోద ఇంటిముందున్న ధూళిలో, దేన్ని మనమందరమూ మట్టి అంటున్నామో, దానిలోకి ముక్తి ప్రవేశించింది. దాని పరిణామంగా, యశోద ఎవరి పిడికిటిలోనైనా ఇసుకను నింపితే అతనికి ముక్తి లభిస్తుంది లేదా అతడే స్వయంగా ఇసుకను తీసుకుంటే ముక్తి లభిస్తుంది. ఎందుకంటే ఇసుకలోకి భగవంతుని ప్రభావం ప్రవేశించింది. యశోద ఇల్లు ఒక ముక్తి సత్రముగా మారిపోయింది. ఆ ఇంటికి వెళ్ళిన ప్రతివారికి శ్రేయస్సు లభిస్తుంది. అందుకనే యశోద ప్రభావం కాశీలో శివుని ప్రభావం వంటిది. కాశీకి ఎవరైనా వెళ్ళి అక్కడ శరీరాన్ని విడిస్తే శివుడతనికి ముక్తిని ప్రసాదిస్తాడు. ఇది అక్షర సత్యము. ఇలాంటి ఉదార

భావముగల ఒక కథను వినియున్నాము. ఒక కాయస్థుడు ఉండెను. అతడు గొప్ప ఉదారవంతుడు.

ఇది కథ మాత్రమే, జరిగిన సంఘటన కాదు. కానీ మనవాళ్ళకు దాని భావము గ్రహింపబడాలి. కథ అయితే కావచ్చు కానీ దీని భావము ననుసరించి ప్రవర్తించాలి.

ఇది ఒకప్పటి మాట. ఒక ఏనుగు. యమధర్మరాజు దగ్గరికి వెళ్ళింది. యమధర్మరాజు దానితో పరిహాసాలాడుతూ అన్నాడు. అరే నీ శరీరము పర్వతం లాగా వుంది మరి చాలా చిన్న మనిషి చేతిలోకి ఎలా వచ్చావు?

ఏనుగు అన్నది - మహాప్రభూ! మనిషి వశంలోకి నేనేమటి మీరు కూడా వస్తారు. అంతెందుకు భగవంతుడు కూడా రాగలడు. భగవంతుడిని మిమ్మల్ని కూడా వశంలోకి తెచ్చుకోగలవాడు మనిషి ఒక్కడే. నామాట ఎంత?

యమధర్మరాజు అన్నాడు - అరే గజరాజా! ఈ నా లోకానికైతే ప్రతిదినము వేలకొద్ది మనుషులు వస్తుంటారు. అంతమంది నా వశం అవుతున్నారే!

ఏనుగు అన్నది - అవును మహాప్రభూ! మీ దగ్గరికి వచ్చేవాళ్ళు చచ్చిపోయి వస్తుంటారు. నేను వున్నది జీవించివున్న మనిషి వశంలో. బ్రతికున్న మనిషితో మీకు ఎప్పుడూ పని బడలేదు. బ్రతికున్న వారితో పనిబడిందంటే అది ఒక్క సావిత్రితోనే, తమరెలాగూ ఆమె వశమయ్యారు.

ఇది విని యమధర్మరాజు తన దూతలతో అన్నాడు. 'సరే ఒక బ్రతికివున్న మనిషిని తీసుకొనిరండి.' అనగా ఆ దూతలు రాత్రి సమయంలో ఒక కాయస్థుని ఇంటికి వెళ్ళారు. గ్రీష్మకాలమది. ఆ కాయస్థుడు తన మూడంతస్థుల మేడపైన మంచంపైన పడుకొని వున్నాడు. దూతలు మంచం యొక్క నాలుగు కాళ్ళను పట్టుకొని ఆకాశమార్గంలో ఎగిరి వెళ్ళసాగారు. వాళ్ళు అలా ఎగరగానే కాయస్థుని కళ్ళు విచ్చుకున్నాయి. తాను అలా మంచంపై ఎగరడాన్ని చూసి ఆ కాయస్థుడు ఆలోచించాడు. 'ఇది ఏమి మాయ?' అని. 'పొరపాటున కదిలితే జారి క్రింద పడిపోతాను, మరణిస్తాను' అని కూడా ఆలోచించాడు. 'సరే చూద్దాం ఎవరో ఏమిటో?' అని తల ఎత్తి నలువైపులా చూడగా యమదూతల వలె కనిపించారు. కాయస్థుడు తన

మనస్సులో ఆలోచించాడు. 'అరే, యమదూతలు నిజానికి మరణించిన పాపులను తీసుకుపోవడానికి వస్తారు కానీ నన్ను బ్రతికివుండగానే తీసుకొని వెళ్తున్నారు.' మళ్ళీ అనుకున్నాడు. 'కలకాదు కదా! కాదు, కాదు. ఇది కల ఎలా అవుతుంది? నేను మేల్కొని వున్నాను. కూర్చుని వున్నాను.' మళ్ళీ అనుకున్నాడు. నా మనస్సులో భ్రమ ఏర్పడలేదు గదా! 'కాదు, కాదు భ్రమ ఏర్పడే అవకాశమే లేదు. ఇది పదహారణాలు నిజము' అనుకొని - 'యమదూతలారా! నన్నెక్కడికి తీసుకొని వెళ్తున్నారు.' అని అడిగాడు. అనగా యమదూతలన్నారు. 'యముని దగ్గరికి' అని. అది విని కాయస్థునికి స్ఫురించింది. అతడు జేబులోంచి పెన్సిల్, కాగితం తీసి ధర్మరాజుకు చీటి (జాబు) వ్రాశాడు - 'ధర్మరాజుకు హరి భగవంతుని అభినందన. ఈ కొత్త గుమాస్తాను పంపుతున్నాను. ఇతని ఆజ్ఞ ప్రకారమే అంతా చెయ్యాలి,' అని వ్రాసి క్రింద సంతకం చేసే దగ్గర 'శ్రీహరిః' అని వ్రాశాడు. తరువాత దాన్ని జేబులో పెట్టుకున్నాడు. యమదూత లతడిని ఆ స్థితిలోనే తీసికొని సభకు వెళ్ళారు. ఆ సమయంలో సభ కొనసాగడం లేదు. సభలోకి వెళ్ళి వారు మంచాన్ని దింపారు. ఇక తెల్లవారింది. తరువాత సభ మొదలైంది. యమధర్మరాజు వచ్చాడు. ఇతనికి యమరాజు అని ధర్మరాజు అని రెండు పేర్లు వున్నాయి. కాయస్థుడు తాను వ్రాసిన లేఖను తీసికొని యమరాజుకు సమర్పించాడు. దైవవశాత్తు ఆ అక్షరాలు శ్రీహరి వ్రాసిన అక్షరాలలాగే వున్నాయి, శ్రీహరి అనే సంతకం కూడా కుదిరింది. కాగితాన్ని చదవగానే యమరాజు, ఒక్క ఉదుటున లేచి చేతులు జోడించి అన్నాడు - 'కూర్చోండి మహారాజా!' అని కాయుస్థుడిని ఆసనంపై కూర్చోబెట్టి తాను అతని కాళ్ళ వద్ద కూర్చొన్నాడు. ఇక గుమాస్తా (కాయుస్థుడు) చెప్పినట్లుగా పని జరుగసాగింది. తరువాత అపరాధులు వరుసగా రాసాగారు. చిత్రగుప్తుడు దగ్గరలోనే కూర్చున్నాడు. యమరాజు ఒక అపరాధి విషయంలో చిత్రగుప్తుని అడిగాడు. ఏమండీ. చిత్రగుప్తుడు గారూ! 'ఈ అపరాధి ఎవరు? ఎలాంటివాడు?' అనగా చిత్రగుప్తుడన్నాడు 'మహారాజా! ఇతడు వైశ్యుడు.'

కాయస్థుడన్నాడు 'ఏం చేస్తాడు?'

చిత్రగుప్తుడన్నాడు - 'అసత్యము, కపటము, దొంగతనము, కృతఘ్నుత ఇతని వ్యవహారము. ఇతను అమితపాపి.'

**ఝూటయి లేనా ఝూటయి దేనా,**
**ఝూటయి భోజన ఝూట చబేనా।**

కాయస్థుడు - అరే! ఇచ్చి పుచ్చుకోవడామెలాగూ అసత్యమవుతుంది. కానీ అసత్య భోజనము, అసత్యపానము ఎలా? అన్నపానాలు అసత్యమెలా అవుతాయి?

చిత్రగుప్తుడు - ప్రభూ! విషయమేమిటంటే - ఈ కాలంలో ధాన్యంపైన కంట్రోలు వుంది. ధాన్యం తెచ్చుకునేప్పుడు ప్రభుత్వానికి తెలిస్తే పట్టుబడతారు. అందుకే వీళ్ళు తినేదేమో గోధుమలు, వరిబియ్యం కాని చెప్పేదేమో ప్రస్తుతం మేము చౌకబియ్యం తింటామని. ఇలా అబద్ధం చెప్పారు. కాబట్టే 'ఝూటయి భోజన ఝూట చబేనా.'

కాయస్థుడన్నాడు - మంచిది. ఇతని విషయంలో ఏం చెయ్యాలి?

చిత్రగుప్తుడు - ప్రభూ! ఇతన్ని 'కుంభీపాక' నరకంలో పడవేయాలి.

కాయస్థుడు - నీకు తెలియదా?

చిత్రగుప్తుడు - ఏమిటి?

కాయస్థుడు - ఇతడు వైకుంఠానికి వెళ్లాలని.

చిత్రగుప్తుడు - ప్రభూ! ఇతడు వైకుంఠానికి తగినవాడు కాడు.

కాయస్థుడు - నీకు దీనితో సంబంధమేమిటి? వెళ్ళనీ, చాలు. కొద్దిసేపటి తరువాత ఒక గొల్ల స్త్రీ వచ్చింది. దీని విషయంలో చిత్రగుప్తుడన్నాడు. 'ప్రభూ! ఈ మహిళ పాలను అమ్ముకుంటుంది. ఈమె అమ్మే పాలవల్ల పిల్లలకు రోగాలు కలుగుతాయి.

చిత్రగుప్తుడు చెప్పాడు - పాలల్లో ఈమె చవకబారు పిండి కలుపుతుంది. తెల్లని చెరువునీరు కలిపి పాలను అమ్ముతుంది. దాంట్లో మట్టి కలిసి వున్నందువల్ల బాలకులకు రోగాలు వస్తాయి. కాబట్టే ఈమె చాలా పెద్ద పాపాన్ని చేస్తోంది. ప్రజలను మోసగిస్తోంది. పాలు త్రాగించే పిల్లలకు ఇలా అన్యాయాన్ని చేస్తుంది. ప్రభూ! దీని ప్రకారం మన 'రౌరవ నరకం'లో ఇలాంటి వాళ్ళను వెయ్యాలి.

కాయస్థుడు - లేదు, లేదు. ఈమె కూడా వైకుంఠానికి వెళ్ళనీ.

చిత్రగుప్తుడు - ఈమె కూడా వైకుంఠానికా?

కాయస్థుడు - అరే! నీవు చూస్తూవుండు. ఎవరు వచ్చినా

వైకుంఠానికి పంపు. ఆ తరువాత కొద్దిసేపటికి మద్యవిక్రేత వచ్చాడు.

చిత్రగుప్తుడు - ఇతనికి మద్యం బట్టీ వుంది. ప్రభూ! మద్యపానము బ్రహ్మహత్యతో సమానమని మీ కెలాగూ తెలుసు. ఇతినకైతే రాత్రింబగళ్ళూ మద్యమే వ్యాపారము. ఇతడు మనుష్యులను ధర్మభ్రష్టులను చేశాడు. 'మహాతామిస్ర' మనే నరకంలో యోగ్యుడితడు.

కాయస్థుడు - లేదు, ఇతన్నీ వైకుంఠానికి పంపు.

చిత్రగుప్తుడు - ప్రభూ! ఇతడు కూడా వైకుంఠానికి వెళ్తాడా?

కాయస్థుడు - ఎవరు వచ్చినా, వాళ్ళను వైకుంఠానికి పంపండి.

ఆ తరువాత ఒక కసాయి వచ్చాడు.

కాయస్థుడడిగాడు - ఇతడెవరు?

చిత్రగుప్తుడు చెప్పాడు - ప్రభూ! ఇతనిది మాంసవిక్రయశాల. రోజుకు ఒక వెయ్యి ఆవులను చంపాలని ఇతని నియయము. తన జీవితంలో ఇతడు లక్షల, కోట్ల ఆవులను చంపి వేశాడు ప్రభూ! 'మహారౌరవ' మనే నరకంలో పడడానికి ఇతడు యోగ్యుడు - ఆ తరువాత మీ ఇష్టం.

కాయస్థుడు - ఇతడిని కూడా వైకుంఠానికి పంపండి.

చిత్రగుప్తుడు - ప్రభూ! మీరు ఏ మాత్రమూ ఆలోచించడం లేదు.

కాయస్థుడు - ఈ విషయంలో నీవు ఆలోచించవలసిన అవసరం లేదు. ఇక అడుగవద్దు. వచ్చినవారినల్లా వైకుంఠానికి పంపు. వరుస ఏర్పరచు.

ఆ తరువాత ఒక వేశ్య వచ్చింది.

చిత్రగుప్తుడన్నాడు - ప్రభూ! ఈమె వేశ్య. ప్రజలను చాలా ధర్మభ్రష్టులను చేస్తుంది.

కాయస్థుడు - నీవు చెప్పకు - వైకుంఠానికి వెళ్ళనీ.

భగవంతుడు చూశాడు. వైకుంఠానికి వచ్చే వారి బారు ఏర్పడింది. ప్రజలు వస్తూనే వున్నారు. వీళ్ళంతా వైకుంఠానికి వస్తున్నారు విషయమేమిటి? కీర్తిమంతుడనే ఒక రాజుగారి రాజ్యంలో చేయబడిన భక్తి ప్రచారం మళ్ళీ మొదలైనదా ఏమిటి? అనుకొని మళ్ళీ ధ్యానించి చూశాడు. లేదు, భక్తి అంత ప్రచారంలోకి రాలేదు. ముందు వున్నట్లే వుంది. మళ్ళీ యమలోక విషయంలో విచారించి చూశాడు. ఎవరో కాయస్థుడు వచ్చి కూర్చున్నాడు. అతడే అందరినీ వైకుంఠానికి పంపుతున్నాడు. పరుగున

భగవంతుడు యమరాజు దగ్గరికి వచ్చాడు. భగవంతుడు రావడాన్ని చూసి అందరూ లేచి నిలుచున్నారు. కాయస్థుడు కూడా నిలుచున్నాడు. ఆసనంపై భగవంతుడిని కూర్చోబెట్టి అందరూ క్రింద కూర్చున్నారు.

భగవంతుడు - ధర్మరాజా! నీ లోకంలో ఈ అస్తవ్యస్త మేమిటి?

ధర్మరాజు - స్వామీ! మీరు ఈ కొత్త గుమాస్తాను పంపిన నాటి నుండి ఈ వ్యవస్థ మారిపోయినది. పూర్వపు రిజిష్టర్లు చూడండి! అంతా బాగానే వుంది.

భగవంతుడు - కొత్త గుమాస్తా ఎక్కడ?

యమరాజన్నాడు - మీ ఎదుట కూర్చున్నాడే అతనే.

భగవంతుడు - నీవెక్కడి నుండి వచ్చావు? ఎలా వచ్చావు?

కాయస్థుడు - ప్రభూ! ఎందుకు ఇలా అడుగుతున్నారు? ఎలా అడుగుతున్నారు? మీరే నన్ను పంపినారు కదా!

భగవంతుడు - ధర్మరాజా! ఇతన్ని నేను పంపానని నీవు ఎలా నమ్మితివి?

యమరాజు - ఇదిగో మీ పత్రము. చూడండి.

భగవంతుడు పత్రాన్ని చూస్తే సరిగానే వుంది.

భగవంతుడు - ఇది ఎవరు రాసిన పత్రము?

కాయస్థుడు - ప్రభూ! మీరు వ్రాసినది.

భగవంతుడు - నేను నిన్ను కలవనే లేదు. పత్రమెలా వ్రాశాను?

కాయస్థుడు - ప్రభూ! మీరు అందరి హృదయాలలో వున్నారు. గీతలో మీరే చెప్పారుకదా!

**సర్వస్య చాఽహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ ।**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్. ॥**

**(గీత 15/15)**

'నేను ప్రాణులన్నిటి హృదయాలలో వున్నాను. నా నుండే స్మృతి. నా నుండే జ్ఞానము కలుగుతుంది. అపోహనము (సంశయము, విపర్యయము మొదలైన దోషాల నాశనము) కూడా కలుగుతుంది. వేదాలన్నిటి ద్వారా నేనే తెలియదగినవాడిని. వేదాల తత్త్వాన్ని నిర్ణయించేవాడిని, వేదాలను తెలిసినవాడిని కూడా నేను.'

నా మనస్సులో 'జ్ఞానము' స్ఫురితి, విచారము కలిగినపుడు నేను ఈ పత్రాన్ని వ్రాశాను. ఇది మీ ప్రేరణే. మళ్ళీ మీరే ఎవరి ప్రేరణ వలన అని అడుగుచున్నారేల?

భగవంతుడు - ఈ మాట సరైనది. కాని నీవు చేసిందేమిటి? వచ్చిన వాళ్ళనందరినీ వైకుంఠానికి పంపి నీవు చాలా అన్యాయాన్ని చేశావు.

కాయస్థుడు - ప్రభూ! ఈ కుర్చీ, ఈ పదవి నాకు ఎప్పటికీ వుండేవి కావు అని నేను ముందే ఆలోచించాను. అందుకనే ఎంత సమయం లభిస్తే అంతలో చేయాల్సింది చేస్తాను. ఎవరినీ నరకానికి పంపవద్దు. అందరినీ వైకుంఠానికి పంపాలని 'నియమం' పెట్టుకున్నాను.

భగవంతుడు - తగని పనులను చేసినవారిని కూడా వైకుంఠానికి పంపావు. ఇది అన్యాయము.

కాయస్థుడు - ప్రభూ! నేను అన్యాయము చేశాననుకుంటున్నారా? నేను అనుచితాన్నే చేసివుంటే వాళ్ళనందరినీ తిరిగి ఇక్కడికి పంపండి. కానీ గుర్తుంచుకోండి, వాళ్ళను తిరిగి పంపితే గీతలోని చాలా శ్లోకాలను తీసివేయాల్సి వస్తుంది.

భగవంతుడు - ఎందుకు?

కాయస్థుడు - మీరే అన్నారు - నా పరమధామాన్ని పొంది ఎవరూ తిరిగిరారు. ఎందుకంటే నా పరమధామము అవ్యక్తము, అక్షరము మరియు పరమగతి అనబడుతుంది అని.

**అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్ ।**
**యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥**

**(గీత 8/21)**

మీ పరమధామాన్ని పొంది ఎవరైనా తిరిగి వస్తే మీరు ఈ గీతా శ్లోకాన్ని తీసివేయాల్సి వస్తుంది. అనగా భగవంతుడు - అరే! వీడెవడో నైపుణ్యం గలవాడు అని ఆశ్చర్యపోయి అడిగాడు - నీవెవరు?

'కాయస్థుడిని' టకామని సమాధానమిచ్చాడు.

భగవంతుడన్నాడు - నీవు కాయస్థుడివి కాబట్టే నీకు ఈ బుద్ధి. లేకపోతే ఇంత చలాకీతన మెక్కడినుంచి వస్తుంది? సరే, అయినదేదో

అయినది. ధర్మరాజా! మేమంతా వెళుతున్నాము. నీవు నీ పని సరిగ్గా చెయ్యాలి.

యమరాజు - మంచిది, ప్రభూ!

ఆ తరవాత భగవంతుడు వెళ్ళడానికి సంసిద్ధుడయ్యాడు అపుడు కాయస్థుడు కూడా అతనితో వెళ్ళడానికి తయారయ్యాడు.

భగవంతడు - నీవెక్కడికి వెళతావు?

ప్రభూ! మీరెక్కడికి వెళ్ళితే అక్కడికి నేనూ వెళతాను.

'ఎందుకు?'

కాయస్థుడు చెప్పాడు - గీతలో మీరే అర్జునునితో అన్నారు. అర్జునా! బ్రహ్మలోకము వరకు అన్నీ పునరావర్తనము గలవి కానీ నన్ను పొందిన తరువాత పునర్జన్మ లేదు.

**ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।**
**మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥**

**(గీత 8/16)**

ప్రభూ! బ్రహ్మలోకము వరకు వెళ్ళిన ప్రాణి తిరిగి వస్తుంది. మరి ఇది యమలోకము. ఇక్కడి నుండి తిరిగి వెళ్ళాల్సి వస్తుంది కదా! కానీ నేను మిమ్ములను పొందినాను. తిరిగి ఎలా వెళ్ళను? మిమ్ములను పొంది నేను తిరిగి వెళ్ళను. తిరిగి పంపితే. గీతాశ్లోకంలో దోషము వస్తుంది.

భగవంతుడు - 'సరే నాయనా! నడువు,' అంటూ వెళ్ళబోతూ భగవంతుడడిగాడు. 'యమరాజా! ఈ ప్రాణి ఎలా వచ్చింది? ఇదైనా చెప్పు.' అంటే యమరాజు కథనంతా వినిపించాడు.

యమరాజన్నాడు - 'ప్రభూ! ఒకనాడు నేను, ఇదిగో ఇక్కడున్న ఏనుగుతో, నీ శరీరమోమో ఇంత విశాలంగా పర్వతమంత వుంది. నీవు మనిషి వశంలోకి ఎలా వెళ్లావని పరిహాసాలాడసాగాను.' దానితో ఈ ఏనుగన్నది - 'ప్రభూ! మనిషి వశంలోకి భగవంతుడు కూడా వెళతాడు. మీరు కూడా అతనికి వశమవుతారు' అంటే నేను 'నా దగ్గరికి రోజూ మనుషులు వస్తారు' అన్నాను. దానికి ఆ ఏనుగు 'అవును ప్రభూ! కానీ చనిపోయి వస్తారు.' అంటే నేను పరిహాసానికి 'అలాగైతే, బ్రతికివున్న వ్యక్తిని తీసుకొని రమ్మని పంపాను. ఇతడినే తీసుకొనివచ్చారేమో. దానితో

భగవంతుడు దూతలను పిలిచి అడిగాడు - 'దూతలారా! ఇతడిని మీరు తెచ్చారా?

దూతలన్నారు - అవును ప్రభూ! మేమే తెచ్చాము. 'దానితో భగవంతుని ఎదుటే యమరాజు దూతలతో అన్నాడు - ఇతడిని తెచ్చామని మీరు వచ్చి నాకు ఎందుకు చెప్పలేదు?'

దూతలన్నారు - 'ప్రభూ! మేమేం చెప్పగలం? ఇతడు వచ్చాడు, మీకేదో పత్రాన్ని సమర్పించాడు. తరువాత మీరు చేతులు జోడించి నిలుచున్నారు. ఆసనాన్ని ఇచ్చారు. పదవిని ఇచ్చారు. మేమందరము ఇది చూసి బహుశా బాగా తెలిసినవాడై వుండవచ్చు ననుకున్నాము. ఇక మేమెలా చెప్పగలం?' ఆ తరువాత ఏనుగన్నది - మీరే కాదు భగవంతుడు కూడా మనిషికి వశమవుతాడని నేనన్నాను. మీరు వశమయ్యారా లేదా? భగవంతుడు వశమయ్యాడు, మీరూ వశమయ్యారు - భగవంతుడు, యమధర్మరాజు ఇద్దరూ అన్నారు - నిజమే, ఆ తరువాత భగవంతుడు, కాయస్థుడు వెళ్ళిపోతున్నప్పుడు కాయస్థుడన్నాడు. 'ప్రభూ! చూడండి, తొండమెత్తి నిల్చున్న ఈ ఏనుగును కూడా వెంట తీసికొని వెళ్ళండి. ఈ యమధర్మరాజుకు అతని పదవినివ్వండి. నాకు ఏ అభ్యంతరము లేదు. యమరాజు వంటి పదవిని నాకు అవసరం లేదు.' అనగా భగవంతుడడిగాడు - 'ఎందుకు?' అని.

దానికి కాయస్థుడిలా చెప్పాడు. ఇది కూడా మీ దర్శనాన్ని పొందింది. మీ దర్శనాన్ని పొంది కూడా ఈ అమాయక జీవి యమలోకంలోనే వుండాలా?

భగవంతుడన్నాడు - 'దీన్ని కూడా తీసుకుని వెళ్ళండి.' ఆ తరువాత భగవంతుడు వారితో అన్నాడు. ఇంతకు ముందు పని చేసినట్లే మీరు పనిచేయండి. చట్టాన్ని అనుసరించి న్యాయాన్ని చేయండి. అయిందేదో అయిపోయింది.'

వైశ్యుని బుద్ధి ఎలా వుంటుందని ఎవరైనా అడుగవచ్చు. వైశ్యుని బుద్ధి కూడా మంచిదే అవుతుంది. ఆ వైశ్యునికి కూడా ఏదైనా పదవి లభిస్తే, పొరపాటున భగవంతుడు దాని ప్రసాదిస్తే అతడు కూడా కాయస్థుని నీతి వర్తనాన్ని పొందాలి. తక్కువ ఎందుకు వుండాలి?

ఇపుడే కలిగిందనో లేదనో ఎవరైనా అనవచ్చు. భగవంతుని కృప వుంటే లభింపవచ్చు కూడా. ఎందుకంటే, భగవంతుడు తన కృపతో దోమను కూడా బ్రహ్మగా చేయగలడు. బ్రహ్మను కూడా దోమకంటే హీనంగా చేయగలడు. అని తులసీదాసు అంటారు -

**మసకహి కరఇ బిరంచి ప్రభు అజహి మసక తే హీన।**

భగవంతునిది ఇలాంటి ప్రభావము. అతడు తన ప్రభావంతో తనకు ఇష్టమైన దానిని చేయవచ్చు. మనలో ఎవరికీ ఆ సామర్థ్యం లేదు. నైపుణ్యం లేదు, ప్రభావమూ లేదు. ఏది లేదు. భగవంతుడు కోరితే ఎవరినైనా ఏమైనా చేయగలడు.

ఇలా కావడానికి ఏ మార్గాన్ని అవలంబించాలి. మార్గాన్ని అవలంబించడానికి కూడా ఒక దృష్టాన్తముంది. భగవంతుని అనన్య భక్తుడొకడుండేవాడు. అతడు తన శరీరము, మనస్సు, ధనము, జనము అంతటిలో భక్తిని చూపేవాడు. అంతా భగవంతునికి సమర్పించేవాడు. సమర్పించి అతడు ఏ పనిచేసినా భగవంతునిదేనని భావించి చేసేవాడు, ఎందుకంటే భగవంతుని పని అనుకొని చేస్తే సమయమంతా ప్రసన్నంగా వుంటుంది, ఆలసట రాదు. నవ్వుతూ, నాట్యం చేస్తూ చాలా వినోదంగా అతడు ఆనందంతో ఇరవైనాలుగ్గంటలూ భగవంతుని పనేచేసేవాడు.

ఇరవైనాలుగు గంటలూ ఎలా చేస్తాడు? నిద్రిస్తాడా లేదా? సోదరా! పగలు చేసినట్లే తాను రాత్రికూడా పని చేయడాన్నే చూస్తూవుంటాడు. అందుకే అతనికి ఇరవైనాలుగు గంటలూ పని నడుస్తూనే వుంటుంది. ఇలాంటి భక్తుడతడు కాబట్టే భగవంతుడు సాక్షాత్తు ప్రత్యక్షమై అన్నాడు. 'ఏమి కోరుకుంటావో కోరుకో!'

భక్తుడన్నాడు - 'ప్రభూ! మీ దర్శనమైనాక కోరిక మిగిలి వుంటుందా? మిమ్ములని విడిచి కోరుకోవడానికి మిమ్మల్ని మించిన వస్తువేముంది?'

భగవంతుడన్నాడు - 'నీవన్నది నిజమే. కానీ నా సంతోషానికి ఏదైనా కోరుకో! నీకు సరిపోయినదే కోరుకో!'

భక్తుడన్నాడు - సరే ప్రభూ! 'నీకు తగినది కోరమని మీరు నా పైననే భారాన్ని వుంచారు. అందరినీ ఉద్ధరించండి' అన్నదే నేను కోరుకుంటాను.

భగవంతుడన్నాడు - అరే, అందరినీ నేను ఉద్ధరిస్తే మరి ఈ అందరి పాపాన్ని ఎవరనుభవిస్తారు? మన పుణ్యాకర్మలన్నింటినీ - 'నేను చేసిన పుణ్యాకర్మలన్నీ 'శ్రీకృష్ణార్పణమస్తు' భగవంతునికి అర్పింబడ్డాయని - త్యజించవచ్చు - ఎన్ని మంచి కర్మలను చేశామో వాటిని ఇప్పుడైనా మనం భగవంతుని కర్పిస్తే 'ఖాతా' చెల్లిపోతుంది. కానీ, ఏ పాపకర్మలున్నాయో అవి ప్రాయశ్చిత్తంతో నశిస్తాయి లేదు 'అనుభవం'తో లేదా 'సాధన'తో నశిస్తాయి. లేకపోతే, వీళ్ళ పాపం వుండగా ముక్తి ఎలా లభిస్తుంది? వీళ్ళ పాపాన్ని ఎవరనుభవిస్తారు?'

భక్తుడన్నాడు - సరే ప్రభూ! వీళ్ళందరి పాపాన్ని నేననుభవిస్తాను. ప్రపంచంలోని ప్రాణులన్నిటికీ మీరు ముక్తిని ఇవ్వండి, వాటి పాపమెంతైతే ఉన్నదో దాన్ని నాకు కేటాయించండి. మీరు అనుభవింపజేయండి, నేను అనుభవిస్తాను. ఇలా అనుభవిస్తూ, అనుభవిస్తూ వుండగా ఎప్పుడిది అయిపోతుందో అపుడు ఖాతా తనకుతానే చెల్లిపోతుంది.

భగవంతుడు - నాయనా! నీవు నా భక్తుడివి. వరదానంగా నీకు పాపుల దండనను అనుభవింపజెయ్యాలా?

భక్తుడు - అలా అయితే మీరుచాలా దయగలవారు, దయాసముద్రులు, పరమదయాళువులు. అందరిపట్లా దయతో మీరు అందరినీ క్షమించండి.

భగవంతుడు - ఇది అసంభవము.

భక్తుడు - అసంభవమనేదేదీ లేదు. మీరు ఇది అసంభవమని అంటే మీరు అసంభవాన్ని కూడా సంభవంగా చేయగలరు. ఎందుకంటే మీరు పరమేశ్వరులు, పరమాత్మ. పరమాత్మ అయితే అసంభవాన్ని కూడా సంభవంగా చేయగలడు.

భగవంతుడు - నాయనా! ఈ విషయంపై మాట్లాడడంలో నేను నీ చేతిలో ఓడిపోయాను.

భక్తుడు - ప్రభూ! ఓడిపోవడం వల్ల ఏమైంది? మీకు సామ్థ్యం లేకపోతే మీరు నాతో 'నాయనా! స్త్రీలను కోరుకో, పుత్రులను కోరుకో, ధనాన్ని కోరుకో, ముక్తిని కోరుకో అని వుండాల్సింది. అంతే. కానీ నీ కిష్టమైనది కోరుకొమ్మని అనడం తగినది కాదె. సామర్థ్యం లేకపోతే 'ఇష్టమైనది కోరుకొమ్మని' ఎందుకన్నారు? సామర్థ్యమే వుంటే కోరిన దానిని ప్రసాదించండి.

భగవంతుడు - సరే బాబూ! నీవు గెలిచావు, నేను ఓడాను.

భక్తుడు -ప్రభూ! ఈ గెలుపుతో లాభమేమిటి? నేను ఓడినా సరే అందరికీ శుభం కలగాలి.

ఒక్కడికైనా శుభం కలగని గెలుపు వల్ల లాభం లేదు.

భగవంతుడన్నాడు - సరే, నా దర్శనము, స్పర్శ, వార్తాలాపము, చింతనము, నా నామసంకీర్తనము, జపము, ధ్యానము ఇంకా ఏరకంగానైనా నాతో సంబంధం కలిగితే మనిషికి శుభం కలుగుతుంది. ఆ శక్తిని, సామర్థ్యాన్ని నేను నీకు ఇస్తున్నాను. నీ దర్శనం, స్పర్శనం, భాషణం, వార్తాలాపము, చింతన, నామోచ్చరణతో కూడా అతనికి శుభము కలుగుతుంది. నీవు ఎలా కోరితే అలా ఎందరిని ఉద్ధరించాలంటే అందరిని ఉద్ధరించు.

దీని తరువాత భక్తుడు ఆలోచించసాగాడు - 'మన పని అయితే కాలేదు. భగవంతుడ్చినదే సరైనది. యజమాని ఇష్టం. ప్రభువుకు అందరినీ ఉద్ధరించాలని లేకుంటే అయన ఇచ్చినదే స్వీకరిస్తాను. అని అతడు భగవంతుడు ప్రసాదించిన దానినే స్వీకరించాడు.

కాయస్థునికి లభించిన అధికారము వంటిది ఎవరికి లభిస్తుంది? కాయస్థునికి లభించినవి మూడే రోజులు. అతనికంటే ఎక్కువ కీర్తిమంతుడగు రాజుకు లభించాయి. అతని కంటే ఇంకా ఎక్కువ స్థలం ఖాళీగానే వుంది. అంటే అందరి ఉద్ధరణ ఇంకా జరుగలేదు. ఆ ఖాళీగా వున్న స్థానంలోకి ఎవరైనా వస్తే మనందరి ఉద్ధరణ జరుగుతుంది. ఇలాంటి అధికారము ఎవరికి లభిస్తుంది? నేను చెప్పిన భక్తుని కథలోని భక్తుని వంటి హృదయమున్న వానికి లభిస్తుంది. ఇతరుల పాపఫలము, దుఃఖము యొక్క దండన నాకు కేటాయించు, వీళ్ళందరినీ ఉద్ధరించుమనెడు భావనతో నిండిన విశాల హృదయమును గలిగి, గొప్ప ఔదార్యమును, చక్కని నిష్కామభావమును, నిండైన త్యాగమును తన ఎదనిండుగా గలిగియున్న వానికే ఇతరులను ఉద్ధరింపగలిగెడు అధికారము లభిస్తుంది. ఈ ఉన్నతశ్రేణి దయ, సుహృద్భావమనేవి భగవంతుని కంటే ఎక్కువ అని మనమంటే దానికి ఇబ్బంది లేదు. ఎందుకంటే భక్తుల గొప్పదనం ఇలా గానం చేయబడింది.

**మోరేఁ మన ప్రభు అస బిస్వాసా రామ తే అధిక రామ కర దాసా ॥**

**(రా.చ.మా. 7/120/16)**

అనగా -భగవంతుని కంటే అతని దాసులే ఎక్కువ అన్న విశ్వాసమైతే నా మనస్సులో ఉన్నది.

ఇదే భక్తుల గొప్పదనం. ఇతరుల మేలుకోసం వారి పాపాన్ని సైతం అనుభవించడానికి సిద్ధంగా వుంటారు. ఒక మనిషి కోసమే కాదు, లోకమంతటి కోసం వారు సిద్ధంగా ఉండెదరు. కానీ భగవంతుడు కూడా తన భక్తుని ద్వారా అందరి పాపాన్ని ఏల అనుభవింపజేయును? భక్తుడు తనవాడు కదా! అతని మాటను కూడా తాను నిలబెట్టవలసి వుంది. అందుకు భగవంతునికి అనుభవించుట అనేది లేనేలేదు కదా! అయితే భగవంతుడు పరీక్షిస్తాడు, గీటురాయిపైన వుంచి తన భక్తుని పరిశుద్ధం చేయడానికే పరీక్షిస్తాడు.

మొదట్లో చర్చించిన భగవంతుని ప్రేమ విషయము మధ్యలోనే ఆగిపోయింది. వాస్తవానికి ఇవన్నీ భగవంతుని ప్రేమలోనివే. ఇపుడు ముఖ్యంగా ప్రేమ గురిం వివరించెదము.

గోపికలలో అందరినీ మించినది రాధిక. ఆమెకున్న భావమును గూర్చిన జ్ఞానము ఇప్పటి మనుష్యులలో కానరాదు. బయటికి (పైన) కనబడడానికి చాలా వుంటుంది. కాని రాధికకున్న అసలు భావము మరుగునపడివుంది.

రాధా భావము వంటి భావము ఇంతవరకు వెల్లడి కాలేదు. ఇప్పటికి సుమారు ఐదువేల సంవత్సరాలకు ముందు శ్రీకృష్ణభగవంతుడు అవతరించినపుడు గోపికలున్నారు. రాధిక వుంది. అప్పట్లో ఆమె ప్రేమ భావము మూర్తీభవించి నర్తించేది.

అపుడు మూర్తీభవించి దాల్చి నర్తించేదంటే ఇప్పుడెందుకు నర్తించడం లేదు అని ప్రశ్నించవచ్చు.

అపుడు సాక్షాత్తు భగవంతుడే అవతరించాడు. ఇప్పుడు కూడా భగవంతుడు వస్తే బహుశ అవతారమే కాదు, భక్తులు కూడా అవతరించి యుండిరి. గోపికలెవరు? వాలఖిల్యుడు మొదలగు మునులే గోపికలుగా ఆవిర్భవించారని కొందరంటారు. శ్రుతులే గోపికలని కొందరంటారు. భగవంతుని పరమధామంలోని భక్తులే అవతరించారని మరికొందరంటారు.

కాబట్టే ప్రేమయే మూర్తీభవంచి నర్తించేది. ప్రేమ, ప్రేమాస్పదులు, ప్రేమికులు. ఈ మూడూ ఒకే వస్తువు. ఒక్క ప్రేమయే మూడు రూపాలను ధరిస్తుంది. భగవంతుని దృష్టిలో గోపికలు ప్రేమాస్పదులు, భగవంతుడు ప్రేమికుడు. గోపికల దృష్టిలో భగవంతుడు ప్రేమాస్పదుడు, గోపికలు ప్రేమికులు, వారి సంబంధము ప్రేమ యొక్క సంబంధము. ప్రేమ మధ్యలో సంబంధాన్నేర్పరచేది. ప్రేమ అక్కడ భావరూపంలో వున్నదన్నమాట. ఇలాంటి ఆ మూడూ అక్కడ వున్నాయి. ఈ విషయాన్ని మీరు గమనించాలి.

ఆ సమయంలో భగవంతుడు స్వయంగా ప్రకటమైనాడు. అలాగే అతని 'పరికరాలు' కూడా తోడు వచ్చాయి.

ఒకప్పటి మాట. నారద మహర్షిసైన మన్మథుడు తన ప్రభావాన్ని చూపినపుడు నారదుడన్నాడు - 'మన్మథా! నీవు నన్ను కూడా విడువలేదు. ఒక్క ఇల్లైనా విడవాలికదా! మన్మథుడన్నాడు -నేనెవ్వరినీ విడువను.

నారదుడు - 'ఇంతవరకు నన్ను జయించేవాడు దొరకలేదు. మేమైతే శివదేవుని కూడా చిత్తు చేశాము. నీవొక లెఖ్ఖా! మేము భగవంతుడిని కూడా చిత్తు చేయగలము.' అనగా కామదేవుని ఈ అహంకార పూరితమైన మాటలను విని నారదమహర్షి సహించలేకపోయాడు. విష్ణుమూర్తి దగ్గరికి వెళ్ళి అన్నాడు. 'ప్రభూ! నేనెవ్వరి గర్వాన్నీ నిలువనీయను' అని మీరంటారు కదా. ఇది విని భగవంతుడు 'విషయమేమిటి?' అని అడిగాడు.

నారదుడు చెప్పాడు - 'ఇప్పుడు మన్మథునికి చాలా గర్వమేర్పడింది. నన్ను జయించేవాడు ప్రపంచంలో ఎవడూ లేడు ఎందుకంటే నేను పరమశివుణ్ణి చిత్తుచేశాను. భగవంతుని కూడా చిత్తు చేయగలను' అని అంటాడు.

భగవంతుడన్నాడు - సరే నారదా! నీవు వెళ్ళు. వెళ్ళి విష్ణు భగవానుడు, 'నేను నిన్ను జయిస్తానని అన్నాడని చెప్పు.' ఎలాంటి యుద్ధాన్ని కోరతావు. మైదానమా? కోటనా? కోటలో యుద్ధమంటే ఎవరైనా వనంలోకి గానీ, గుహలోకి గానీ వెళ్ళి ఆజన్మ బ్రహ్మచర్యాన్ని పాలిస్తే అది కోటలో యుద్ధము. మైదానంలో యుద్ధమంటే స్త్రీలమధ్యలో వుంటూ మన్మథుని జయించడం. నారదుడు 'సరే.' అని మన్మథునికి వెళ్ళి చెప్పాడు. నారదుని మాట విని మన్మథుడు 'నన్ను కోటలోని యుద్ధంలోనే జయించలేరు ఇక మైదానంలో

ఎవరు జయించగలరు?' అన్నాడు. నారదుడా మాటను భగవంతుని చెప్పాడు.

భగవంతుడన్నాడు. నారదా, వెళ్ళు. కృష్ణావతారంలో నేను అతడితో మైదాన యుద్ధంలో పోరాడతానని, జయిస్తానని మన్మథునికి చెప్పు. అతనిని అప్రమత్తంగా వుండమని చెప్పు. భగవంతుడు ఈ మాట చెప్పి మన్మథుడిని అప్రమత్తం చేశాడు. తరువాత అవతరించాడు. అవతరించి పదహారువేల నూట ఎనిమిది మందిని రాణులుగా వివాహమాడాడు. వారందరి ద్వారా లక్షలకొలది పుత్రులు జన్మించారని, గోపికలతో ప్రేమ వ్యవహారం చాలా నడిపాడని చెప్తారు. దీంట్లో స్వకీయము, పరకీయము అను రెండు మాటలూ కనిపిస్తాయి. రుక్మిణి మొదలైనవారి మాధుర్య ప్రేమ స్వకీయము. గోపికల మాధుర్యప్రేమ పరకీయము. వారు ఇతరుల భార్యలైనా వారికి భగవంతుడు తమ సఖుడనే భావముండెను. వారి మధ్యగల సఖ్యభావము ఇరువురు పురుషుల మధ్యన వుండే ప్రేమలాంటిది. భగవంతుడు తన ధర్మపత్నులతో కలిసి వుండేవాడు. అష్టమహిషులలో రుక్మిణీదేవి ప్రధానమైనది; అష్టసఖులలో ముఖ్యమైనది రాధిక. ఇంకనూ వేలకొలది గోపికిలు, వేలకొది రాణులు వుండినారు. భగవంతుడు ఇతరుల భార్యలతో వుంటూ కూడా పవిత్రతను ఋజువుచేసి చూపాడు. మన్మథుని మదాన్ని ఒక్కసారిగా నుగ్గు చేశాడు. ఇలాగే తన భార్యాలతో వున్నప్పుడూ జనకునిలాంటి జ్ఞానులు మహాత్ములు తమ భార్యలతో వుంటూ కూడా నిర్లిప్తంగా వున్నట్లు వుండేవాడు. ఇది మైదాన మన్మథయుద్ధం.

స్వయంగా భగవంతుడే తన పరికరాలతో కలిసి అవతరించాడు. ఎందుకంటే మన్మథుని మదాన్ని నుగ్గు చేయాలి కదా. ఆ ఉద్దేశంతో భగవతుడవతరించాడు. అదిప్రేమావతారమైంది. ప్రేమమూర్తి, అందరూ ప్రేమమూర్తులే. భగవంతుని ధ్యేయమేమంటే - నీతియుక్తముగా, ధర్మయుక్తముగా, శాస్త్రయుక్తముగా, శుద్ధమైనవిగా, పవిత్రవంతముగా తానుచేయవలసిన లీలలన్నీ వుండాలి. ప్రేమను చాలా పెంచాలి.

ప్రేమను పెంచడానికే భగవంతుడు బ్రహ్మదేవునిపైన తెరను వేసి అతని బుద్ధిని మభ్యపఅచినాడు. బ్రహ్మదేవుడు గొల్లపిల్లలను, దూడలను దొంగిలించి తీసికొనివెళ్ళాడు. తరువాత భగవంతుడే అనేక రూపాలను ధరించాడు. అలా అనేక రూపాలను ధరించి భగవంతుడు ఆ సమయంలో

ఎలాంటి ప్రేమను ప్రవహింపజేశాడంటే పశువులలో కూడా ప్రేమ ప్రవహించసాగింది. మనుషులలోనే కాదు చెట్లలోకూడా. చెట్లలో ఎలా అంటే ఋతువు కాకున్నా ఫలించడము, భగవంతుని చూసి రసాన్ని ప్రవహింపజేయడం. ఆవులు కూడా తమ దూడలుగా మారిన భగవంతునికి పాలను త్రాగించునంత వరకు ప్రేమను చూపించాడు.

దీనిలో ఆశ్చర్యపడేదేమీ లేదు. ఎందుకంటే భగవంతుడు ప్రేమమూర్తి. భగవంతుని వల్ల గోవులలో కూడా ప్రేమ ప్రాదుర్భవిస్తే దానిలో ఆశ్చర్పడాల్సిందేమీ లేదు. కానీ ఒక సంవత్సరం దూడలను, రెండు సంవత్సరాల దూడలను, నాలుగు సంవత్సరాల దూడలను అంతేకాదుపాలు తాగడం మానిన వాటితో కూడా ఆవులు ప్రేమనుచూపాయి. దీన్ని చూసి బలరామునికి చాలా ఆశ్చర్యమై ఇలా అన్నాడు. ఇది అప్రాకృతమైన విషయము. ప్రకృతికి సహజమునకు దూరమైన విషయము - న్యాయానికి ఇలా జరగకూడదు. స్వభావ ప్రకారం ఇలా జరుగరాదు. విషయమేమిటి? అని ఆలోచించసాగాడు. గోపాలకులను చూసినప్పుడు, వాళ్ళ పిల్లవాడు ఏదైనా తప్పు చేస్తే కొట్టడానికి వెళ్తాడు. కాని దగ్గరికి వెళ్తే పిల్లవాడు నవ్వుతాడు. అపుడు గోపాలకుడూ నవ్వుతాడు. అది చూసిన వారికీ నవ్వు వస్తుంది. కోపమంతా దూరంగా పారిపోతుంది.

ఆ పిల్లవాణ్ణి తన ఎదకు హత్తుకుంటాడు. అక్కడ కోపభావము నశించి వాత్సల్యభావముగా మారుతుంది. ఇలాంటి వ్యవహారాన్ని చూసి బలరాముడు శ్రద్ధగా గమనిస్తే - అక్కడవున్న గోపాలకుడు, ఆవుదూడలు అన్నీ కృష్ణుని లాగానే కనిపించసాగాయి. అపుడు విషయమేమిటని బలరాముడు భగవంతుడిని అడిగాడు. అపుడు బ్రహ్మ దేవుడు గోపాలకుల పిల్లలను, దూడలను దొంగిలించుకొని వెళ్తే తానే వారి రూపంలో లీలను చూపుతున్నాని భగవంతుడు మొత్తం తెలియజేశాడు. అపుడు అతనికి విషయమంతా అర్థమైంది.

భగవంతుడు అనేక రూపాలను ధరించి ఎలాంటి లీలను చూపాడంటే - అక్కడి గోపాలకులు, గోపికలు, దూడలు అన్నింటి రూపంలో తాను వుంటూ అందరిలో ప్రేమను జాగృతం చేశాడు. గోపాలకులతో శుద్ధప్రేమ, గోపికలతో శుద్ధ ప్రేమ, గోపాలకుల తల్లులతో శుద్ధప్రేమ, గోవులతో

కూడా శుద్ధప్రేమ. కొందరిపట్ల వాత్సల్యభావము యొక్క ప్రేమ, కొందరిపట్ల సఖ్యభావముతో ప్రేమ. గోపికలతో గోపాలకులతో సఖ్యభావప్రేమ, గోపాలకుల తల్లులతో, దూడలుగల ఆవులతో వాత్సల్యభావప్రేమ. ఈవిధంగా ఆ సమయంలో ప్రేమ ప్రవాహమే ప్రవహించింది. అది కట్టలు తెంచుకొని పొంగిపొరలి వచ్చినట్లుగా ఉన్నది. అపుడు భగవంతుని చేష్టలన్నీ ఆ ప్రేమికులను సంతోషపెట్టడానికి, ఆహ్లాదపరచడానికి, మోహింపజేయడానికి, ఇంకా ఎక్కువ ప్రేమను పెంచడానికి జరుగుచుండేవి. ఆ గోపికలకు కూడా భగవంతుడిని సంతోషపెట్టాలని, భగవంతునిలో తమ ప్రేమను పెంచాలని వున్నది. ఇలా ప్రేమ సాక్షాత్తుగా రూపాన్ని ధరించి నర్తించేది. ఇద్దరిదీ ఒకే లక్ష్యము. భగవంతునికి గోపికలు ప్రేమాస్పదులు, గోపికలకు భగవంతుడు ప్రేమాస్పదుడు. వాస్తవానికి ప్రేమాస్పదుడు, ప్రేమికుడు, ప్రేమ అనే మూడూ ధాతువు ప్రకారం ఒకటే. భగవంతుడు శ్రీకృష్ణుని రూపంలో అవతరించినపుడు అది ప్రేమావతారము. అపుడు గోపికలందరి కంటే ఎక్కువ రాధిక. రుక్మిణితో సమానమే కాదు రుక్మిణి కంటే ఎక్కువ రాధికనే. రుక్మిణి ఐశ్వర్యశక్తి యొక్క యజమానురాలు. అందరికీ ఐశ్వర్యాన్ని ప్రసాదించేది. రాధిక ప్రేమకు యజమానురాలు. అందరికీ ప్రేమను పంచుతుండేది. శ్రీరాధాదేవి ప్రేమ యొక్క అవతారము. ప్రేమయే రాధికగా రూపాన్ని దాల్చింది. ప్రేమయే శ్రీకృష్ణునిగా రూపుదాల్చింది. ఎలా అన్నా సరే సచ్చిదానంద ఘనుడు, పూర్ణబ్రహ్మ అయిన పరమాత్మయే సాక్షాత్తు శ్రీకృష్ణుడు, ఆ పరమాత్మ యొక్క ఆహ్లాదినీ శక్తియే రాధిక.

ఒకటి ఐశ్వర్య శక్తి, వేరొకటి ఆహ్లాదినీ శక్తి. దీనితో భగవంతుడు ప్రపంచాన్నంతా ఆహ్లాదింపజేస్తాడు, ముగ్ధులుగాచేస్తాడు. ఆనందాన్ని, ప్రేమను ప్రసాదిస్తాడు. ప్రపంచమునకు ఆనందాన్నిచ్చే వారికి ఆనందాన్ని, ప్రేమను ప్రసాదించే వారికి ప్రేమను ఇచ్చే శక్తి పేరే 'ఆహ్లాదినీశక్తి.' ఈవిధంగా రాధిక అవతారము ఆహ్లాదినీ శక్తి యొక్క అవతారము. అందుకనే అపుడు ప్రేమ రూపుదాల్చి నర్తించేది. ఈ కాలంలో ఆ ప్రేమ నీడ కూడా లేదు. అయినా కూడా ఆ విషయాన్ని దృష్టిలో వుంచుకొని మీ సమ్ముఖంలో చెప్పేదంతా సంపూర్ణమైనదని చెప్పలేము.

అసలు విషయం మన బుద్ధికి తోచదు (మనకు అర్థం కాదు)

ఎందుకంటే మన బుద్ధికి అంత శక్తిలేదు. తులసీదాసు గారు అన్నారు. భరతుడు, రాముడు కలిసినపుడు వారి కలయికను కవి యొక్క వాక్కు గానం చేయలేదు. నదీతీరంలో ఏపుగా పెరిగే రెల్లుగడ్డి చక్కని రాగాన్ని గానం చేయలేదు కదా! ప్రేమతత్త్వం నీడను కూడా తాకలేని వాక్కు దానిని చేరలేదు. విషయం నిజము. విశుద్ధప్రేమ, పూర్ణప్రేమ లేదా అనన్యప్రేమ అని దేన్నంటామో ఆ ప్రేమను గూర్చి ఒకరకంగా శబ్దాల ఉచ్చారణ వుంటుంది గానీ బుద్ధి దానిని తెలుసుకోలేదు. పరమాత్మ యొక్క ప్రేమ స్వరూపాన్ని లేదా ఇద్దరి అవతారాన్ని - భగవంతుడు సాక్షాత్తు సచ్చిదానంత ఘనమైన బ్రహ్మమని, రాధిక వారి ఆహ్లాదినీ శక్తి అని - మనవారి ప్రేమ విషయాన్ని గ్రహించడంలో చాలా అసమర్థమైనది బుద్ధి. ఒక కుండలో విశాలమైన సముద్రము పట్టనట్లుగా. కుండలో సముద్రాన్ని నింపగోరితే అది మూర్ఖత్వమే అవుతుంది. ఎందుకంటే సముద్రం కుండలో ఇముడలేదు. మన బుద్ధి కుండవంటిది కూడా కాదు. బుద్ధిలో స్ఫురించేది స్పష్టము కాదు. ఆ ప్రేమను ఆవిష్కరించడం ఎలాగూ చాలాదూరం - ఆ ప్రేమను ఏదైనా ఉదాహరణంతో విప్పి చెప్పడం కుదరదు, మనస్సు కూడా విప్పి చెప్పలేదు. ఏ దృష్టాంతాన్నైనా, ఉదాహరణాన్నైనా విప్పి చెప్పగల సామర్థ్యం మనస్సుకు లేదు. అర్థం చేసుకునే వ్యవహారమును మనస్సు దృష్టాంతము లేదా ఉదాహరణంతో బంధించలేదు. ఎంత దగ్గరగా వెళ్ళి ఎంతగా పోలికను చూపినా కానీ ఒక క్షణంలో, లేదా ఒక సెకండ్‌లో వచ్చే రూపక చిత్రాన్ని వర్ణించాలంటే గంటల సమయం పడుతుంది. మనస్సుకున్నంత శక్తి వాక్కుకు లేదు. చిత్రకారునికి భగవంతుని చిత్రపటాన్నిచ్చి ఆపాదమస్తకం - కాళ్ళు ఇలా వున్నాయి. చేతులిలా వున్నాయి - అని వివరిస్తే అతడు క్షణంలో కనురెప్పపాటులో చిత్రాన్నిచూస్తాడు. కానీ మాటలతో దానిని వివారించాలంటే ఎంత సమయం పడుతుంది? అనగా చాలా సమయం పడుతుంది. అది కూడా ఒక కాగితం బొమ్మ. అది ఎలా తెలియజెప్పుతుంది. ఇదేమో అలౌకికము. ఈ విషయంలో మనమేం చెయ్యాలి? అన్న ప్రశ్న తలెత్తుంది.

మనం చెయ్యాల్సిందిదే, శ్రీకృష్ణచంద్రుని స్వరూపము లేదా ఎవరికి ఎవరు ఇష్టదైవమో శివుడైనా, శ్రీరాముడైనా, విష్ణువైనా - ఈ విషయంలో భేదం లేదు. అందుకే సందర్భవశాత్తు శ్రీకృష్ణుని గూర్చి చెప్పాము.

శ్రీరామచంద్రుని స్వరూపముంది కదా! లోకంలో శ్రీరామచంద్రుని చిత్రాలలో అత్యుత్తమమైనది మనకు లభిస్తే మన బుద్ధి వెళ్ళేంత వరకు బుద్ధితో గొప్ప చిత్రాన్ని వూహించి దాని ఆధారంగా భగవంతుని స్వరూపాన్ని చూడాలి. ఆధారంగా చూడాలి అనడంలోని తాత్పర్యమేమంటే ఆ చిత్రాన్ని కాక ఆ చిత్రం ద్వారా శ్రీకృష్ణుని స్వరూపాన్ని చూడాలి. ఎందుకంటే ఆ చిత్రము జడము, భగవంతుడేమో చేతనము.

ఉదాహరణకు ఇది నా శరీరము దానిలోపల ఆత్మ వుంది కదా! ఇలాగే చిత్రానికి, నాకు మధ్య తేడా వుంది. ఎందుకంటే నేను మాట్లాడుతాను. చైతన్యంతో కదులుతాను, కళ్ళతో సైగలతో తెలియజేయగలను, కానీ నా చిత్రము ఎలా మాట్లాడగలదు? దాంట్లో హావభావాలు ఇతర చేష్టలు ఏవీ లేవు. నాకు దానికీ మధ్య నున్న తేడా లాగే భగవంతునికి అతని చిత్రానికి మధ్యన ఉన్న తేడా ఇంతే కాదు ఇంతకంటే చాలా ఎక్కువ.

భగవంతునికి అతని చిత్రానికి మధ్య నున్న తేడా ఎక్కువ ఎందుకు? భగవంతుని నిజమైన చిత్రాన్ని చిత్రించారనే అనుకోండి. దానిలో ఆకారము వచ్చింది కానీ భగవంతుని హావభావాలు, గుణాలు మొదలైనవి ఎలా వస్తాయి? అవి రాలేవు - నా చిత్రాన్నైతే మీరు ఈ శరీరం ద్వారా చిత్రించగలరు కానీ మీకు లభించే భగవంతుని చిత్రాన్ని కెమెరా ద్వారా భగవంతుని మంగళరూపాన్ని తీసుకొని చిత్రించింది కాదు. ఎంత తేడా వుంది? ఇక ఈ విషయంలో మనకు సహాయమవసరమైతే అపుడు చిత్రము యొక్క సహాయాన్ని తీసుకోవచ్చు. ఆ చిత్రంలో లేని హావభావాలు, కటాక్షాలు, ప్రేమ, గుణాలు మొదలైన వాటికోసం మహాత్ముల మాటలు, శాస్త్రాలు మనకాధారం. వాటి నుండి తీసికొని ఆ చిత్రంలో కూర్చుకోవాలి. భగవంతుని స్వరూపమిలా వుంది. దీనిలో ఇంకా కూడా విలక్షణత వుంది. నా శరీరము దానిలో ఆత్మ వుంది కదా! నా శరీరము చేతనమెలాగూ కాదు, దానిలోని ఆత్మ మాత్రము చేతనము. శరీరము క్షేత్రము, జీవాత్మ క్షేత్రజ్ఞుడు. కానీ భగవంతుని శరీరము కూడా చేతనము. అతని శరీరమే కాదు ఆ శరీరంపైని ఆయుధాలు, వస్త్రము, నగలు, మాల మొదలైనవేవి ఉన్నాయో అవన్నీ చేతనాలే. అందుకే వానిలో చాలా తేడా వుంది. ఈ విషయాన్నంతా ఆ చిత్రంలో వున్నట్లు మనసారా అంగీకరించి ఆ

స్వరూపాన్ని చూడాలి, చూస్తూనే వుండాలి.

ఇలా అంగీకరించాలని మీరు అంటున్నారు కానీ ఇలాంటి అంగీకారాన్ని మేము మాలో పూర్ణంగా ఎలా పొందాలని అంటారేమో, ప్రారంభంలో దీనికోసం ఇలా వుండాలి. కళ్ళతో చిత్రాన్ని చూసినపుడు దానిపై నుండి కళ్ళను తిప్పగల శక్తి వాటికి వుండకూడదు. ఒకవేళ భగవంతుడే కళ్ళకు మరుగునపడి అంతర్ధానమవుతే ఉపాయమేమిటి? కానీ మన కళ్ళను తిప్పుకోగల శక్తి మనకు వుండకూడదు. రెండవ విషయమేమంటే - కనురెప్ప కూడా మూయకూడదు. తదేకంగా చూడాలి. మూడవ విషయమేమంటే - మనము భగవంతుడిని చూస్తున్నాము. భగవంతుడు మనలను చూస్తున్నాడని భావించాలి. పరస్పరము దృష్టిపాతము వుండాలి. ఆ దృష్టిపాతంలో ఆదాన ప్రదానమేదుందో అది ప్రేమయే. ప్రేమకు ఏ ఆకారమూ వుండదు. అది ప్రేమ మాత్రమే. అట్టి చూపుల ద్వారా ప్రేమ స్థిరమైనపుడు మన కళ్ళు భగవంతునివైపు, భగవంతుడు వాటివైపుగానై అచంచలస్థితి కలుగుతుంది. అపుడు శరీరంలో ప్రసన్నత, హృదయంలో ప్రఫుల్లత, కళ్ళలో సంతోషము, గగుర్పాటు మొదలైన చిహ్నాలు ఒక్కసారిగా కనిపిస్తాయి. భగవంతుడు పరమధామం నుండి అన్నింటికంటే ముందు ఏతెంచినట్లుగా వుంటుంది. ప్రారంభంలో భగవంతుడు వచ్చాడన్న ఆభాస కలిగితే, భగవంతుని కాళ్ళపై సాష్టాంగ ప్రణామాన్ని చేస్తున్నట్లు దానికి బదులుగా భగవంతుడు మనలను పైకి లేపి ఎదకు చేర్చుకుంటున్నట్లు భావించాలి. భరతుడు చిత్రకూటానికి వెళ్ళి శ్రీరామచంద్రుని పాదాలపై పడగా అతడిని పైకిలేపి, శ్రీరామచంద్రుడు అక్కున చేర్చుకున్నట్లు, మనం శ్రీకృష్ణ భగవానుని పాదాలపై పడగా భగవంతుడు మనలను పైకి లేపి ఎదకు చేర్చుకున్నట్లు భావించాలి. మనం భగవంతుని పాదాలను స్పృశించగా భగవంతుడు మనలను కౌగిలించుకున్నాడని భావించాలి. స్పర్శ తరువాత పరస్పర సంభాషణ జరిగినట్లు భావించాలి. సంభాషణ సమయంలో ఆ ఆశ్చర్యాన్ని చూసి "సోదరా! ఎక్కడి నేను? ఎక్కడి భగవంతుడు? ఎంత ఆశ్చర్యాన్ని కలిగించే విషయం? భగవంతుని కృపను, ప్రేమను, దయను - వీటిని చూసి ఆశ్చర్యంతో పాటు ప్రసన్నత, ఆనందపారవశ్యం కలగాలి. కొద్దిసేపు పరస్పర సంభాషణలో మాటలు పెకలవు. తరువాత ధైర్యాన్ని పూని మాట్లాడాలి.

అది సుతీక్షణ మహానుభావుని అవస్థ లాంటిది. ఆ మహానుభావుడు భగవంతుడిని చూసి ముగ్ధుడై కాళ్ళపైపడి కొంతసేపు ఏమీ మాట్లాడలేకపోయాడు. ఆ తరువాత భగవంతుని స్తుతించాడు. ఈ విధంగా సాధనావస్థలో భగవంతుడిని స్తుతించాడు. ఆ తరువాత భగవంతుని సంభాషించాడు. మనం మాట్లాడుకున్నట్లే భగవంతునితో సంభాషణ. ఈ అవస్థలో భగవంతునితో స్వయంగా అడగాలి. మీ దర్శనం సులభమెలా అయింది? అని. భగవంతుడంటాడు. ప్రేమవల్ల మళ్ళీ అడగాలి. 'ప్రేమ సులభమెలా అయింది? అంటే భగవంతుడంటాడు. శ్రద్ధవల్ల అని. ఈ విధంగా మనస్సులో వచ్చిన దల్లా మాట్లాడాలి. ఆ సమయంలో ఏది స్ఫురిస్తుందో ఏ మాటలను భావిస్తామో దానికి ఆ విధంగా భగవంతుడు తన మంగళస్వరూపంతో సమాధానమిస్తున్నాడని భావించాలి. భగవంతుని పెదాలు కదులుతున్నాయి. మాట్లాడుతున్నారు, సమాధానమిస్తున్నారు మనము వాటిని వింటున్నామనుకోవాలి. వింటున్న వాళ్ళు కూడా ఈ స్థూలశరీరంతో వినడం లేదు. తన శరీరమూ భగవంతుని శరీరము కూడా మానసికమే, ఇద్దరి దర్శనము, సంభాషణము, వార్తాలాపము అంతా మనస్సు ద్వారానే అవుతుంది.

ఈ విధమైన దర్శనము, భాషణము, వార్తాలాపము, చింతన అంతా అలౌకికము. భగవంతుని నుండి వచ్చే సువాసన కూడా అలౌకికము. ఆ సువాసన నాసేంద్రియానికి అమృతం వంటిది. భగవంతుని దర్శనము కళ్ళకు అమృతం లాంటిది. భగవంతుని స్పర్శ చేతులకు, శరీరానికి అమృతం వంటిది. అతని మాట చెవులకు అమృతం వంటిది. ఇంద్రియాలకు భగవంతుని - దర్శనము, స్పర్శ, భాషణము, వార్తాలాపము, సుగంధము అంతా అమృతం వంటిది. ఈ విధంగా మానసికంగా దర్శనము, ధ్యానము ప్రతిదినమూ చేయాలి, రోజుకు ఒకమారు, రెండుమార్లు, ఐదుమార్లు - మనసులోకి వచ్చినప్పుడల్లా చెయ్యాలి. ఇలా చేస్తూ పోగా మొదట ఇది మానసికమైనా, భావనయైనా, సంకల్పమైనా భావనగా వుంటూ అది దృఢమై ఇక భావనగా వుండక - ప్రత్యక్షంలాగా 'అకల్పిత విషయము' అయిపోతుంది.

**నారాయణ! నారాయణ!! నారాయణ!!!**



# 10. అంతులేని భగవంతునిదయ

భగవంతుని దయను గూర్చిన ఈ కథలో విశేషమైన రహస్యమున్నది - ఒక మహాత్ముడైన సన్యాసి వుండేవాడు. ఆయన ఒకమారు ఒక గృహస్థుని ఇంటికి భిక్షకోసం వెళ్ళాడు. ఆ గృహస్థుని ఇంటి గుమ్మం దగ్గర కేకవేశాడు. 'నారాయణ హరి.' గృహస్థుడు ఇంటిలో వున్నాడు. అతడు బయటకు వచ్చి చేతులు జోడించి సన్యాసి కాళ్ళపై బడి ఏడవసాగాడు. అపుడా మహాత్ముడడిగాడు. 'ఎందుకు ఏడుస్తున్నావు?' గృహస్థుడు చెప్పాడు - 'మహానుభావా! ప్రపంచంలో నా అంతటి దుఃఖితుడు, దరిద్రుడు లేడు. నేను ఎంతో దుఃఖితుడిని, దరిద్రుడిని. మీకేం చెప్పను?''

నా దుఃఖానికి కారణమేమంటే - మీరు మా యింటికి వచ్చారు 'నారాయణ హరి' అని భిక్షకోసం ప్రేరేపించారు, కానీ 'స్వామీ! నేనేం చెప్పను? మా ఇంటివాళ్ళు మూడు రోజుల నుండి పస్తులున్నారు. తినడానికి ఇంటిలో అన్నం మెతుకు కూడా లేదు. నగరంలోని ప్రజలు చాలా సహాయం చేశారు. డబ్బు అప్పిచ్చారు కూడా. ఇచ్చేవాళ్ళు ఎంత ఇచ్చినా మేమంతా మూడు రోజులుగా పస్తులున్నాము. మావంటి దరిద్రులు, అనాథలు, ఆకలిగొన్నవాళ్ళు వేరొకరు లేరు. అనగా ఆ మహాత్ముడన్నాడు. నీవంటి ధనికుడు లోకంలో ఎవరూ లేరు. నీవు తలచుకుంటే అందరినీ ధనవంతులను చేయగలవు. నిరుపేదను కూడ ధనికునిగా చేయగలవు, దరిద్రుని దారిద్ర్యాన్ని కూడా తొలగించి వానిని ఒక్కసారిగా ధనికునిగా చేయగలవు. ఇలాంటిది నీ సామర్థ్యము.'

అనగా ఆ గృహస్థుడన్నాడు - 'స్వామీ! నాకు ఏ సామర్థ్యం లేదు, చలాకీతనమూ లేదు. నా దగ్గర ధనము లేదు. మీరేమంటున్నారు? నాకు అర్థం కావడం లేదు. నాలాంటి ధనికుడు లేడని మీరంటారు. నాలాంటి దరిద్రుడు లేడని నేననుకుంటాను, అనాథుడు లేడనుకుంటాను. మీరు పూర్తి విరుద్ధమైనదాన్ని చెప్తున్నారు.' అనగా మహాత్ముడన్నాడు - 'చూడు, నీ ఇంట్లో ఇవి ఏమిటి?' అనగా గృహస్థుడు 'రాయి' అన్నాడు. దానిని పైకెత్తి మహాత్ముడన్నాడు. 'ఇది ఏమిటి?' అంటే గృహస్థుడు 'ఇది రాయి'

అన్నాడు. మహాత్ముడన్నాడు, 'దీనిని మేము శిలగా భావించుము' అంటే గృహస్థుడన్నాడు, మీరు భావించినా, భావించకపోయినా సరే. మీరు కోరితే నేను వేలకొద్ది మనుషుల చేత 'ఇది రాయి' అని చెప్పిస్తాను.

మహాత్ముడన్నాడు - వేలకొద్ది మనుషుల మాటను వినిపించాలా ప్రత్యక్షంగా నాకు కనిపిస్తున్న దానిని ఒప్పుకోవాలా? అంటే గృహస్థుడు 'స్వామీ! మీకు వేరొకటి కనిపిస్తుందా? రాయి కనిపించడం లేదా?' అన్నాడు. దానికి మహాత్ముడన్నాడు - 'లేదు, నాకైతే వేరొకటే కనిపిస్తుంది. దానికి ఆ గృహస్థుడిలా అన్నాడు. 'నేనేం చేయను? దీంట్లో మీ దృష్టిదోషముంది.' అంటే మహాత్ముడన్నాడు - 'మా దృష్టిదోషము కాదు. మీ దృష్టిదోషమే. నీవెప్పుడైనా దాని ప్రభావాన్ని గూర్చి విన్నాను.' అనగా మహాత్ముడన్నాడు, 'ఏమని విన్నావు?' గృహస్థుడు చెప్పాడు, 'ఇనుముకు పరుసవేది (స్పర్శవేధి) రాయిని తాకిస్తే ఇనుము బంగారమవుతుందని విన్నాను.' మహాత్ముడన్నాడు, 'ఇది అదే. నీ ఇంట్లో ఏమైనా ఇనుపపాత్రలు వున్నాయా?' అంటే గృహస్థుడన్నాడు, 'వున్నాయి స్వామీ! చట్రం, బాణలి, గిన్నె, కుంపటి, అట్లకాడ, స్వామీ! నేనా గృహస్థుడిని. ఇలాంటి ఇనుప గిన్నెలు పడివున్నాయి'. అంటే మహాత్ముడన్నాడు, 'సరే, తీసుకురా, ఇనుమును' అన్నాడు.

గృహస్థుడు ఇనుప సామానులను తెచ్చాడు. మహాత్ముడు వాటిని తాకుతూ వెళ్ళాడు అదంతా బంగారమవుతూ వచ్చింది. మహాత్ముడన్నాడు - 'ఇపుడు చెప్పు ఇది రాయా! స్పర్శవేదా?' అనగా గృహస్థుడన్నాడు. 'స్వామీ! ఇదైతే ప్రత్యక్షంగా స్పర్శవేధి'. అనగా మహాత్ముడన్నాడు. 'ఎవరైనా నీతో ఇది రాయి అంటే ఒప్పుకుంటావా?' అంటే గృహస్థుడన్నాడు. 'ఒప్పుకోను'. అంటే మహాత్ముడన్నాడు 'ఇపుడు చెప్పు నీతో సమానమైన ధనికుడు వున్నాడా?'గృహస్థుడన్నాడు 'అవును స్వామీ! లేడు.' మహాత్ముడన్నాడు 'నీవు కోరుకుంటే వేలకొలది వ్యక్తులను ధనికులుగా చెయ్యగలవు. లక్షాధికారులనుగా చేయగలవు. ఈ రాయి నీ ఇంటిలోనే పడివుందా? ఎక్కడి నుండైనా వచ్చిందా?' అనగా గృహస్థుడన్నాడు. 'స్వామీ! బయటినుండి రాలేదు. ఈ రాయి అయితే మా ఇంటిలోనే వుంది. మాకు తెలియదు. అందుకనే దుఃఖపడుతూ వున్నాము'.

ఇదే భగవంతుడి దయ. భగవంతుడు అతడి దయ మొదటినుండీ వున్నాయి, ఆ గృహస్థుని ఇంటిలో ఆ రాయి మొదటి నుండీ వుంది. కానీ మనము భగవంతుని దయను దయగా ఒప్పుకోము. అందుకే భ్రమించి తిరుగుతూ వుంటాము.

ఆ గృహస్థుడు రొట్టెల కోసం తిరుగుతుండేవాడు. మనము సంసారము యొక్క విషయభోగాల కోసం చచ్చీచెడీ తిరుగుతూ వుంటాము. ఎందుకంటే భగవంతుని దయ మనపై వున్నదని ఒప్పుకోము. భగవంతుని దయ ఎలాగూ వుంది. మీరు ఒప్పుకున్నా వుంది, ఒప్పుకోకున్నా వుంది. ఒప్పుకుంటే మనిషి దాన్ని తెలుసుకుంటాడు. అలా ప్రాప్తిస్తుంది. మొదట భగవంతునిది అపారమైన దయ అని ఒప్పుకోవాలి. దయగా తెలిసి ఒప్పుకుంటే చాలా వరకు పనులు సఫలమవుతాయి. ఒప్పుకున్న తరువాత ఆ జ్ఞానము తనకుతానే కలిగితే అప్పుడూ అపారమైన ఆనందం కలుగుతుంది.

కొందరు వ్యక్తులు ఒక వూరి నుండి వేరొక ఊరికి వెళుతున్నారు. ఉన్నట్టుండి పెద్ద వర్షం వచ్చింది. మేఘాలు చాలా దట్టంగా కమ్ముకున్నాయి. అడవి లాంటి ప్రాంతంలో తలదాచుకోవడానికి ఒక పెద్దమనిషి ధర్మశాలనొకటి కట్టించాడు. ఈ వర్షం నుండి తప్పించుకోవడానికి ఆ వ్యక్తులందరూ ధర్మశాలలోకి వెళ్ళారు. ఆ ధర్మశాలలో చాలా గదులున్నాయి. ఆ గదులలో కూర్చున్నారు. కానీ చీకటి వుంది. గదుల్లోకి జల్లు కొట్టసాగింది. చల్లగాలి వీచసాగింది. అందరూ కొంకర్లు తిరిగిపోతున్నారు, కానీ ఒక్క గది మాత్రమే వేడిగా వుండింది. అక్కడ వారికి అంతగా చలి అనిపించలేదు. వారు అనుకున్నారు. 'ఇక్కడికి వేడి ఎలా వచ్చింది'. అని. ఆ గదిలో ఒక మూల రగులుతున్న నిప్పు కనికలు పడివున్నాయి. వాటిపైన బూడిద వచ్చింది. బూడిదతో కప్పబడినందువల్ల ఆ నిప్పు కణికలు ఎవరికీ కనబడలేదు. కానీ గది మాత్రం వేడిగా వున్నది. గది వేడిగా ఎందుకు వున్నదని అందరూ వెదకసాగారు, మిగిలిన గదులన్నీ చల్లగా వున్నాయి కానీ ఇది ఒక్కటే వేడిగా వున్నదెందుకని అందరూ అనుకోసాగారు. దేనికైనా కారణము వుండాలి. వెదకగా వెదకగా బూడిదతో కప్పబడిన అగ్ని దొరికింది. అక్కడ చాలా కట్టెలు పడివున్నాయి. వంట చెరకుకు కొరతలేదు. ఆ వ్యక్తులు వంట చెరకును మండించసాగినారు. దానితో అగ్ని ఏర్పడింది.

ప్రజలు పరుగున వచ్చారు. ఎవరో అన్నారు. 'కొద్దిగా నిప్పును నాకు కూడా ఇవ్వు సోదరా!' అని. ప్రజలడిగారు 'ఏం చేస్తావు?' దాని కతడన్నాడు, 'వంట చేద్దాం. దీపం వెలిగించి వెలుతురును కలిగిద్దాం' అనగా కొందరు పెద్ద మనుషులు వచ్చి అన్నారు. 'సోదరా! మాకూ కొంత నిప్పును ఇవ్వండి'. అనగా ఆ వ్యక్తులడిగారు 'మీరేం చేస్తారు?' అని. దానికి ఆ వ్యక్తులన్నారు, 'మేము అగ్నిహోత్రి బ్రాహ్మణులము. పుత్రుల కోసం యజ్ఞాలను చేస్తాము. దానికోసం మాకు నిప్పు కావాలి?' అంటే ఆ వ్యక్తులన్నారు, 'తీసుకొని వెళ్ళండి' అని.

ఆ తరువాత ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. తనకూ నిప్పు కావాలన్నాడు. మీరేం చేస్తారని అడిగితే అతడు తన శ్రేయస్సు కోసం అగ్నిహోత్రాన్నను ష్ఠిస్తానని చెప్పాడు. నిష్కామభావనతో అగ్నిహోత్రాన్ననుష్ఠించే వ్యక్తి మనస్సు శుద్ధమవుతుంది. పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. ఆ తరువాత ఆ వ్యక్తులతనికి కూడా అగ్నిని ఇచ్చారు. అలా అందరూ తాము కోరిన పనిని చేయసాగారు.

దీని నుండి ఆలోచించాల్సినదేమంటే అగ్నిజ్ఞానం లేనప్పుడు కూడా గది వేడిగా వుంది. ఈ మాత్రం లాభం అగ్నిజ్ఞానం లేనప్పుడు కూడా కలిగేది. అగ్ని వున్నదని తెలియనపుడు కూడా ప్రజలకు వేడి లభించింది. గదిలో అగ్ని వున్నదని తెలిసినపుడు అందరూ దాని లాభాన్ని పొందినారు.

కొందరు అగ్ని ఒక దేవత అని భావిస్తారు. మరికొందరు అగ్ని ఒక జడపదార్థమని అనుకొంటారు. అగ్నిలో రెండు శక్తులున్నాయి. ఒకటి మండించే శక్తి, మరొకటి వెలిగించే శక్తి. సూర్యుడిలో కూడా రెండు శక్తులున్నాయి. మండించే శక్తి, వెలిగించే శక్తి. చంద్రునిలో మాత్రం వెలుగునిచ్చే శక్తి మాత్రమే ఉంది. మండించే శక్తి లేదు. ఎందుకంటే అది చల్లనిది. అగ్నిలో రెండు శక్తులూ ఉన్నాయి.

అగ్ని ఒక దేవత అన్న శ్రద్ధ ఉన్నవాళ్ళు అధ్యాత్మ విషయంలోను లాభాన్ని పొందినారు. కోరినదాని సిద్ధిని పొందినారు. కామనతో అగ్నిహోత్రాన్ని చేసేవారు పుత్ర విషయక లాభాన్ని పొందారు. ఉత్తమస్థాయి మహాత్ములు కాగోరిన బ్రాహ్మణులు ఆ అగ్నిలో నిష్కామ భావనతో హవనాన్ని చేసి ఆత్మశుద్ధిని పొందే లాభాన్ని పొందినారు.

ఈ విధంగా ఈ విషయాలను మహాత్ములు, ఈశ్వరుడు, గంగ అందరి విషయంలో అన్వయించుకోవచ్చు. మహాత్ములు నివసించే చోట ప్రజలకు దాని గూర్చి తెలిసినా తెలియకపోయినా లాభం స్వాభావికంగానే కలుగుతుంది.

యుధిష్ఠిర మహారాజు విరాట నగరంలో నివసించేప్పుడు భీష్మపితామహుడు కౌరవుల సభలో ఇలా అన్నాడు. యుధిష్ఠిరుడెక్కడ వుంటే అక్కడ కరువు కాటకము వుండదు అని. అక్కడ ఏ మహామారీ రాదు. ఉత్పాతాలు కలుగవు. అక్కడి ప్రజలు ధర్మాత్ములవుతారు. సత్యమును పలికేవారవుతారు. అక్కడ ధనధాన్యము, ధర్మము వర్థిల్లుతుంది. ఇలా భీష్ముడు చాలా విషయాలను చెప్పాడు. ఇది విని దూతలు ఇదంతా విరాట నగరంలో లభిస్తుందని చెప్పారు. దీని ఆధారంగా దుర్యోధనుడు విరాట నగరం పైకి దండయాత్రను చేశాడు.

యుధిష్ఠిర మహారాజు ప్రభావమెంతో గమనించాలి. ఆయన ఏ దేశంలో నివసిస్తే అక్కడ ధనధాన్యాలు, ధర్మము వర్థిల్లుతాయి. అక్కడ కరువు కాటకము, మహామారి దాపురించవు. విరాటనగరంలో ఆయన సంవత్సరమంతా వున్నాడు. కానీ యుధిష్ఠిరునిలో ఈ గుణాలు వున్నాయని ఎవరూ గమనించలేదు. అయినా కూడా విరాటరాజు, అతని ప్రజలు యుధిష్ఠిరుడక్కడ వున్నదాని లాభాన్ని పొందారు. తన దగ్గర వున్నది పాండవులు అని తెలిసిన తరువాత విరాటరాజు ఎక్కువ లాభాన్ని పొందినాడు. అతడు ధర్మరాజుతో అన్నాడు, 'నా కూతురైన ఉత్తరను అర్జునునికిచ్చి వివాహం చేస్తాను.' కానీ అర్జునుడు 'లేదు! నా కుమారుడు అభిమన్యుడున్నాడు. ఉత్తర వివాహమతనితో చెయ్యవచ్చు. ఎందుకంటే నేను ఉత్తరకు విద్యనేర్పినాను. కాబట్టి ఈమె నా కూతురు లాంటిది,' అన్నాడు. విరాటరాజు ఉత్తరను అభిమన్యునికిచ్చి వివాహం చేశాడు.

ఈ విధంగా, ఎక్కడైనా ఎవరైనా మహాత్ముడు వుంటే అతను వున్నదాని సహజమైన లాభము ఎలాగూ (తప్పక) లభిస్తుంది. అది తెలిసినా తెలియక పోయినా సరే. మహాత్ముడిని మహాత్ముడని తెలియడంలో అంగీకరించడంలో విశేషమైన లాభముంది. తెలియడం పట్ల ఆ మహాత్ముని పట్ల శ్రద్ధ కలుగుతుంది. ఈ శ్రద్ధ సకామమైనా, లాభం కలుగుతుంది. నిష్కామమైతే

ఎక్కువ లాభం కలుగుతుంది. ఈశ్వరుని భక్తిలో కూడా ఇంతే. ఈశ్వరుని పట్ల భక్తియొక్క ప్రభావాన్ని తెలియకుండా భక్తిని చూపినా దాని ద్వారా అతనికి లాభం కలుగుతుంది. అజామిళుడు తన కుమారునికి 'నారాయణుడు' అని పేరు పెట్టాడు. మరణ సమయంలో యమదూతలు తనను తీసుకుపోవడానికి వచ్చినపుడు అతడు తన కుమారుని పేరును స్మరించాడు. 'నారాయణ! నారాయణ!' అని స్మరించాడు. తన కుమారుడిని పిలుస్తున్నానని అజామిళుడనుకున్నాడు. భగవంతుని పేరే తన కుమారుని పేరని, దానిని ఉచ్చరించడం వల్ల పాపాలన్నీ నశిస్తాయని, పాపాలు నశిస్తే యముని దగ్గరికి వెళ్ళనని అతనికి తెలియదు. అతనికి ఆ జ్ఞానం లేదు. భగవంతుని పార్షదులు వచ్చినపుడు అతనికది తెలిసింది. భగవంతుని పార్షదులు యమదూతలను తరిమికొట్టారు, అజామిళుడు రక్షింపబడ్డాడు. తరువాత అతడు హరిద్వారానికి వెళ్లి భగవంతుని భజించాడు. ఎందుకంటే ఆ భగవంతుని ప్రభావం వల్లనే అతనికి మేలు చేకూరింది.

తెలియకుండా భగవంతుని పట్ల భక్తిని చూపినా దాని లాభము ప్రత్యక్షంగా వుంటుందనీ తాత్పర్యము. ఇక భగవంతుడిని భగవంతుడని అంగీకరించి భక్తిని చూపితే ఇంకా ఎక్కువ లాభం కలుగుతుంది. భగవంతుని పట్ల జ్ఞానం కలిగితే భగవంతునిపై శ్రద్ధ కలుగుతుంది. దానితో ఇంకా ఎక్కువ లాభం చేకూరుతుంది. ఆ శ్రద్ధ నిష్కామమైతే దాని లాభానికి అంతమే వుండదు.

పైన చెప్పిన విషయాన్ని తెలుసుకొని భగవంతుని నామాన్ని నిరంతరమూ గుప్తరూపంలో జపించాలి. నేను జపిస్తున్నానని ఎవరికీ తెలియజేయరాదు. జపము కూడ ఒకే విధంగా, ఏకధారగా చెయ్యాలి. ధార తెగకూడదు. భగవంతుని నామజపాన్ని, అతని స్వరూపధ్యానాన్ని శివునివలె ఏకధాటిగా చెయ్యాలి.

భగవంతునికి చాలాపేర్లున్నాయి. వాటిలో తనకు దేనిపై ఎక్కువ భక్తి, శ్రద్ధ, విశ్వాసము వుంటాయో అదే అన్నిటిలో శ్రేష్ఠము. ముస్లింలకు అల్లా-ఖుదా అని, హిందువులకు ఓమ్, రామ, హరి, గోవింద, వాసుదేవ, నారాయణ మొదలైన భగవన్నామమేదైనా ఇలా తనకు

దేనిపై ఎక్కువ భక్తిశ్రద్ధలుంటాయో, దానినే నిరంతరము భక్తి శ్రద్ధలతో జపించాలి. భగవంతునిలో ప్రేమ కలగడానికి లేదా భగవంతుని పొందడానికి జపాన్ని చేస్తే అది నిష్కామముతో సమానము. ఏ కోరికనూ కోరకుంటే భగవంతుడు సమయమ వచ్చినపుడు తానే లభిస్తాడు. కాబట్టి భగవంతుడు ప్రాప్తించాలని కూడా కోరకూడదు. ఇలాంటి భజన చాలా విలువైనది.

భగవంతుని ఇలా ధ్యానించాలి - భగవంతుని రూప లావణ్యాలు అలౌకికమైనవి. లోకంలో అలాంటి రూపలావణ్యాలు లేనేలేవు. కోట్లకొలది మన్మథులతో పోల్చినా అలాంటి పోలిక భగవంతుని విషయంలో పొసగదు. అతడు అనుపముడు, అనుత్తముడు. అతనితో సమానమైన ఉత్తముడెవరూ లేరు. అతనిలో ఏ పోలికా సరిపోదు. అతనివంటి వస్తువేదీ లేదు కాబట్టి ఉపమానము లేదు. భగవంతుడెంత సుందరుడంటే ఎవరైనా అతని నిజస్వరూపం యొక్క అంశాన్ని చూస్తే చాలు. అతను తన్మయుడవుతాడు. సంసారాన్ని మరిచిపోతాడు, సంసారము యొక్క జ్ఞానాన్ని మరిచిపోతాడు. అలాగే తన గూర్చే తాను మరిచిపోతాడు. అతని ఆనందానికి ఏ హద్దూ వుండదు. చకోరపక్షి పూర్ణిమనాటి చంద్రుని చూసి మోహముతో తదేకంగా చూస్తూ వున్నట్లు కనురెప్ప మూతపడదు. అలాగే భగవంతుడిని కూడ తదేకంగా చూస్తూవుండాలి. రెప్ప మూతపడకూడదు. చకోరపక్షి, చంద్రుడనే పోలికా అక్కడ కుదరదు. ఎందుకంటే భగవంతునికి సమానము భగవంతుడే. కళ్ళతో అతని రూపలావణ్యాన్ని చూసి, ముఖారవిందాన్ని చూసి ఎలా అనుకోవాలంటే నేను కళ్ళతోటే త్రాగివేయనా అలాగే చూస్తూ వుండిపోనా అనుకోవాలి. భగవంతుని రూపాన్ని చూస్తూనే వుండాలి. తనను తాను మరచిపోవాలి.

ధ్యానిస్తున్న సమయంలో మాటిమాటికీ గగుర్పాటు కలుగుతుంది. కన్నీళ్ళు ప్రవిస్తుంటాయి, ఆశ్చర్యం కలుగుతుంది. నేనొక తుచ్ఛమైన వ్యక్తిని అయినా నాకు భగవంతుడు లభించాడంటే ఎంత ఆశ్చర్యమని భావించాలి. ఆనందానికి, జ్ఞానానికి హద్దు వుండకూడదు. శాంతికి హద్దు వుండరాదు. ఆ స్వరూపాన్ని ఎవరైనా, ఎవరిపై ఇష్టముందో, శ్రద్ధవుందో వారి లీలను స్మరించాలి. అతడిని చూస్తూ స్వయంగా భక్తుడు ముగ్ధుడవ్వాలి

లేదా మానసిక లీలను చూసి ఆ ధ్యానంలో తన్మయుడవ్వాలి. తరువాత ఆ లీలలో భగవంతుని గుణాలను దర్శించాలి.

గుణాలంటే - భగవంతుడు చాలా ప్రేమ గలవాడు, చాలా దయగలవాడు, సహనము గలవాడు. ఇవన్నీ అతనిలోని అనంతమైన గుణాలు. భగవంతునిలో క్షమ, దయ, శాంతి, సంతోషము, సరళత, జ్ఞానము, వైరాగ్యము మొదలైన అనేక గుణాలు నిండి వున్నాయి. పరిమితి లేదు. మనము ఊహించినా, తెలుసుకున్నా అది చాలా తక్కువ. భగవంతుని గుణాలను చూసి ఎంత ముగ్ధులవ్వాలంటే నాలాంటి తుచ్ఛునిపై, అయోగ్యునిపై కూడా భగవంతుడు ఇంత ప్రేమను చూపుతున్నాడు. నాపైన భగవంతునికి ఇంత దయ అని భావించాలి. భగవంతుని వైపు నుండి గేటు తెరవబడింది. నిన్ను ఆహ్వానిస్తూ. భగవంతుని చేతులు మన తలపై వున్నాయి ఇక మనకు ఏది తక్కువ? ఎందుకు చింతించాలి? భగవంతుని దయ యొక్క రహస్యాన్ని తెలుసుకోవాలి, తత్త్వాన్ని అర్థం చేసుకోవాలి. అపుడు క్షణక్షణమూ మోహము కలుగుతుంది. ప్రసన్నత కలుగుతుంది. అలాగే ఆ భక్తునిలో ధైర్యము, గాంభీర్యము. వీరత్వము, నిర్భయము ఈ గుణాలు వస్తాయి. ఆ భక్తుడు, నేను భగవంతుని శరణంలో వున్నా, భగవంతుని ఆశ్రయించి భగవంతుని ఒడిలోనే వున్నానని తెలుసుకోవాలి.

ఎవరినైనా తిట్టి ఒక పిల్లవాడు తన రక్షణకోసం పరుగెత్తి తల్లి ఒడిలో కూర్చుంటే వానికి 'నేను సురక్షితంగా వున్నానని' భావన వుంటుంది. కానీ వేరొకడు వచ్చి నీ పిల్లవాడు నన్ను తిట్టానాడని, కొట్టినాడని అంటే తల్లి న్యాయం చేస్తుంది. పిల్లవాడిని అడుగుతుంది. 'ఏం నాయనా! ఇతడిని కొట్టావా?' అని. పిల్లవాడంటాడు 'అవును' అని. అపుడు తల్లి ఎందుకు కొట్టావని అడుగుతుంది. పిల్లవాడు చెప్తాడు. 'ముందు ఇతడు నన్ను కొట్టాడు అపుడు నేను ఇతడిని కొట్టాను' అని. తల్లి వేరొకడిని అడుగుతుంది. 'బాబూ! నీవు వీడినెందుకు కొట్టావు?' అని. అతడు చెప్తాడు, 'వీడు ముందు నన్ను తిట్టాడు,' అని. పిల్లవాడినడుగుతుంది. 'నాయనా! నీవెందుకు వీడిని తిట్టావు?' అంటే పిల్లవాడు జవాబు ఇవ్వకుండా మౌనంగా వుంటాడు. అపుడు ఆ పిల్లవానిదే తప్పు అని తెలుసుకొని ఆ తల్లి పిల్లవానికి చెంపదెబ్బనిస్తుంది. దానితో పిల్లవాడు ఏడవడం మొదలు పెడతాడు.

ఫిర్యాదు చేసిన పిల్లవాడు సంతోషిస్తాడు. వీనికి దెబ్బలు పడ్డాయి. ప్రతీకారం తీర్చుకున్నాను అనుకుంటాడు. ఈ పిల్లవాడేమో చీరచాటునుండి నవ్వుతాడు, పైకి మాత్రం ఏడుస్తాడు. ఎందుకు నవ్వుతాడంటే తల్లి కొట్టినా మధురంగా వుంది అని. ఆ పిల్లవాడు నన్ను కొట్టివుంటే నా ప్రాణం తీసివుండేవాడు అనుకుంటాడు. భగవంతుని విషయంలోనూ ఇదే పద్ధతి.

భగవంతుడు మన హితానికే పాపఫలాన్ని అనుభవింపజేస్తాడు అంటే కొడతాడు, ఎందుకంటే భగవంతుడు మన పాపాలకు దండనను అనుభవింపజేసి కలుగబోయే లక్షలకొద్ది జన్మలను తప్పిస్తాడు. ఉద్ధరిస్తాడు. తల్లి తన పిల్లవానికి రెండు దెబ్బలు వేసి కొట్టడానికి వచ్చిన వేరే పిల్లవాడు కొట్టకుండా తప్పిస్తుంది. భగవంతుడు మనలను అన్ని పాపాలనుండి, దుర్గుణాలనుండి, అన్ని దుర్వ్యసనాలనుండి, దురాచారాల నుండి రక్షిస్తాడు. నిద్ర, ప్రమాదము - ఇవన్నీ ప్రమాదకరమైనవి. మామూలు దెబ్బ వేసి నన్ను అన్ని ప్రమాదాల నుండి రక్షించాడు. ఒకడు రోగి అవుతాడు. ఒకడు జ్వర పీడితుడు అవుతాడు. ఒక పిల్లవాడు మరణిస్తాడు లేదా ఇంటికి నిప్పంటుకుంటుంది. ఇవన్నీ ప్రమాదాలే. ఇది దెబ్బ, కానీ తియ్యనిది. దీనివల్ల జీవునికి మేలు కలుగుతుంది. భగవంతుడు అన్ని పాపాలనుండి ముక్తిని కలిగిస్తాడు. మన మనస్సుకు విపరీతమైన ఇవన్నీ మనకు ప్రాప్తిస్తే ఇది భగవంతుడిచ్చినది, దయతో తానుగా ఇచ్చినదని అర్థం చేసుకోవాలి. భగవంతుని దయాతత్త్వాన్ని తెలుసుకున్ననాడు నవ్వుతూనే వుంటాడు. ఏది జరిగినా దాంట్లో భగవంతుని కేవలం దయనే చూడాలి. ముందుగా, 'నాపైన భగవంతునికి చాలా దయ వున్నది' అని దయను అంగీకరించాలి. అమృతం లాగా అనిపించే మానము, గౌరవము, ప్రతిష్ఠ నశిస్తున్నాయి. అని భగవంతుని దయను ఒప్పుకోవాలి. దీనిని చూసి చింతించే వాళ్ళు మూర్ఖులు, అర్థం చేసుకోగలవాళ్ళు ఇలా చేయరు. భగవంతుని దయ చాలా వున్నదని అంగీకరించాలి. ఆ దయను మళ్ళీ మళ్ళీ స్మరించి ముగ్ధులవ్వాలి.

శ్రీరామచంద్రుడు లంకనుండి అయోధ్యానగరానికి వచ్చినపుడు అనేక రూపలను ధరించి సముచితంగా అందరినీ కలిసేవాడు, ఎవరిని కలిస్తే

వారికి చాలాఆశ్చర్యం కలిగింది. భగవంతుడు అందరికంటే ముందు నన్నే కలిశాడని ఎవరికి వారుగా అందరూ చాలా ప్రసన్నతను పొందారు. నేను ఎంతో అదృష్టవంతుడను. ఎక్కడి భగవంతుడు? ఎక్కడి నేను? ఎంతటి ఆశ్చర్యకరమైన విషయము! నేనొక తుచ్ఛుడిని,' అయినా త్రిలోకనాథుడు. అందరికంటే ముందు నన్నే కలుస్తాడని అందరికి ప్రసన్నత కలిగింది. ఇలా అందరికి అనుభవం కలిగింది.

శంకర భగవానుడు పార్వతీదేవితో అంటాడు 'ఉమా! సూత్రధారుడు తోలుబొమ్మలను ఆడించినట్లు భగవంతుడు అందరినీ ఆడిస్తాడు. అంటే లీలను ప్రదర్శిస్తాడు. ఆ లీలను అంగీకరిస్తే అమితలాభము. భగవంతుని ప్రతి లీలలో భగవంతుని విధానము నిండివుంది. జరుగుతున్నదంతా భగవంతుని ఆజ్ఞతో జరుగుతుంది. భగవంతుని దయను అంగీకరించకపోతే అది మూర్ఖత్వము, అంగీకరించినచో ముందు ముందు దయాతత్త్వము అర్థమవుతుంది. అప్పుడిక అంగీకరించేదేదీ వుండదు, కానీ ముందు మాత్రము అంగీకరించాల్సి వస్తుంది. అంగీకరించిన తరువాత ఎలాంటి ఆనందము కలుగుతుందో చూడుము. అతనిలో ధైర్యము, గాంభీర్యము, నిర్భరత ఇంకా తల్లి ఒడిలో కూర్చుంటే పిల్లవానికి కలిగే నిర్భయమూ కలుగుతాయి.

భగవంతుని ఒడిలో కూర్చున్న తరువాత ఇక భయమెందుకు? అతనిలో గాంభీర్యమేర్పడుతుంది. ఎందుకంటే భగవంతునిలో గాంభీర్యముంది. అతనిలో తితిక్ష కలుగుతుంది. ప్రేమ జాగృతమవుతుంది, భగవంతుని యందు పరమశ్రద్ధ ఏర్పడుతుంది. ఇక భగవంతుని విడిచి అతడెక్కడికి వెళతాడు? మనిషి భగవంతునిపై నిర్భరమైతే అతడు పరమశ్రేష్ఠుడవుతాడు.

ఇంకొకమాట ఏమంటే బుద్ధిమంతుడు, విద్వాంసుడు, ఆయుర్వేద శాస్త్రవేత్త అయిన వైద్యుడైనా సరే అతని హస్తవాసి మంచిది కానిచో ప్రజలు అతనితో చికిత్స చేయించుకోరు. కానీ నిరక్షరాస్యుడు అయిన వైద్యుడెవరైనా మెల్లమెల్లగా చికిత్స చేస్తూ చేస్తూ అభ్యాసమేర్పడినవాడు, అనుభవం గలవాడు, సరిగ్గా చికిత్స చేసేవాడు వుంటే ప్రజలు అతనిచేత చికిత్సను చేయించుకోవడం మొదలుపెడతారు. ఈ విధంగా సఫలత కొద్దిగా వున్నా ప్రపంచం వెంటబడుతుంది.

ఒరిస్సాలో ఒక బాలుడు వుండేవాడు. అతడి దగ్గర ఒక ఔషధమున్నదని దానితో అతడు అన్ని రోగాలను నయం చేస్తాడని ఆ బాలుని విషయంలో ప్రచారమేర్పడింది. ప్రజలకు అసత్యమైనది ఒక భ్రమ ఏర్పడింది, అది నిజం కాదు. అనుకోకుండా కొందరు వ్యక్తుల దుఃఖము దూరమైతే ఇక ప్రజలు వెల్లువెత్తి వచ్చారు. వేలకొద్దీ, లక్షలకొద్దీ ప్రజలు వచ్చారు. పెద్ద పెద్ద అధికారులూ, ధనికులూ వెళ్ళారు. ఆ పిల్లవాని చేతిలో హస్తవాసి వుండింది. సఫలత వుంది. కానీ అతనికి మందు గూర్చి తెలియదు. అతడు విద్వాంసుడు కాడు, వైద్యుడు కాడు. కానీ కొంత మందును కొందరికి ఇస్తే ఫలించింది. దీనితో ఊరు, నగరము వెల్లువెత్తింది, ప్రజలు ప్రవాహంలా వచ్చారు. భారతదేశానికి చెందిన ప్రజలు వేలు, లక్షలుగా అతని దగ్గరికి వెళ్ళి భిక్షను కోరారు. 'ఒక చిటికెడు మందు ఇవ్వు,' అని అనేవారు.

ఒక యాత్ర లాగా అయింది. నిజమైన సఫలత అయితే చెప్పేదేముంది? భగవంతునికి ఈ విషయంలో నిజమైన సఫలత వుంది. మహాత్ములదీ ఈ విషయంలో నిజమైన సఫలత. భగవంతుడు నాకు విద్య, బుద్ధి, జ్ఞానము ఏదీ ఇవ్వకుండా కేవలం సఫలత నివ్వవచ్చు అన్నదానిని గమనించాలి. భగవంతుడు సఫలతనిస్తే సఫలతే లభిస్తుంది. దానికి ఏవిధమైన హానీ, నష్టమూ లేదు.

బికనేరులో ఒక వ్యాపారి ఉండేవాడు. అతడు ఎర్రమట్టిని అమ్మేవాడు. పూర్వకాలంలో రైలు వుండేదికాదు, ఎద్దులపై సామాను నింపి తీసుకొని వెళ్ళేవాడు, దానినమ్మేవాడు. ఒకమారు ఢిల్లీ కోసం మట్టిని నింపి తీసుకొని వెళ్ళసాగాడు. మార్గమధ్యములో ఆ ఎర్రమట్టి అమ్ముడుపోయిన కొద్దీ దాని స్థానంలో ఇసుక నింపి తీసుకొని వెళ్ళసాగాడు. ఒక బుద్ధిమంతుడు ఢిల్లీ నుండి బికనేరుకి వెళ్ళసాగాడు. ఈ వ్యాపారిని కలిసి అడిగాడు, 'సంచీ ఖాళీ అయిపోతే, ఇసుక ఎందుకు నింపుతున్నావు?' అంటే ఏమి చేయాలి అని వ్యాపారి అన్నాడు. అతడన్నాడు, 'రెండు ఎద్దుల సరుకును ఒక్క దానిపైన నింపు. ఒక దాన్ని ఖాళీచెయ్యి. వ్యర్థంగా ఒక ఎద్దుపైన ఇంత భారాన్ని వేసి దానినెందుకు చంపుతావు?' అనగా అపుడది అర్థమయింది

వ్యాపారికి ఈ వ్యక్తి తెలివైన మాట అన్నాడని తెలుసుకున్నాడు. ఈ విషయాన్ని వేరే ఎవరూ తెలుపలేదు. అతనికి ధన్యవాదాలు చెప్పి ఎక్కడినుండి వస్తున్నావని అడిగాడు. ఢిల్లా నుండి వస్తున్నానని అతను చెప్పాడు. 'ఢిల్లీలో నీవు ఏం పనిచేస్తావు?' అని వ్యాపారి అడిగాడు. 'ఎన్ని రూపాయలను సంపాదించావు?' పదివేలదాకా సంపాదించాను కానీ నష్టమొచ్చింది, రూపాయలు కూడా ఖర్చయ్యాయి. తలపైన ఊరి ఋణం వచ్చిపడింది. నా ఆశ నిష్ఫలమైంది. అందరినుండి ముఖం తప్పించి ప్రాణాలు చేతిలో పట్టుకొని పారిపోతున్నానని అతడు చెప్పాడు. వ్యాపారి అన్నాడు. 'సోదరా! నీవు వేలకొద్ది రూపాయలు సంపాదించావు కాని తెలివిని ఉపయోగించలేదు. నీ బుద్ధి ఫలించలేదు. నీవు నీ తెలివిని నీ దగ్గరే వుంచుకో. నీ దగ్గర ఇంత తెలివే వుంటే దివాళా తీసి ముఖం తప్పించి ఎందుకు వస్తావు?' అని ఆ వ్యాపారి నెమ్మదిగా ఢిల్లీ చేరుకొని ఒక వ్యాపారి వద్ద ఇసుక, మట్టి దింపించాడు. మొత్తం ఎర్రముల్తానీ మట్టి ఢిల్లీలో అమ్ముడుపోయింది. సంచులన్నీ ఖాళీ అయిపోయాయి.

అక్కడి పాదుషా జబ్బున పడ్డాడు. వైద్యుడేమో రాజస్థాన్‌కి చెందిన ఇసుక వుంటే తెప్పించమన్నాడు. దానితో ఎక్కువ విశ్రాంతి లభిస్తుందన్నాడు. రాజు అడిగాడు. 'వైద్యరాజా! ఎక్కడ దొరుకుతుంది?' అంటే వైద్యుడన్నాడు, 'అది చాలా దూరంలో లభిస్తుంది. రానుపోనూ మూడు రోజుల సమయం పడుతుంది. ఒకరోజు వెళ్ళడానికి, ఒకరోజు ఏర్పాటు చేయడానికి, ఒకరోజు తీసుకొని రావడానికి అని,' ఒక వ్యక్తి అన్నాడు. 'రాజా! ఒక వ్యాపారి ఇక్కడ ఇసుక వ్యాపారము డేరా వేశాడు,' అనగా రాజు 'ఇక్కడే దొరికితే బికనేరు నుండి తెప్పించడమెందుకు? వెళ్ళు, కొని తీసుకురా!' అనగా అతడు వ్యాపారి దగ్గరికి వెళ్ళి 'ఇక్కడ ఇసుక, ఎర్రమట్టి ఎక్కడి నుండి వచ్చాయని వెల ఎంత' అని అడిగాడు. దానికి ఆ వ్యాపారి, 'ఈ ఇసుక రాజస్థాన్‌ది. మట్టిని అమ్మే వెలకే దీనినీ అమ్ముతాను. ఎంత తీసుకున్నా సరే!' అనగా అక్కడి సరుకు అంతా ఎర్రమట్టి ధరకే అమ్ముడుపోయింది. ఇది చూసి వ్యాపారులంతా కలిసి అతనితో అన్నారు. 'అతని మాటను నీవు వినివుంటే ఈ లాభం దక్కకపోయేది,' అని. తాత్పర్యమేమంటే

ఎవరి బుద్ధి పనిచేయదో వారి మాటలను వినరాదు. ఎంత బుద్ధిమంతుడైనా, పండితుడైనా సరే. మీరు మీ బుద్ధిని ఉపయోగిస్తే ఒడ్డున వుంటారు. బుద్ధి నిలవడమే కాదు, ఈశ్వరుడు చెప్పినదని, శాస్త్రాలలో చెప్పబడినవి, మహాత్ములు చెప్పినవి ఏవో వాటినే పాటించాలి. ప్రత్యక్షంగా లాభము చేకూరుతుంది. మన బుద్ధి ఉపయోగించిన చోట నష్టమే కలుగుతుంది.

ఒక ఆస్తికుడు, ఒక నాస్తికుడు వుండేవారు. ఇద్దరూ ఒక పెద్ద మామిడి పళ్ళ చెట్టు క్రింద కూర్చున్నారు. ఆస్తికుడన్నాడు. 'భగవంతుడు పొరపాటు చేయడు. పొరపాటు ఎప్పుడూ జరగదు. భగవంతుని ద్వారా జరిగే క్రియ, అతని విధానము మంగళమయమవుతాయి. అందరికీ మేలు చేకూర్చే పని ఏదైనా మంగళమయమే. ఆలస్యమవుతుందేమో కానీ భగవంతుని విధానంలో లోపముండదు.' నాస్తికుడది విని ఇలా అన్నాడు. 'ఒక మాట చెప్పనా?' అనగా అస్తికుడన్నాడు. 'చెప్పు' అని. నాస్తికుడు చెప్పసాగాడు. 'ఇక్కడ చాలా పెద్ద చెట్టు వుంది కదా! దానికి భగవంతుడు చాలా చిన్నచిన్న పళ్ళనిచ్చాడు. చిన్నచెట్టుకు పెద్ద పెద్ద పళ్ళనిచ్చాడు. గుమ్మడిపాదు వుంది. అది పండితే ఒకసారి ఐదుశేర్లకు, పదిశేర్లకు అవుతుంది. అదే మామిడి పండు ఇంత చిన్నగా వున్నాయి. పావు, అర్ధపావు, మూడు చటాకులు, వుంటాయి. దీనితో ఈశ్వరుడు బుద్ధి తక్కువ వాడని తేలిపోతుంది.' ఇంతలో ఒక మామిడిపండు రాలి అతని తలపై పడింది. అది పండి వుంది. అది పండడంతో ఆ నాస్తికుని తలపై గాయమేర్పడింది. అతడన్నాడు. 'రామ రామ రామ రామ' అని దానితో ఆస్తికుడన్నాడు. పదిశేర్ల బరువున్న మామిడిపండే నీ తలపై పడివుంటే నీ పరిస్థితి ఎలా వుండేది? కపాలసిద్ధి అయివుండేది. చూడు, భగవంతుడు పొరపాటు చెయ్యడు. అతనిలో తప్పును చెప్పడం మూర్ఖత.'

భగవంతుని దయను గూర్చి ఒక మాట - భగవంతుని దయ ఎంత వుంటుందని మనమనుకుంటామో దానికంటే వేలరెట్లు, లక్షల రెట్లు ఎక్కువగా అతని దయ మనపై వుంది. దీనిని మీరు ఒప్పుకుంటే మీలో ఎంత ప్రసన్నత, శాంతి ఏర్పడుతుందంటే సాంసారిక, శారీరక చింతలను మరిచిపోతారు. భగవంతుడే గుర్తుకువస్తాడు.

మీకు భగవంతునిపై విశ్వాసం కలగాలి. శ్రద్ధ కలగాలి. మరీ విషయాన్ని అంగీకరిస్తే భగవంతుడు ముందు ముందు స్వయంగా తనను తాను వెల్లడిచేసుకుంటాడు.

**సోఇ జానఇ జెహి దేహు జనాఈ ।**
**జానత తుమ్హహిఁ తుమ్హఇ హోఇ జాఈ ॥**

భగవంతుని తెలుసుకోవాలనుకునేవారికి భగవంతుడు తనను తాను వెల్లడి చేసుకుంటాడు. వారు భగవంతుని తెలుసుకొని, తత్స్వరూపులే అవుతారు. తనను తెలుసుకొనగోరువాడిని తనవలెనే సిద్ధపరచును. అతని వద్ద ఏ కొరతా లేదు, అతనికి అసంభవమైనది ఏదీలేదు.

అనగా - కర్తు మకర్తుమ్ అన్యథా కర్తుం సమర్థః అని దీని తాత్పర్యము.

నారాయణ! నారాయణ!! నారాయణ!!!



# 11. సంగము - బంధము

మనము చాలా మంచి మాటలను వింటాము. సత్సంగమునకు చాలా మంచి వక్తలు వస్తారు. వారు తత్వానికి చెందినవి, జ్ఞాన, భక్తి వైరాగ్య సదాచారాలకు చెందిన ఎన్నో రహస్య విషయాలను వినిపిస్తారు. కానీ వాటిని విని కూడా వాటి ప్రభావముండదు, కారణమేమిటి? దీనిని గూర్చి ఆలోచించాలి. వక్తల విషయంలో ఏం చెప్పాలి? శ్రోతల విషయంలో కూడా ఏం చెప్పాలి? వినే వాళ్ళూ భావుకులు, చెప్పేవాళ్ళూ భావుకులు.

నేను యోగ్యుడను కాను, అధికారిని కాను అని ప్రతివ్యక్తి తన అయోగ్యతను గూర్చి ప్రకటించుకొనే హక్కును కలిగివుంటాడు. కాని ఇతరులను గూర్చి చెప్పే హక్కు మాత్రము అతనికి లేదు. వక్త అయినా సరే, శ్రోత అయినా సరే, వారు తమ గురించి మాత్రమే వివరించాలి కాని ఇతరులను గూర్చి తెలుపకూడదు. ఈ విషయంలో ఒక కథ జ్ఞాపకం వస్తున్నది. కథలో కూడా మనకు నీతి లభిస్తుంది. ఆ కథ ఈ విధంగా వుంది-

ఒకరాజు వుండేవాడు. అతని దగ్గరికి ఒక పెద్ద విద్వాంసుడైన పండితుడు వస్తూండేవాడు. అతడు ప్రతిరోజూ రాజుకు పురాణగాథలు, ధర్మాలు వినిపించేవాడు. అలా వినిపిస్తూ సంవత్సరాలు గడిచిపోయాయి. ఒకరోజు రాజు పండితునితో అన్నాడు. స్వామీ! మీరు ప్రతిరోజూ కథను వినిపిస్తూ వుంటే సంవత్సరాలు గడిచాయి. ఈ రోజు వినిపించినట్లే కథను ప్రతిసారి వినిపిస్తున్నారు. వినిపిస్తూ, వినిపిస్తూ మీరు ముసలి వాళ్ళయినారు. నేనూ ముసలివాణ్ణయినాను. కానీ నేను కొన్ని సంవత్సరాల ముందు ఎలా వున్నానో ఇప్పుడూ అలాగే వున్నాను. మీ కథ కోసం సంవత్సరానికి సుమారు మూడు నాలుగువేల వరహాలు ఖర్చవుతాయి. అది ప్రభుత్వానికి నష్టమే అవుతుంది.

ప్రతిసంవత్సరమూ నాలుగువేల వరహాలను వ్యర్థం చెయ్యనా? దానికి ఏదైనా లాభము వుండాలి. నా సమయం మీ సమయం కూడా నష్టమవుతుంది.

ధనము కూడా ఖర్చవుతుంది. ఏదైనా బాగుపడే ఉపాయాన్ని చెప్పండి? నేను మీమాటలను వింటాను. మీరు వైరాగ్యము, భక్తి, జ్ఞానానికి చెందిన వాటిని చెబుతారు. కానీ మీ మాటలను విని నేను భక్తుడినీ కాలేదు, జ్ఞానిని గానీ, యోగిని గానీ, సదాచారిని గానీ కాలేదు. దీనికి సమాధానాన్ని మీరు ఒక నెలలోపు ఇవ్వండి. అలా కాకపోతే ఈ ప్రసంగం నిలిపివేయబడుతుంది. మీకిచ్చే వేతనమూ ఆపివేయబడుతుంది. మీరు మీ జీవనం కోసం వేరే మార్గాన్ని చూసుకోవలసి వస్తుంది. ఇది విని పండితుడు హతాశుడయ్యాడు. (నిశ్చేష్టుడయ్యాడు). ఏమి జవాబివ్వను ? అని ఆలోచించసాగాడు. ఈ ఆలోచనలో అతడు నడుస్తుండగా ఒక నిజమైన మహాత్ముడు త్రోవలో కలిసాడు. అతడు చాలా విరక్తుడు, త్యాగి, అతని మనస్సులో చాలా వైరాగ్యముండినది. వాస్తవానికి ఆయన చాలా ఉత్తమస్థాయికి చెందిన మహాపురుషుడు, పండితుని ముఖము ఉదాసీనంగా వుండడాన్ని చూసి ఆ మహాపురుషుడు విషయమేమిటని పండితుడిని అడిగాడు. పండితుడు చెప్పాడు. 'ఒకనెల తరువాత నా జీవిక ఆగిపోబోతుంది.' అదే విషయం, మహాత్ముడు ఎందుకని అడిగాడు. పండితుడు చెప్పాడు, 'రాజుగారు నన్ను ఒక ప్రశ్న అడిగారు కానీ దానికి సమాధానం నా దగ్గర లేదు.' ప్రశ్న ఏమంటే - 'మీరు జ్ఞాన, భక్తి, వైరాగ్యాల గూర్చి చెబుతున్నారు. నేను వింటున్నాను. కానీ నాలో ఆవంతైనా భక్తిగాని, జ్ఞానంగాని, వైరాగ్యంగాని కలుగలేదు.' ఇలా ఎందుకో నాకు సమాధానం చెప్పండి లేదా ఈ ఖర్చును ఆపివేస్తాను, అని రాజుగారడిగారు. 'సమాధానం నా వద్ద లేదు.' అనగా మహాత్ముడన్నాడు, 'దీని కోసం మీరు ఎందుకు చింతిస్తారు? దీనికి సమాధానాన్ని నేనిస్తాను.' అనగా పండితుడు, 'మీరు సమాధానాన్ని ఇస్తే మేము లోకువవుతాము. ఈ ప్రశ్నకు సమాధానాన్ని పండితుడివ్వలేక పోయాడు, ఈ సాధువిచ్చాడని మాకు హాని కలుగుతుంది.' అనగా సాధువు చెప్పాడు, 'లేదు, మీకు లోటు తక్కువదనమేదీ రాదు. మీరు రాజుగారితో ఇది చాలా మామూలు విషయము. దీనికి సమాధానాన్ని నా శిష్యుడు కూడా ఇవ్వగలడు అని చెప్పండి. నేను మీ శిష్యుడినవుతాను. నేను మీ శిష్యుడనై సమాధానాన్ని ఇస్తే మీకు ఏ లోటూ రాదుకదా!.' అంటే పండితుడు 'అవును' అన్నాడు. మరునాడు పండితుడు, సాధు పురుషుడు కలిసి

రాజు వద్దకు వెళ్ళారు. రాజు మళ్ళీ అడిగాడు. 'మహానుభావా! మీరు నా ప్రశ్నకు సమాధానాన్ని సిద్ధం చేశారా?' దానికి పండితుడు చెప్పాడు. 'మహారాజా! దీనికి సమాధానం మామూలు విషయం. నా శిష్యుడు కూడా ఇవ్వగలడు. నాకు ఇలాంటి శిష్యులు చాలామంది వున్నారు.' అనగా రాజు అన్నాడు, 'మీరిస్తేనేమి? మీ శిష్యుడిస్తే నేమి? నాకు నా ప్రశ్నకు సమాధానం కావాలి. రేపు మీరు మీ శిష్యుడిని తీసుకొని రండి.' అనగా పండితుడు మరునాడు ఆ మహాత్ముని తీసుకొని వెళ్ళాఢు. ఆ మహాత్ముడు పండితుని శిష్యుడుగా మారి వెళ్ళాడు. రాజు అడిగాడు, 'మీరు ఇతని శిష్యుడా?' దానికా మహానుభావుడు 'అవును' అని చెప్పాడు. 'నా ప్రశ్న నీకు తెలుసా?' అని రాజు అడిగాడు. 'తెలుసు! జ్ఞాన, వైరాగ్య, భక్తి విషయాల గూర్చి వింటూ మీరు సుమారు ముప్పయి సంవత్సరాలు గడిపారు. కానీ వాటి ప్రభావం మీపై లేదు. ఎందుకు అన్నది మీ ప్రశ్న,' అని మహాత్ముడనగా రాజు అన్నాడు. 'అవును, ఇదే విషయం,' దానికా శిష్యుడు చెప్పాడు, 'మీరు రాజ్యం యొక్క శక్తిని, అధికారాన్ని మొత్తంగా నాకు రెండు గంటల కోసం ఇవ్వండి. అపుడు మీ ప్రశ్నకు నేను సమాధానం చెప్పగలను.' అనగా రాజు చెప్పాడు, 'మంచిది' అని పనివాళ్ళను పిలిచి 'నేను రెండుగంటల కోసం ఈ రాజ్యాధికారాన్నంతా ఇతనికి అప్పగిస్తాను. ఇతను చెప్పినట్లే మీరు చెయ్యాలి,' అని చెప్పాడు. రాజాసనంపై కూర్చుని మహాత్ముడు పండితుడిని తాళ్ళతో బంధించమని ఆజ్ఞాపించాడు. సేవకులు పండితుడిని బంధించారు. మహాత్ముడు ఆ తరువాత మరొక తాడును తెచ్చి ఈ రాజును కూడా బంధించమని ఆజ్ఞాపించాడు. ఆజ్ఞ ప్రకారం రాజు కూడా బంధింపబడ్డాడు. ఇదేంటీ ఏమీ అర్థం కావడం లేదు. అని ఇద్దరూ అనుకున్నారు. అపుడు మహాత్ముడు పండితునితో అన్నాడు. 'పండితవర్యా! మీరు ఇన్నిరోజులుగా రాజుగారికి కథను వినిపించారు కదా! ఇప్పుడు నాకు కష్టమవుతుంది ఈతాడును విప్పించండి' అని రాజుగారిని అడగండి. పండితుడు, 'నా తాళ్ళు విప్పించండి' అని రాజుగారి నడిగాడు 'నేనెలా విప్పించగలను?' రాజు అన్నాడు. పండితుడన్నాడు. 'పోనీ మీరే విప్పండి.' అంటే రాజన్నాడు, 'నేనే బంధంలో వున్నాను. ఎలా విప్పగలను?' అని.

'ఎలాగైనా విడిపించండి' అన్నాడు పండితుడు. 'నా ఆజ్ఞ చెల్లదు. ఎలా విడిపించగలను' అని బదులిచ్చాడు రాజు. 'నా ఆజ్ఞ నడవదు, నేను విప్పాలంటే చేతులు బంధింపబడివున్నాయి,' అని రాజు అనగా మహాత్ముడు రాజుగారితో అన్నాడు, 'మీరు ఇన్ని సంవత్సరాలుగా పండితుని కథా ప్రసంగాన్ని విన్నారు. పండితుడిని అడగండి కట్లను విప్పమని' అనగా పండితుడు, 'నేనే బంధింపబడి వున్నాను, ఎలా విడిపించగలను' అనగా రాజుగారితో మహాత్ముడన్నాడు, 'ఇప్పుడు మీ ప్రశ్నకు సమాధానం దొరికిందా, లేదా?' 'నాకు అర్థం కావడం లేదు' అన్నాడు రాజు. 'ఇప్పటికీ తెలియలేదా? మీరు స్వయంగా బంధింపడివున్నప్పుడు ఇతరులనెలా విడింపించగలరు?' అన్నాడు మహాత్ముడు. 'మీరు మిమ్మలినే విడిపించుకోలేనప్పుడు ఇతరులనెలా విడిపించగలరు?' అంటే అప్పుడు రాజు అన్నాడు, 'ఆఁ అర్థమైంది!' అని పండితునితో అన్నాడు. 'మీకు దీని తాత్పర్యం అర్థమైందా? మీరే బంధంలో వుంటే ఇతరులను బంధం నుండి ఎలా విడిపించగలరు?' పండితుడన్నాడు, 'విడిపించలేను.' మహాత్ముడప్పుడు చెప్పసాగాడు. 'మహారాజా! విషయమేమిటంటే ఈ పండితుడు ప్రతిరోజూ మీకు ప్రసంగాన్నైతే వినిపిస్తున్నాడు, కానీ స్వయంగా బంధంలో వున్నాడు. ఈయన స్వయంగా సంసారబంధంలో వుండగా మీరు ఈయన ద్వారా సంసారం నుండి ముక్తిని కోరుతున్నారు. ఒకవేళ ఈ పండితుడు స్వయంగా బంధవిముక్తుడైతే మిమ్ములను విముక్తులను చేయగలడు.'

కేవలం శాస్త్ర ప్రసంగాన్ని వినిపించడం ద్వారా ముక్తి కలుగదు. చిలుక పక్షులు 'రాధేకృష్ణ రాధేకృష్ణ' అంటుంటాయి. మనము 'రాధేకృష్ణ' అని ఎందుకు అంటామో వాటికి తెలియదు. పిల్లి వచ్చి వాటిని పట్టుకున్నప్పుడు 'రాధేకృష్ణ' అనడం మరచి 'టాయ్ టాయ్' అనడంమొదలుపెడతాయి. పండితునిది ఇదే స్థితి. ఇలాంటి స్థితిలో పండితుడు మిమ్ములనెలా విడిపించగలడు? సంసారము నుండి ముక్తుడైనవాడు, విడిపడినవాడు అయిన ముక్తపురుషు ప్రభావము ఏమైనా వుండవచ్చు కానీ స్వయంగా సంసారంలో బంధింపబడినవాడు. సుఖము, భోగము, విశ్రాంతి వీటిలో బంధింపబడినవాడు ఇతరులనెలా విడిపించగలడు? సంసారము పట్ల తీవ్రమైన వైరాగ్యము గల పురుషుడు కావాలి. సంసారము నుండి కేవలము

తీవ్ర వైరాగ్యమే కాదు, ఉపరతి కలగాలి, పరమాత్మ యొక్క తత్త్వమేమిటో తెలియాలి. ఇలాంటి ఉన్నతశ్రేణికి చెందిన మహాపురుషుడవ్వాలి.

స్వయంగా సంసారబంధము నుండి ముక్తుడైనవాడు సంసారబంధము నుండి ఇతరులను విడిపించగలడు. మేము చాలా గొప్పవాళ్ళము, మంచివాళ్ళము, మాలో ఏలోటూ లోపము లేదు అని ఎవరో కొందరు వక్తలంటారు. వినేవాళ్ళలో శ్రద్ధ, ప్రేమి, బుద్ధి, యోగ్యత ఇవి లేవు. ఇవి లేనందువల్ల వినేవాళ్ళు ఆ ఉపదేశ లాభాన్ని పొందలేరు. మాలో అంటే వక్తలో ఏ లోపమూ లేదు, వినేవాళ్ళలోనే వుంది. అనికొందరు అంటారు. చాలా మంచి మాట, వినేవాళ్ళలో లోపము వున్నందువల్లనే జిజ్ఞాసువులై వినడానికి వస్తారు. కాబట్టి వాళ్ళను సరిచేయడమే వక్త కర్తవ్యము. ఏదో ఒక నెపం చెప్పేవాడై వక్త తన స్వచ్ఛతను చెప్తే అంటే నేను నిర్దుష్టముగా ఉన్నాను, ఏ దోషమున్నా అది వినేవాళ్ళదే అంటే వినేవాళ్ళంటారు తప్పు లేకపోతే నీ ఉపన్యాసం వినడానికి ఎందుకు వస్తాము అని. తప్పు దూరం చేసుకోవడానికే కదా వచ్చేది! శ్రోతల దోషాలను దూరం చేయడం వక్త కర్తవ్యం. వక్త జ్ఞాని కావాలి ఎందుకంటే శ్రోతలెలాగూ అజ్ఞానులుగా వుంటారు. వక్త జ్ఞాని అయితే అతనిపైనే భారం పడుతుంది. అజ్ఞానిపైన కాదు. శ్రోతలు, 'మేము అజ్ఞానులము, అర్థం చేసుకోలేని వాళ్ళము. మమ్ములను యోగ్యులను చెయ్యమని నీ దగ్గరికి వచ్చాము' అంటారు. మేము అయోగ్యులము. నీవు మమ్ములందరినీ యోగ్యులను చెయ్యి. యోగ్యులను చెయ్యగల శక్తి నీకు లేకుంటే నిన్ను నీవు ఉపదేశకుడు, శిక్షకుడు, అని ఎందుకనుకుంటావు? ఈ విషయంలో ఇతరుల గూర్చి చెప్పడం కఠినం. నేను నా విషయంలో చెప్పగలను. నేను అందరినీ యోగ్యులుగా చెయ్యడానికి ఉపదేశమిచ్చి, ఆదేశమిచ్చి, వ్యాఖ్యానమునిచ్చి వారి అంధకారాన్ని దూరం చెయ్యడానికి నాకు శక్తిలేదు. దీని కోసం ఉపదేశించడానికి, ఆదేశించడానికి నాకు శక్తిలేదు. అధికారమూ లేదు. అందుకే మేము జాతి ద్వారాగానీ, వర్ణము ద్వారా గానీ, ఆశ్రమము ద్వారా గానీ, యోగ్యతవల్లగానీ మేము యోగ్యులము కాము, సమర్థులము కాము అధికారులము కాము అంటాము. నేను దీనికి యోగ్యుడిని కాను. నేను కేవలం శాస్త్రాలలో వ్రాయబడిన

విషయాలను మీ సేవలో, నా భాషలో చెప్తాను. ఆ మాటలను మనము ఆచరణలో పెడితే మనము బాగై ఉద్ధరించబడతామని నా విశ్వాసము. గీతలోని మాటలు, భగవతుని మాటలు, ఏవో మన ఇంటి మాటలు కావు. అలాగే శాస్త్రంలోని మాటలు, ఋషుల మాటలు, భగవంతుని మాటలను మనము ఆచరణలో పెడితే మనం బాగుపడి ఉద్ధరింపబడతాము. మీరు ఆచరణలో పెడితే మీరు బాగుపడి ఉద్ధరింపబడతారు. ఒక శక్తి వస్తుగతమైనది, దానిలో వస్తువుయొక్క శక్తి ఎంత ప్రభావాన్ని చూపుతుందంటే దాని ప్రభావంతో తమకు తాముగా అందరూ బాగుపడుతారు. అలాగే వినేవాళ్ళ శ్రద్ధపై ఆధారపడుతుంది. వినేవాళ్ళు తమ శ్రద్ధతో లాభాన్ని పొందుతారు. అది మన వశంలో లేని విషయం. ఇది వినేవాళ్ళ మహిమ మాత్రమే. నాలో మాత్రం ఇలాంటి మహిమ నైపుణ్యం లేదా సామర్థ్యం గాని లేవు. నా ప్రభావాన్ని చూపి లేదా శక్తినిప్రదర్శించి మీలో ఏదైనా జాగృతి కలిగించడానికి నాలో సామర్థ్యం లేదు.

మన తల్లి, చెల్లెలు, సోదరులు అమాయకులుగా వుంటారు. చలాకీ మనుషులెవరో, వారిని మోసగిస్తారు. ఎవరో ధనాన్ని గ్రహించి మోసగిస్తారు. ఎవరో పాతివ్రత్యాన్ని మోసగిస్తారు. కొందరు గృహస్థుల రూపంలో, సాధువుల రూపంలో, జ్ఞాని రూపంలో మహాత్ముడని చెప్పి, యోగి అని చెప్పి, భక్తుడినని చెప్పి అమాయకులైన జనాలను విశేషంగా తల్లీ చెల్లెళ్ళను మోసగిస్తారు. ఈ పరిస్థితిలో మనం, అక్కా చెల్లెళ్లు, సోదరులు జాగ్రత్తగా వుండాలి. ఇవాళ రేపు వ్యాఖ్యానాలను చేస్తూ వుండేవారు. చాలామంది తిరుగుతుంటారు. వాళ్ళు బంగారము మరియు కామినులకు దాసులుగా వుంటారు. చాలావరకు గౌరవప్రతిష్ఠలకు దాసులవుతారు. కొందరు తమను తాము గురువులమంటారు. కొందరు తమను గురువులమని కూడా అనరు. 'మేమే భగవంతుడు' అంటారు. ఈ విధంగా కొందరు తమను భగవంతుడంటారు, కొందరు మహాత్ములమని అంటారు, కొందరు తాము యోగులమంటారు. బాబాజీ నిజమునకు ఏ స్థితిలో వున్నారో మనకు బాగా తెలుసు, కానీ చెప్పకుందుము. ఎందుకంటే చెప్పడానికి మనకధికారము లేదు. వేరొకరి దోషాన్ని చెప్పడానికి మనకు అధికారము కాదు. తెలుసు,

తెలిసినా చెప్పము. ఈ స్థితి ఇప్పుడు వుంది, వందలకొద్ది వక్తలలో ఒక నిజమైన (వాస్తవిక) మహాపురుషుడు వుంటాడని తెలుసుకోవాలి. మామూలు మనుషులలో లక్షలలో, కోట్లలో ఒకడుంటాడు. ఒకడు తనను తాను యోగి అంటున్నాడు, మరొకడు తనను తాను మహాత్ముడు అంటున్నాడు. అలాగే వేరొకడు తాను జ్ఞాని అంటున్నాడు. నిజమునకు వారు యోగి కాదనిగానీ, మహాత్ముడు కాదనిగానీ, జ్ఞాని కాదనిగానీ చెప్పలేను. ఇతరుల గూర్చి చెప్పడానికి మాకు అధికారం లేదు. నా విషయంలో మాత్రం నాకా సామర్థ్యం లేదు అని చెప్పగలను. వేరే వ్యక్తి నాకా సామర్థ్యముందనకుంటే అతడు మోసపోగలడు. నేను సాధారణ వ్యక్తినని మాత్రము చెప్పుదును. నేను సమర్థుడిని కాను, అధికారినీ కాను. నేను నా భాషలో మహాపురుషుల మాటలను చెప్తాను. వాటిని ఆచరించడం వల్ల మనిషికి మేలు జరుగుతుంది. అది ఆ మాటల శక్తి తప్ప నా శక్తి కాదు. గీత యొక్క వచనాలు భగవానుని వచనాలని చెప్పగలను. రామాయణంలో తులసీదాసు గారి వచనములున్నవి. మహాభారతంలో వేదవ్యాసుని వచనాలున్నాయి. వేదవ్యాసుడు, తులసీదాసు, శ్రీకృష్ణభగవానుడు వీరి మాటలను ఆచరిస్తే ఉద్ధరింపబడతారని వేరుగా చెప్పేదేముంది? కానీ ఎవడైనా మూర్ఖత్వంతో నా శరీరాన్ని మహాత్ముడని, గొప్ప భక్తుడని భావించి సేవించడం, పూజించడం మొదలుపెడితే నాపైన ఆ వ్యక్తి బరువు వచ్చిపడుతుంది. కానీ అతనికి మేలు చేకూరుతుందని నేను గ్యారంటీ నివ్వలేను. ఎందుకంటే నా సేవ ద్వారా అతనికి మేలు జరుగుతుందని(నేననుకోను) నాకు తెలియదు. కానీ అతనికి మోసం జరుగుతుందను కుంటాను. ఎందుకంటే నేను సాధారణమైన మామూలు మనిషిని.

లోకంలోని ఉత్తమస్థాయి మహాపురుషులను తెలియజేయండి అని ఎవరో అడిగారు. ఈ విషయంలో నిజమేమంటే నేను చెప్పే వ్యక్తులలో మీరు శ్రద్ధ వహిస్తే నాపైననే శ్రద్ధ చూపడం మంచింది. నా మాట పైన నమ్మకముంచి ఈ వ్యక్తి మహాత్ముడు, ఇతడు జ్ఞాని, ఇతడు యోగి అని మీరు అంగీకరించేట్లుంటే మీరు నామాటకు చాలా గౌరవమిచ్చినట్లు అవుతుంది. ఇది ఆలోచించదగ్గ విషయం. విషయమేమంటే మనం లోకంలో

ఎవరిని మహాత్ములుగా అంగీకరించాలి? ఎవరిని భక్తులనుకోవాలి? జ్ఞానులనుకోవాలి? ఇదెట్లు కుదురుతుంది?

ముఖ్యమైన విషయమేమంటే మహాత్ములకూ మహాత్ముడు ఈశ్వరుడు, అతని శరణు పొందాలి. అతడు స్వయంగా ప్రకటమై లేదా మహాత్ముని రూపంలో వచ్చి మనలను కలుస్తాడు. మొదటి శ్రేణిలో ఈశ్వరులకే ఈశ్వరుడు, మహాత్ములకే మహాత్ముడు ఈశ్వరుడు పరమాత్మ. రెండవశ్రేణిలో స్వయంగా భగవంతుని మాట - భగవద్గీత కూడా మహాత్ములకే మహాత్ముడు. సిక్కులు నానక్ రచించిన 'గ్రంథసాహిబ్'ని ఈశ్వరునితో సమానంగా, గురువుగా భావించి దాని ప్రకారం నడుచుకుంటారు. అలాగే భగవద్గీత ప్రథమశ్రేణి పుస్తకము. మేము చూసినంతవరకు, మాకు తెలిసినంత వరకు దీనికి సమానమైన ఆధ్యాత్మిక గ్రంథము వేరేలేదు. మేము సర్వజ్ఞులం కాదు,అన్ని శాస్త్రాలను చూడలేదు కానీ చూసినంతవరకు భగవద్గీతయే అన్నిటికంటే శ్రేష్ఠమని తెలిసింది. చాలా మంచి పుస్తకాలు ఇంకా చాలా వున్నాయి. భాగవతము, రామాయణము, మహాభారతము మొదలైన పుస్తకాలన్నీ మంచివే. పుస్తకాల నుండి మనం చాలా లాభాన్ని పొందవచ్చు. ఈ విషయాన్నే దృష్టిలో వుంచుకొని మేము పుస్తకాలను ప్రచారంలోకి తెస్తున్నాము. గీతలో భగవంతుడంటాడు - అర్జునా! మన ఇద్దరి సంవాదము లేదా ఈ గీతాశాస్త్రాన్ని లోకంలో ప్రచారం చేసేవానితో సమానంగా నా కిష్టమైన పనిని చేసేవాడు ప్రపంచములోనే ఎవడూ లేడు, వుండబోడు, అని భగవంతుడు దీనిని ప్రకటించాడు. గీతాశాస్త్రంలోని 18వ అధ్యాయంలోని 68,69 శ్లోకాలలో గీత యొక్క గొప్ప మహిమ గానం చేయబడివుంది. నా భక్తులకు గీతను ధారణ చేయించేవాడు. (అతడు) నా పరమభక్తి ద్వారా నన్ను పొందుతాడు. అంతేకాదు, నాకు ఇష్టమైన పని చేసేవాళ్ళలో అతడిని మించి ఎవరూ లేరు, వుండబోరు. ఈ మాటను చదివిన మా మనస్సులో - భగవంతుడు ఇంత గ్యారంటీ ఇస్తున్నప్పుడు, మనం దీనిపై కొంత శ్రద్ధనుచూపాలని గొప్ప శ్రద్ధ, విశ్వాసము ఏర్పడింది.

ఇది ఒక అలౌకిక విషయం, అద్భుతమైనది, దాచివుంచబడ్డ రహస్యమైన విషయం. ఇప్పటివరకు భగవంతుని మాటలు, గీతాశాస్త్రం మాటలు, ఇతర శాస్త్రాల మాటలు చెప్పబడ్డాయి. ఎవరి సహవాసం వల్ల, దర్శనం వల్ల,

భాషణం వల్ల, స్పర్శవల్ల, చింతనం వల్ల మనలో గాఢమైన వైరాగ్యం కలుగుతుందో వారే వీతరాగులైన మహాపురుషులు, శ్రేష్ఠ పురుషులని తెలియాలి. ఎందుకంటే సూర్యభగవానుని తేజస్సులో అంటే ఎండలో కూర్చుంటే మనము వేడెక్కుతాము. అపుడు తెలుస్తుంది. సూర్య భగవానునిలో ఎంత వేడి వుంది అని. ఐదు నిముషాలు ఎండలో కూర్చుంటే మనము కాళ్ళ నుంచి తల వరకు ఒక్కసారిగా వేడెక్కుతాము. అపుడనుకుంటాము. ఈ వేడి ఎక్కడి నుండి వచ్చింది అని. అపుడే తెలుస్తుంది. ఇది సూర్యభగవానుని నుండి వచ్చిన వేడి అని. అగ్నికి దగ్గరగా కూర్చుంటే దాని శక్తి ప్రకారం దాని వేడి కూడా వస్తుంది. కేదారనాథ్‌లో మంచుపైన నడిస్తే కాళ్ళ నుండి తలవరకు చలి కమ్ముకుంటుంది. అది మంచు ప్రభావము. ఈవిధంగా ఎవరి దర్శనము, స్పర్శనము, భాషణము, వార్తాలాపము చింతన ద్వారా మనలో మహాత్ముల లక్షణాలు కలుగుతాయో, గీతలో చెప్పబడిన గుణాతీతుల, మహాత్ముల లక్షణాలు కలగడం మొదలుపెడతాయో వారే జ్ఞానులు, మహాపురుషులు అని తెలియాలి.

భగవంతుడు పన్నెండవ అధ్యాయం పదమూడవ శ్లోకం నుండి చివరి వరకు తన భక్తుల గురించి ఏ లక్షణాలను చెప్పాడో, అవి మనకు ఎవరి సహవాసము, దర్శనము, స్పర్శ, భాషణలతో, హృదయంలో, భావంలో రావడం మొదలు పెడతాయో వారే భగవంతుని భక్తులని తెలియాలి. గీత యొక్క పదహారవ అధ్యాయం మొదటి మూడు శ్లోకాలలో చెప్పబడిన దైవీ సంపద లక్షణాలు మన శరీరంలో, మనస్సులో, బుద్ధిలో, ఇంద్రియాలలో ఎవరి దర్శనం వల్ల కలుగుతాయో వారు దైవీసంపద గలిగిన వ్యక్తులని తెలియాలి. ఎవరి సహవాసం, దర్శనం, భాషణం, వార్తాలాపంతో ఆసురీసంపద లక్షణాలైన కామము, క్రోధము, లోభము, మోహము, అహంకారము, రాగద్వేషాలు మొదలైనవి మనలో కలుగుతాయో వాళ్ళు చూడడానికే మనుషులు కానీ వాస్తవానికి సాక్షాత్తు రాక్షసులు అని తెలియాలి. లేకపోతే మనము రాక్షసులమెందు కవుతున్నాము? వీళ్ళ ప్రభావం కూడా మనపై వుంది. ఎవరి దర్శనం, భాషణం, స్పర్శలతో మన శరీరంలో యోగజ్ఞానము వుంటే ప్రవృత్తి అలాంటిది అవుతుందని కదా సామెత. మనపైని ప్రభావాన్ని పట్టి

పరీక్షించుకోవాలి. దీని గూర్చి రాజస్థాన్ లోని బికనేర్ ప్రాంతానికి చెందిన కథ ఒకటి గుర్తుకు వచ్చింది.

బికనేర్ ప్రాంతానికి ఒకరాజు వుండేవాడు. రాజు తన సింహాసనంపై కూర్చున్నపుడు తన కుటుంబానికి చెందిన పురప్రముఖులను పిలిచి అన్నాడు. 'పెద్దలారా! నేనొక విషయాన్ని మిమ్ముల నడుగుతాను. మీరు నిర్భయంగా మనసులో వచ్చిన మాటను చెప్పండి. నిజాన్ని చెప్పండి.' అనగా వారు 'చెప్పండి,' అన్నారు. చిన్నవాడైనా గానీ రాజసింహాసనంపై కూర్చున్నాడు కాబట్టి ఆదరంగా సంభోదించి మాట్లాడుతారు. రాజు అడిగాడు, 'మీరు అంటే మీలోని వృద్ధులు మా మూడుతరాల పాలనను చూశారు. నా పాలనను కూడా ఐదు-పది సంవత్సరాలుగా చూస్తున్నారు. దీనికి ముందు నా తండ్రిగారి పాలన వుండేది. దానిని మీరు చూశారు. దానికి ముందు నా తాతగారి పాలననూ మీరు చూశారు. పోల్చి చూస్తే మా ముగ్గురి పాలనలో ఎవరి పాలన గొప్పది? నా పాలననా, నాతండ్రిగారి పాలనా, తాతగారి పాలనా? ఏది గొప్పది?' అని అడిగితే ఒక పెద్దమనిషి చెప్పాడు 'రాజా! మీరు గొప్ప వ్యక్తులు. మిమ్ముల్ని మేము పరీక్షించలేము. మిమ్మల్ని, మీ తండ్రిగారిని, మీ తాతగారిని పరీక్షించడానికి మాకు సామర్థ్యంలేదు. మాపైన కలిగిన ప్రభావాన్ని గూర్చి చెప్పగలం. దానితో మీరు అంచనా వేయండి,' అని వాళ్ళిలా చెప్పారు. మీ తాతగారి పాలన వున్నప్పుడు నా వయస్సు ఇరవై సంవత్సరాలు. ఒకసారి నేను ఇసుకతిన్నె గుట్టపైన వస్తున్నాను. నాకు ఒక స్త్రీ ఏడుస్తున్న ధ్వని వినబడింది. నేను ఆమె దగ్గరికి వెళ్ళాను. ఆమె వైశ్యురాలు. ఆమె ఒంటిపై సుమారు పదివేల విలువజేసే నగలు వున్నాయి. ఆమె ఏడస్తూవుంది. నేనడిగాను. 'సోదరీ! ఎందుకేడుస్తున్నావు.' అంటే ఆమె చెప్పింది, 'నేను వీడ్కోలుపొంది పుట్టింటి నుండి అత్తగారింటికి వెళ్తున్నాను. నాతో ఎద్దులబండి, ఒంటెలపైన వేల రూపాలయ విలువజేసే సామాను నింపబడివుంది. నాతో చాలామంది రక్షకులు వున్నారు. కానీ ఇరవైమందివున్న దొంగల గుంపు ఒకటి ఒక్కమారుగా దాడిచేసింది. నాతో వున్న వారందరూ పారిపోయారు, అలాగే నేను పారిపోయినాను, దొంగలుసామానులు కొల్లగొట్టారు. నేను ప్రాణాలు దక్కించుకొని ఈ గట్టుపైనుండి వస్తున్నాను,' అన్నది. నేనామె పుట్టింటి చిరునామాను

అత్తగారింటిని గూర్చి అడిగాను. ఆమె చెప్పింది, నాకామె అత్తగారింటి వాళ్ళు తెలుసు. 'సోదరీ! నీవీ విషయం గూర్చి చింతించకు! నేను నిన్ను ఇంట్లో దిగబెడతాను,' అని నేనామెను స్వంత చెల్లెలుగా భావించి అత్తగారింటికి తీసికొని వెళ్ళాను. వాళ్ళు ఆమె అన్వేషణలోనే వున్నారు. దొంగలు వచ్చారని ధనాన్నంతా కొల్లగొట్టినారని వాళ్ళకు వార్త ముందే చేరింది. కోడలు గూర్చి తెలియదు, ఎక్కడవుంది? నేనక్కడికి చేరి ఆ గట్టుపైన కూర్చుని ఏడుస్తున్నదని చెప్పాను. ఆ స్త్రీ ఇంటికి చేరి వశం తప్పి ఏడవసాగింది. తరువాత అత్తమామలకు, భర్తకు ఇలా చెప్పింది, 'నాకు చాలా దురవస్థ ప్రాప్తించింది. ప్రాణాలను దక్కించుకొని అడవిలోకి పారిపోయాను. ఇతడు నన్ను రక్షించాడు. నన్నిక్కడికి తెచ్చాడు. ఈయన గొప్పదనాన్ని ఎలా చెప్పను? మీరితన్ని సంతోషపెట్టి పంపించండి,' అనగా అత్తగారింటివారు అన్నారు, 'మహాప్రభూ! మీరుమాకు చాలా ఉపకారం చేశారు. మా కోడలు ప్రాణాలను నిలిపారు. మా ధనాన్ని రక్షించారు. మేము మీకు వెయ్యి రూపాయలు బహుమానంగా ఇవ్వాలనుకుంటున్నాము.' అంటే నేను, 'రూపాయల గురించి ఉపకారం చెయ్యలేదని చెప్పాను. అది నా కర్తవ్యమని భావించి ఈ పని చేశాను. మనిషిని కదా ఇది నా ధర్మమనుకున్నాను. ధర్మమని భావించి ఈ పని చేశాను. బహుమతి కోసం కాదు.' అంటే వాళ్ళు చాలా ప్రయత్నించారు. ఐదువందల రూపాయలైనా తీసుకొమ్మని, ఏదైనా తీసుకొమ్మని అన్నారు. కానీ నేను ఒక్కపైసా కూడా తీసుకోలేదు. వాళ్ళేమీ చేయలేకపోయారు. నేను తీసుకోకుంటే వాళ్ళేం చేయగలరు? తరువాత నేను మా ఇంటికి వచ్చాను. మీ తాతగారు జీవించి వున్నంతకాలం నేనిలాంటి ప్రవృత్తి గలిగి వున్నాను. మీ తాతగారు స్వర్గస్థులైనపుడు నా వయస్సు సుమారు యాభై సంవత్సరాలు. అపుడు నా మనస్సులో ఇలాంటి ఆలోచన వచ్చింది. నాకొక స్త్రీ కలిసింది కదా, ఎలాంటి అవకాశం? అడవిలో ఆమె ఒంటిపైని పదివేలరూపాయల విలువైన నగలను ఒలుచుకుంటే నన్నెవరు పట్టుకునేవారు? ఆ పదివేల రూపాయలు ఇప్పటివరకు వడ్డీని కలుపుకుంటే ఎంత అయివుండేది? ఎందుకంటే ఎనిమిదణాల వడ్డీతో పన్నెండు సంవత్సరాలలో రెట్టింపై వుండేది. ఇలా చాలా తప్పుచేశాను. ఇపుడు ధర్మం నాకేమిస్తుంది? ఆ

నగలను వలచుకుని వుంటే ఇప్పటికి గొప్ప సంపద కలిగేది, ఇలాంటి భావన నాలో కలగసాగింది. విచారిస్తే అది చాలా చెడ్డదని తెలిసేది కానీ డబ్బుపైని ఆసక్తివల్ల నా మనస్సులో తప్పు చేశాననే అనిపించేది. ఆ డబ్బు ఇంటికి వచ్చివుంటే ఇపుడు సుఖపడేవాడిని. అలాగే, రాజా! ఇక మీరు రాజ్యసింహాసనంపైన అధిష్ఠితులైనప్పుడు నా వయస్సు డెబ్బయి సంవత్సరాలు. నా వయస్సు 75 లేదా 80కి దగ్గర వున్న సమయంలో నాభార్య మరణించింది. అపుడు నా మనస్సులోకి ఈ ఆలోచన వచ్చింది. ఆ సమయంలో ఆ స్త్రీకి నచ్చజెప్పి తోడుగా తెచ్చివుంటే వృద్ధాప్యంలో స్త్రీకి స్త్రీ వుండేది. డబ్బూ దక్కేది. పదివేల రూపాయల విలువైన సొమ్ములూ నా వశమైవుండేవి. ఆ స్త్రీకి నచ్చజెప్పి భార్యగా చేసుకుని వుంటే ఇపుడు సుఖపడేవాడిని. ఇపుడు వృద్ధాప్యంలో ఆమె సేవచేసేది, డబ్బుతో సుఖపడేవాడిని. రాజా! మరణించడానికి సిద్ధంగా వున్న మా మనస్సులో ఇలాంటి ఆలోచన రాసాగింది. వృద్ధాప్యంలో ఇలాంటి దశ ఏర్పడింది.

రాజా! మేము మా మానసికస్థితిని మీకు తెలిపాము. మీలో ఎవరు గొప్ప ఎవరు తక్కువ అని నిర్ణయించే సామర్థ్యము మాకు లేదు. మీ పాలనలో ఈ మానసికదశ, మీతండ్రిగారి పాలనలో ఇట్టిదని, మీతాతగారి పాలనలో ఇట్టిదని మీకు తెలిపాము. ఇపుడు ఎవరి పాలన గొప్పది ఎవరి పాలన తక్కువైనది అన్నది మీరే అంచనా వేయండి.

చెప్పదలచిందేమంటే - 'సంసర్గతో దోష గుణా భవంతి.' సహవాసమెలాంటిదో ప్రవృత్తి అలాంటిది. బొగ్గుల వ్యాపారి చెయ్యి నల్లగానే వుంటుంది. మనము బొగ్గుల దుకాణంలోకి వెళ్తే మన బట్టలు కూడా నలుపవుతాయి. సహవాసమెలావుంటే ప్రవృత్తి అలా వుంటుంది. చేసిన సహవాసం ప్రభావం తప్పక వుంటుంది. మన పైన కలిగిన ప్రభావంతో మనమే అంచనా వేసుకోవాలి. ఇదే నిజమైన పరీక్ష. నేను ఇక్కడ చెప్పిన యుక్తి ఎంత బలము గలదంటే దీనిని గూర్చి ఎవరినీ అడుగవలసిన అవసరం లేదు.

**నారాయణ! నారాయణ!! నారాయణ!!!**



# 12. సత్యమహిమ

ఒక సత్యవాదియైన రాజు వుండేవాడు. అతని నగరంలో ఎవరైనా మామూలు వ్యక్తి అమ్మకానికి అన్నము, వస్త్రము మొదలైన ఏదేని వస్తువును బజారుకి తెస్తే సాయంకాలం వరకు అది అమ్ముడు కాకపోతే రాజేదానిని కొనేవాడు. ప్రజల మేలు కోసం ఇది రాజుగారి సత్యప్రతిజ్ఞ. కాబట్టి తమ వస్తువును వుంచుకొని కూర్చున్నట్లు చూస్తే వారిని అడిగి వారి సంతోషం ప్రకారం వెల చెల్లించి ఆ వస్తువును కొని తెచ్చేవారు.

ఒకనాటి మాట. ధర్మరాజు స్వయంగా బ్రాహ్మణుని వేషాన్ని ధరించి ఇంటిలోని పనికిరాని వస్తువులను, పారవేయాల్సిన వాటిని, ఒక పెట్టెలో నింపి ఆ సత్యవాది, ధర్మాత్ముడు అయిన రాజును పరీక్షించడానికి అతని నగరానికి వచ్చాడు. వాటిని అమ్మడానికి బజారులో కూర్చున్నాడు కానీ పనికిరాని వాటిని ఎవరు కొంటారు? సాయంకాలము అయినపుడు రాజుగారి సేవకులు ఎప్పటివలెనే నగరంలో తిరుగసాగారు. నగరంలో అమ్మకానికి ప్రజలు తెచ్చినవన్నీ అమ్ముడు పోయినాయి. కేవలమీ బ్రాహ్మణుడు తన పెట్టె తీసుకుని కూర్చున్నాడు. రాజుసేవకులు అతడిని సమీపించి అడిగారు, 'మీ వస్తువులు అమ్ముడుపోలేదా?' అనగా, 'అమ్ముడు పోలేదు' అన్నాడతను. 'మీరు అమ్మడానికి ఈ పెట్టెలో ఏమి తెచ్చారు దాని వెల ఏమిటి?' అని రాజసేవకులు అడిగారు. బ్రాహ్మణుడన్నాడు, 'దీని నిండా దారిద్ర్యమే వుంది. దీని వెల ఒక వెయ్యి రూపాయలు,' అనగా విని రాజసేవకులు నవ్వి అన్నారు. 'పనికిరాని వస్తువులు ఎవరు కొంటారు? దీనికి ఒకపైస కూడా విలువరాదు.' అనగా, బ్రహ్మణుడు 'ఎవరూ తీసుకోకపోతే దీనిని నేను ఇంటికి తిరిగి తీసుకొని వెళతాను' అన్నాడు. వెంటనే రాజసేవకులు రాజు దగ్గరికి వెళ్ళి దీనిని సూచించారు. దానికి రాజన్నాడు, 'అతడు ఆ వస్తువును తీసుకువెళ్లనివ్వకండి. తక్కువలో తక్కువ ఎంత వెల అయితే అంత ఇచ్చి అతడిని సంతోషబెట్టి ఆ వస్తువును కొని తీసుకురండి.'

రాజ సేవకులు వచ్చి ఆ పెట్టెకు రెండువందల రూపాయలు వెల చెల్లిస్తామని బ్రాహ్మణునికి చెప్పారు. కానీ వెయ్యి రూపాయలకు ఒక పైస

కూడా తక్కువ తీసుకోవడానికా బ్రాహ్మణుడు ఒప్పుకోలేదు. రాజసేవకులు ఐదువందల రూపాయల వరకు ఇవ్వడానికి ఒప్పుకున్నా బ్రాహ్మణుడు ఒప్పుకోలేదు. అపుడు రాజసేవకులలో ఒకడు కోపించి రాజుగారి దగ్గరికి వెళ్ళి, 'మహారాజా! అతని పెట్టెలో దరిద్రమే నిండివుంది. పైసా ఖరీదు చెయ్యదు. ఐదువందలు ఇస్తామన్నా అతనివ్వడం లేదు. ఈ స్థితిలో మీరు అతని వస్తువును కొనవద్దు,' అని చెప్పాడు. దానికి రాజు 'లేదు, నా ప్రతిజ్ఞ నిజమైనది. మేము సత్యాన్ని ఎప్పుడూ విడవం. కాబట్టి, ఆ బ్రాహ్మణునికి అడిగినంత ఇచ్చి ఆ వస్తువునుకొని తీసుకురండి,' అన్నాడు. ఇది విని రాజసేవకులు రాజుగారి ఈ పట్టుదలనుచూసి నవ్వి తిరిగి వచ్చారు. ఏ ఉపాయమూ లేక వారు వెయ్యి రూపాయలనిచ్చి బ్రాహ్మణుని పెట్టెను తీసుకున్నారు. బ్రాహ్మణుడు వెయ్యిరూపాయలను తీసుకొని వెళ్ళిపోయాడు. రాజసేవకులు పెట్టెను రాజు వద్దకు తెచ్చారు. రాజు దరిద్రం నిండిన ఆ పెట్టెను రాజభవనంలో పెట్టించాడు.

రాత్రి, నిద్రించే సమయాన, రాజమహలు యొక్క ద్వారం నుండి వస్త్రాభరణాలతో చక్కగా అలంకరింపబడ్డ ఒక అందమైన యువతి బయటకు వచ్చింది. రాజు బయట గోష్ఠిలో కూర్చున్నాడు. ఆ స్త్రీని రాజు అడిగాడు 'మీరెవరు? ఏ పనిమీద వచ్చారు? ఎందుకు వెళుతున్నారు?' అనగా ఆ స్త్రీ 'నేను లక్ష్మిని. మీరు సత్యవాది, ధర్మాత్ములు. ఈ కారణంగా నేను చాలాకాలంగా మీ నివాసంలో నివసిస్తున్నాను, కానీ ఇప్పుడు మీ ఇంటిలోకి దారిద్ర్యము వచ్చింది. ఎక్కడ దారిద్ర్యముంటున్నదో అక్కడ లక్ష్మి వుండదు. ఇందుకే నేను మీ నివాసం నుండి వెళ్ళిపోతున్నాను,' అన్నది. అపుడు రాజు 'మీ ఇష్టం' అన్నాడు.

కొద్ది సేపటి తరువాత ఒక అందమైన యువకుడు రాజభవనం నుండి బయటికి రావడాన్ని రాజు చూశాడు. అతడి నడిగాడు, 'మీరు ఎవరు? ఎలా వచ్చారు? ఎక్కడికి వెళ్తున్నారు?' అనగా ఆ సుందర యువకుడన్నాడు, 'నాపేరు దానము. మీరు సత్యవాది, ధర్మాత్ములు అని ఇంతకాలము మీ ఇంటిలో నివసిస్తూ వచ్చాను. ఇప్పుడు లక్ష్మి ఎక్కడికి వెళ్ళిపోయిందో నేనూ అక్కడికే వెళ్తాను. ఎందుకంటే లక్ష్మి వెళ్ళిపోయినాక దానమెలా వుండగలదు?' అనగా రాజు, 'చాలామంచిది' అన్నాడు.

ఆ తరువాత ఒక సుందర పురుషుడు బయటికి వస్తూ కనిపించాడు.

రాజు అతడిని కూడ అడిగాడు. 'మీరెవరు? ఎలా వచ్చారు? ఎక్కడికి వెళ్తున్నారు?' అనగా అతడు చెప్పాడు. 'నేను యజ్ఞాన్ని, మీరు సత్యవాది, ధర్మాత్ములు కాబట్టి మీ నివాసంలో నివసిస్తూ వచ్చాను. ఇప్పుడేమో లక్ష్మి దానము ఇద్దరూ మీ నివాసం నుండి వెళ్ళిపోయారు, నేను కూడా అక్కడికే వెళ్తాను. ఎందుకంటే సంపత్తి లేకపోతే మీరు యజ్ఞాన్ని ఎలా అనుష్ఠిస్తారు?' అనగా రాజు 'మంచిది' అన్నాడు.

ఆ తరువాత ఒక యువకుడు కనిపించాడు. రాజు అడిగాడు. 'మీరెవరు? ఎలా వచ్చారు? ఎక్కడికి వెళ్తున్నారు?' అనగా అతడు చెప్పాడు. 'నా పేరు యశస్సు. మీరు ధర్మాత్ముల, సత్యవాది అని ఇంతకాలము మీ నివాసంలో వున్నాను. కానీ మీవద్ద నుండి లక్ష్మి, దానము, యజ్ఞము అన్నీ వెళ్ళిపోయాయి. అవి లేకుండా యశస్సు ఎలా వుంటుంది? అందుకే నేను కూడా అవి వెళ్ళిన చోటికే వెళ్తున్నాను.' అనగా రాజు 'సరే' అన్నాడు.

ఆ తరువాత ఒక సుందరమైన పురుషుడు బయటికి వచ్చాడు. అతడిని చూసి రాజు అతడిని కూడా అడిగాడు. 'మీరెవరు? ఎలా వచ్చారు? ఎక్కడికి వెళ్తున్నారు?' అనగా అతడు ఇలా అన్నాడు. 'నా పేరు సత్యము. మీరుధర్మాత్మాలు కాబట్టి ఇంతకాలమూ ఇక్కడ వుంటూ వచ్చాను. కానీ ఇప్పుడు ఇక్కడ నుండి మీ లక్ష్మి, దానము, యజ్ఞము, యశస్సు అన్నీ వెళ్ళిపోయాయి. నేనూ అక్కడికే వెళ్ళిపోతాను.' అనగా రాజు 'నేను మీ కోసము వీటి నన్నిటినీ త్యజించాను. మిమ్మల్ని నేను ఎప్పుడూ త్యజించలేదు కదా! కాబట్టి మీరు ఎలా వెళ్తారు? నేను లోకానికి ఉపకారము జరగాలని, నా నగరంలో అమ్మకానికి ఎవరు ఏది తెచ్చినా సాయంకాలం వరకు అది అమ్ముడుకాకపోతే నేనే కొంటానన్న సత్యప్రతిజ్ఞను చేశాను. ఈ రోజు ఒక బ్రాహ్మణుడు దారిద్ర్యాన్ని తీసుకొని అమ్మడానికి వచ్చాడు. అది ఒక పైసా విలువకూడా చెయ్యదు. కానీ సత్యాన్ని రక్షించాలని నేను ఆ దారిద్ర్యాన్ని అమ్మే బ్రాహ్మణునికి వెయ్యి రూపాయలనిచ్చి ఆ దారిద్ర్యాన్ని కొన్నాను. అపుడు లక్ష్మి వచ్చి నీ ఇంటిలో దారిద్ర్యము నివసిస్తుంది. కాబట్టి నేను వుండలేను అన్నది. ఈ కారణంగానే ఇక్కడి నుండి ఐశ్వర్యము మొదలైనవన్నీ వెళ్ళిపోయాయి. ఇలా జరిగిన నేను మీ బలంపైననే ఆధారపడివున్నాను,' అన్నాడు. అది విని సత్యమన్నది 'నా కోసమే మీరు ఇదంతా చేసినపుడు నేను

మిమ్మల్ని వదిలివెళ్ళను!' ఇలా అని అతడు రాజమహలుకి తిరిగి ప్రవేశించాడు.

కొద్దిసేపటి తరువాత 'యశస్సు' తిరిగి రాజుగారివద్దకు వచ్చింది. రాజు అడిగాడు, 'మీరెవరు? ఎందుకు వచ్చారు? అని అతడన్నాడు. 'నేను పూర్వపు యశస్సునే. మీదగ్గర సత్యము విరాజిల్లుతుంది. ఎవడు ఎన్ని యజ్ఞాలను చేసేవాడైనా, దానాన్ని చేసేవాడైనా, ఐశ్వర్యవంతుడైనా సరే సత్యము లేకుండా నిజమైనకీర్తి కలుగదు. కనుక సత్యమెక్కడ వుంటే నేనూ అక్కడే వుంటాను' అనగా రాజు 'మంచిది' అన్నాడు.

ఆ తరువాత 'యజ్ఞము' వచ్చింది. రాజు 'మీరెవరు? ఎందుకు వచ్చారు?' అని అడుగగా యజ్ఞము చెప్పింది. 'నేను మునపటి యజ్ఞాన్నే. సత్యమెక్కడ వుంటే నేనూ అక్కడే వుంటాను. ఎవరు ఎంత దానశీలురైనా, లక్ష్మీవంతులైనా సత్యము లేకుండా యజ్ఞము శోభించదు. మీ వద్ద సత్యమున్నది. కాబట్టి నేను ఇక్కడే వుంటాను.' అనగా రాజు 'మంచిది' అన్నాడు.

ఆ తరువాత 'దానము' వచ్చింది. రాజు దానాన్ని కూడా అడిగాడు, 'మీరెవరు? ఎందుకు వచ్చారు?' అని. దానము చెప్పింది, 'నేను మునుపటి దానాన్నే. మీలో సత్యము ప్రకాశిస్తుంది. సత్యమెక్కడ వుంటే నేనూ అక్కడే వుంటాను. ఎందుకంటే ఎంతటి సంపన్నుడైనా సద్భావము లేకుంటే దానమివ్వలేడు. మీ దగ్గర మీ సత్యమున్నది కాబట్టి నేను ఇక్కడే వుంటాను.' అనగా రాజు 'సరే' అన్నాడు.

ఆ తరువాత 'లక్ష్మి' వచ్చింది. రాజు అడిగాడు, 'మీరెవరు? ఎందుకు వచ్చారు?' అనగా ఆమె చెప్పింది. 'నేను మునుపటి లక్ష్మిని. మీ దగ్గర మీ సత్యము ప్రకాశిస్తుంది. మీదగ్గరికి యశస్సు, యజ్ఞము, దానము కూడా తిరిగివచ్చాయి. కాబట్టే నేనూ తిరిగివచ్చాను.' అంటే రాజన్నాడు, 'దేవీ! నా దగ్గర దారిద్ర్యము నిండి వున్నది కదా! మీరెలా నివసించగలరు?' అనగా లక్ష్మీదేవి అన్నది, 'రాజా! ఏమైనా సరే. నేనుసత్యాన్ని విడిచి వుండలేను.' అనగా 'మీ ఇష్టం' అన్నాడు రాజు.

ఆ తరువాత స్వయంగా ధర్మరాజే బ్రాహ్మణుని రూపంలో అక్కడికి వచ్చాడు. రాజు అడిగాడు. 'మీరు ఎవరు? ఎలా వచ్చారు?' అనగా ధర్మరాజు చెప్పాడు. 'నేను సాక్షాత్తు ధర్మాన్ని. నేనే బ్రాహ్మణ రూపాన్ని ధరించి వెయ్యిరూపాయలకు మీకు దారిద్ర్యాన్ని అమ్మాను. మీరు సత్యం యొక్క బలంతో ధర్మాన్ని జయించారు. నేను మీకు వరమివ్వాలని వచ్చాను.

చెప్పండి! మీ కిష్టమైన దేమి చెయ్యాలి?' అనగా రాజు అన్నాడు, 'మీ దయ, నాకేమీ వద్దు. మీరు ఇంతకాలమూ చేస్తూ వున్నట్లే చేస్తూ వుండండి.'

ఈ ఉదాహరణంతో తేలేదేమంటే సత్యమెక్కడ వుంటుందో అక్కడ అంతా వుంటుంది. అక్కడ ఎప్పుడైనా సంపత్తి, దానము, యజ్ఞము, యశస్సుల కొరత వుంటే మనిషి భయపడకూడదు. సత్యము స్థిరంగా వుంటే అన్నీ తిరిగి వస్తాయి. రాకపోతే కూడా హాని ఏమీ లేదు. అది చాలా మేలు. కాబట్టి హితాన్ని కోరేవాడు సత్యాన్ని ఎప్పుడూ విడువరాదు. పైగా నిష్కామభావంతో సత్యాన్ని దృఢంగా పాలించాలి.

యథార్థాన్ని చెప్పడం, సద్గుణాలు, సదాచారము వీటి పేరే సత్యము. భగవానుడు గీతలో చెప్పాడు-

**సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥**
**యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాऽభిధీయతే ॥**

**(17/26-27)**

సత్ అనేది పరమాత్మ యొక్క అస్తిత్వంలో (సత్యభావంలో) శ్రేష్ఠభావంలో (సద్గుణము) ప్రయోగింపబడుతుంది. అలాగే అర్జునా! ఉత్తమ కర్మలో కూడా 'సత్' శబ్దము ప్రయోగింపబడుతుంది. అలాగే యజ్ఞము, తపస్సు మరియు దానములలో స్థితి (నిష్ఠ) కూడా 'సత్' అనబడుతుంది. ఆ పరమాత్మ కోసం చెయ్యబడే కర్మ (భగవదర్థం చేయడే కర్మ) నిశ్చయంగా 'సత్' అనబడుతుంది. ఎవరో కవి అన్నమాట ప్రసిద్ధమే -

**బందా సత నహిఁ ఛాండియే సత ఛాండే పత జాయ ।**
**సతకీ బాంధీ లచ్ఛమీ ఫేర మిలైగీ ఆయ ॥**

సోదరులారా! సత్యాన్ని ఎప్పుడూ విడువకండి. సత్యాన్ని విడువడం వల్ల అంతా మనల్ని వదిలిపోతుంది. ఎందుకంటే సత్యముచేత బంధింపబడిన ఐశ్వర్యము, లక్ష్మి తిరిగివస్తుంది.

హరిః ఓం తత్సత్